# చతుర

నవంబర్ 2001
రూ.7/-



డాక్టర్ కృష్ణ ... వసుధ

# చతుర ప్రపంచం

## ప్రాణం కాపాడిన మొబైల్‌ఫోన్...

ఈ రోజుల్లో మొబైల్ ఫోన్ పట్టుకుని తిరగడం చాలా ఫ్యాషన్... ముఖ్యంగా రోడ్డుమీద నిల బడినప్పుడో, బస్‌లోనో లేదా సినిమా మధ్య లోనో ఫోన్ మోగితే వారి ఆనందం వరనా తీతం. మిగతావారికన్నా తామెన్నో మెట్లు పైనున్నట్టు ఫీలవుతారు. అలా అని అదేమైనా ముఖ్య సమాచారమా అంటే మీరు పొరపడినట్టే... ఎక్కడో తప్ప అధికశాతం మొబైల్ వినియోగదారులు మాట్లాడుకునేవన్నీ పోచుకోలు కబుర్లే. అయితే సరిగా ఉపయోగించుకుంటే మొబైల్ ఫోన్ మీ ప్రాణం కాపాడుతుంది అంటున్నాడు. నార్వేకి చెందిన ఓ వినియోగదారుడు. అందుకు తన జీవితంలో జరిగిన ఘటననే ఉదహరిస్తున్నాడు కూడా.




ఓరోజు కొందరు గుర్తుతెలియని వ్యక్తులు అతన్ని గాయపరిచి కార్‌లో తీసుకుపోయి ఓ అడవిలో వదిలేసి వెళ్ళిపోయారు. అతన్నించి అన్నీ దోచుకున్నారు గానీ అతనిదగ్గర ఓ మొబైల్ ఫోన్ ఉన్న సంగతి వారికి తెలీదు. హఠాత్తుగా అతనికా విషయం గుర్తుకొచ్చిందిట. ఇంకేం వెంటనే శరీరంలోని ఓపికంతా గొంతులోకి తెచ్చుకుని ఫోన్‌తీసి పోలీసులకి ఫోన్‌చేశాడు. అదృష్టవశాత్తూ పోలీసులు కూడా అతనెక్కడున్నాడనేది త్వరగానే కనిపెట్టగలిగారు. ఫలితంగా కొన ప్రాణంతో కొట్టుకుంటున్న అతన్ని రక్షించగలిగారు.

అదిగో అప్పటినుంచి అడిగినవారికీ, అడగనివారికీ సైతం ఈ సంఘటన గురించి వివరిస్తూ సెల్‌ఫోన్ ఎలా ఉపయోగించాలి! ఎలా మాట్లాడాలి అనేదానిమీద క్లాసులు తీసుకుంటున్నాడట. అతన్ని ఇండియాకి కూడా పిలిపిస్తే బాగుంటుందేమో!



# భవిష్యత్తులో పిల్లల్ని కనాలంటే భయం!

అనగనగా ఓ అబ్బాయి. దురదృష్టవశాత్తు అంగవైకల్యంతో పుట్టాడు. అయినా తల్లితండ్రులకి అతనంటే ప్రేమే. కానీ ఆ పిల్లాడు మాత్రం తోటి పిల్లల్ని చూసి అయ్యో తను అలా లేనే అని బాధపడేవాడు. ఆ ఆత్మన్యూనత అతనితో




పాటు ఎదుగుతూ వచ్చింది. కొంచెం పెద్దయ్యాక ఓ లాయర్‌ని కలిశాడు. ఫలితంగా తల్లితండ్రులు కోర్టుకెళ్లాల్సి వచ్చింది. ఇంతకీ కేసు ఏంటంటే తను గర్భంలో ఉన్నప్పుడు తల్లి స్కానింగ్ ఎందుకు చేయించుకోలేదు? రిపోర్ట్స్‌లో తనకు అంగవైకల్యం ఉందని తెలిసి ఎందుకు అబార్షన్ చేయించుకోలేదో సమాధానాలు కోరుతూ ఆ పిల్లాడు కోర్టుకెళ్లాడు. అంటే ఇలా అంగవైకల్యంతో బతకడం కన్నా అసలు పుట్టక పోవడమే మంచిదని ఆ పిల్లాడి అభిప్రాయమన్నమాట. సరే కోర్టు తీర్పులు, వాద ప్రతివాదాలు పక్కన పెట్టేద్దాం. ఎందుకంటే అసలిలాంటి కేసులు కోర్టులు స్వీకరిస్తాయా అనేది ఇక్కడ ప్రశ్న.

కాలిఫోర్నియాలో ఓ న్యాయస్థానంవారు 'ఏం ఇందులో తప్పేం ఉంది? భేషుగ్గా ఇలాంటి కేసులు స్వీకరించచ్చు' అని చెప్తున్నారు. అంటే ఫలాన తల్లితండ్రులకి పుట్టడం పిల్లలకి నచ్చకపోతే సరాసరి కోర్టుకెళ్లి వారిమీద కేసు వేసేయవచ్చన్న మాట.

ఒక్క అంగవైకల్యమేనా? అంటే... కాకపోవచ్చు, తమని అందంగా పుట్టించలేదని, తెలివితేటలు తక్కువగా ఉన్నాయని ఇంకా ముందుకెడితే తల్లితండ్రులు డబ్బున్న వాళ్లుకాదని ఇలా ఎన్నో రకాల కేసుల్ని మనం చూడచ్చు, ఇదంతా ఇక్కడి సంగతి కాదు లెండి. అలా అని మనం తేలికగా ఊపిరి పీల్చుకోలేం. ఎందుకంటే ఇప్పుడు కాలిఫోర్నియా మనకేమంత దూరమని సమాచారం అందుకోడానికి?

ఇదంతా పక్కన పెడదాం. ఏ పిల్లలైనా తల్లితండ్రులు తమకు మంచీ మానవత్వం నేర్పలేదని కేసు పెడతారంటారా? ఏమో ఆ అవకాశం లేకపోవచ్చు ఏదిఏమైనా ఇదంతా చూస్తుంటే భవిష్యత్తులో పిల్లల్ని కనాలంటే తల్లితండ్రులు భయపడే అవకాశం మాత్రం ఉంది.




# సెన్సేషన్

మామూలుగా మనం సమాజ సేవని బయలుదేరితే జనం అంతగా స్పందించరు. అదే సినిమా తారలు పూనుకుంటే ఉన్నదంతా దోచి పెట్టడానికి కూడా ప్రజలు వెనుకాడరు. ఇది ఒక రకం విరాళాల సేకరణ.

మరొక రకముంది. అదేంటంటే అందరి లాగ కాకుండా భిన్నంగా ఆలోచించటం. దాన్ని అమలు పరచడంలో ఓ సెన్సేషన్ క్రియేట్ చేస్తే కూడా అనుకున్నది సాధించచ్చు. అయితే ఇక్కడ యావత్ ఫలితం మనం క్రియేట్ చేయబోయే సెన్సేషన్ మీద ఆధారపడి ఉంటుంది.

అదిగో సరిగ్గా అలాంటి పనే చేశారు ఓ పదకొండు మంది ఆంటీలు. ఇంగ్లాండ్‌కు చెందిన ఈ ఆంటీలు బ్లడ్‌క్యాన్సర్‌తో బాధ పడే వారికోసం నిధులు సేకరించాలనుకున్నారు. కానీ జనం పెద్దగా స్పందించలేదు. పైగా ఈ వయసులో కృష్ణా, రామా అనుకోక ఎందుకొచ్చిన తిప్పలివి అని కేకలేశారుకూడా. కారణం వాళ్లంతా నలభై ఏళ్లు పైబడినవారే. కొందరికి అరవై ఏళ్లు కూడా ఉన్నాయిలెండి.

ఆంటీలు మాత్రం వెనక్కి తిరగదలుచుకోలేదు. మంచిగా చెప్తే విననప్పుడు జనం బలహీనతల్ని క్యాష్ చేసుకున్నా తప్పులేదు. అందునా మనం చేసేది సత్కార్యమైనప్పుడు అస్సలు తప్పులేదని డిసైడ్ చేసుకున్నారు. అంతే ఓ శుభోదయాన వీళ్ల ఫొటోలతో ఉన్న క్యాలెండర్లు మార్కెట్లో రిలీజై హాట్ కేక్స్‌లా అమ్ముడుపోయాయి. ఇందులో అంత సెన్సేషన్ ఏముందని మీకనిపించచ్చు. అక్కడే ఉంది విషయమంతా. మొత్తం పదకొండు మంది ఆంటీలూ నగ్నంగా ఫోజిచ్చారు. పదకొండు నెలలకు తలాఒకరి ఫొటోవేసి చివరి నెలలో అంటే డిసెంబర్‌కి మాత్రం మొత్తం పదకొండు మందీ కలిసి ఫోజిచ్చారు. ఈ ఆంటీల నగ్న ప్రదర్శన ప్లాన్ సూపర్‌డూపర్ హిట్టయ్యింది. క్యాలెండర్లు అన్నీ అమ్ముడైపోయాయి. ఆంటీలు సరే, టీనేజ్ అమ్మాయిలతో ఇలాంటి క్యాలెండర్ విడుదలైతే బాగుండునని ఎదురు చూస్తున్నారట.

★



# చతుర

సంపుటి 24 సంచిక : 10 నవంబర్ : 2001
286వ సంచిక

గుడిసెలో పుట్టి చిన్నప్పుడే తల్లిదండ్రులను కోల్పోయిన ఆ అమ్మాయి... ఓ ధనికునింట్లో పనిపిల్లగా చేరింది. ఇంటి యజమాని కామప్రకోపాలనుంచి తప్పుకుని ఓ మంచిమనిషి ద్వారా మరో ఊరి మిషనరీ స్కూల్లో చదువుకుంది. అటుపైన అనుకోనివిధంగా ఓ డాక్టర్ వద్ద నర్స్‌గా చేరింది. అయితే... ఆ అమ్మాయి జీవితం అంతటితో గట్టెక్కలేదు.

ఆమె ఒంటరిజీవితం అనుక్షణం అనూహ్యమైన మలుపులు తిరుగుతూనే వుంది. ఆమెకు తారసపడిన ఎందరో విచిత్ర వ్యక్తులు కాలగమనంలో కనుమరుగయ్యారు.

చివరికి... ఆమెకు మిగిలిన గమ్యం ఏమిటి? అది ఆమె జీవితానికిచ్చిన అర్థం ఏమిటి? ఆసక్తికర సంఘటనల అక్షరమాల

డాక్టర్ కృష్ణ రచన

# వసుధ

ఈనెల 'చతుర' సమగ్ర నవల.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఆ నిశీధిలో రెండు కేకలు వినపడ్డాయి.

ఒకటి ఆక్రోశం. రెండవది ఆర్తనాదం.

కమ్మని నిద్రలో పసిడి కలలు కంటున్న అయిదు సంవత్సరాల పసిది తల్లి గొంతులోని ఆక్రోశానికి ఉలికిపడింది. కళ్ళు తెరిచి, ఎదురుగా కన్పించిన భీభత్సపూరిత దృశ్యాన్ని చూసి ఆర్తనాదం చేసింది.

నేలమీద ఒకదాన్నొకటి పెనవేసుకున్న స్త్రీపురుషుల నిర్జీవ నగ్న శరీరాలు, వాటికి ఎదురుగా రక్తం ఓడుతున్న గొడ్డలితో నిలబడి వున్నాడు ఆ పిల్ల తండ్రి.

చుట్టుపక్కల గుడిశెల్లో కలకలం.

జుగుప్సాకరమూ, భీతావహమూ అయిన ఆ దృశ్యం ఆ పసిదానికి తల తిరిగేలా చేసింది.

తర్వాతేమయిందో దానికి తెలీదు.

★ ★ ★

ఆ పిల్ల కళ్ళు తెరిచేటప్పటికి గుడిశెలో ఎవరూలేరు. ఉట్టి, అందులోని కుండలు, గుడిశె గోడలకు అంటించి వున్న బొమ్మలను బట్టి అది తమ గుడిశె కాదని తెలుసుకుంది. తమ గుడిశె గోడలకి అన్నీ 'యమ్జీటి వోడి' బొమ్మలే. ఆడంటే అయ్యకి ఇష్టం.

దాని ఒంట్లో చాలా నీరసంగా ఉంది. కడుపులో ఆకలి కరకరమంటున్నది. ఏమయినా తినాలని వుంది. అమ్మ బేగె పనిలో నుంచి వచ్చేత్తే బావుండు అనుకుంది. దానికి వెంటనే అమ్మ గుర్తుకువచ్చింది. 'ఆరోజు అమ్మేటీ అలా గుడ్డల్లేకుండా రగతంలో... అమ్మేనా? ఏమో?' అంతలోనే మళ్ళీ నిద్ర...

తర్వాత చాలాసేపటికి దానికి మళ్ళీ మెలకువ వచ్చింది. ఎదురుగా పొయ్యి ముందు చంద్రమ్మ కూర్చునివుంది. కళ్ళువిప్పి చూసింది. "లేచినావా పిల్లా? దా... కూంత జావ తాగుదూగానీ" అంది.

ఆ పిల్ల లేచి వెళ్ళి చంద్రమ్మ పక్కన కూర్చుంది. చంద్రమ్మ మట్టిముంతలో జావ పోసి ఇచ్చింది. ఊదుకుంటూ గబగబా దాన్ని తాగింది. కానీ జీవితంలో ఆకలి తర్వాతే అమ్మ. ఆకలి చల్లారేక దానికి అమ్మ గుర్తుకువచ్చింది.

"అత్తా... అమ్మేదీ?"

ఆ ప్రశ్నకు రెండుక్షణాలపాటు చంద్రమ్మ ఏ సమాధానం చెప్పలేదు. కానీ పిల్ల ఆమె కళ్ళలోకి ఆరాగా చూస్తోంది.

"దేవుడు కాడకు పోయింది" అంది చంద్రమ్మ కొంచెం సంభాళించుకుని.

"ఎప్పుడొత్తాది?"

దీనికి మాత్రం చంద్రమ్మ వెంటనే సమాధానం చెప్పింది.

"ఇకరాదు"

విచిత్రం! పిల్లకు దిగులన్పించలేదు కడుపునిండబట్టి కాబోలు. చాలారాత్రివరకూ నిద్రమాత్రం పట్టలేదు. రోజూ మల్లెపూలూ, బజ్జీలు తెచ్చి అమ్మకిచ్చే మామయ్య ఎంతకూ రాలేదు. అతను వస్తే బావుండన్పించింది. చక్కగా వేడివేడి బజ్జీలు తినొచ్చు. అయ్య కూడా రాలేదు. అయినా అయ్య రాకుంటేనే మంచిది. అయ్య బజ్జీలు తీసుకురాడు. అమ్మనీ, తననీ తంతాడు. బూతులు తిడతాడు. అయినా, అమ్మలేదుగా! నిద్ర మెల్లమెల్లగా వచ్చి దాని కనురెప్పలమీద బరువుగా వాలింది.

★ ★ ★

"కర్రిదానా! లెగవే! పెద్ద మారాణిలా తొంగున్నావేంటి? లెయ్..." చంద్రమ్మ కేకలకి పిల్ల కళ్ళు తెరిచి చూసింది.

చంద్రమ్మత్తే! నిన్నటి ఆదరణ అంతా ఎటుపోయిందో మరి!

"పక్కగుడ్డలు మడతెట్టు"

కర్రిది వంగిచూసింది. తను పడుకున్న మురికిగోనెను మధ్యకు మడతపెట్టింది.

నెమ్మదిగా తీసుకువెళ్ళి గోడవారగా పెట్టింది.

"పల్లు దోముకో. ఆ విసయం గూడా చెప్పాలా?"

కర్రిది పళ్ళు తోముకుని లోపలకు వచ్చేస రికి చంద్రమ్మ వేడివేడి కాఫీ తాగుతోంది. కర్రిదానిక్కూడా కాఫీ తాగాలన్పించింది. కళ్ళు వెడల్పు చేసుకుని చంద్రమ్మకేసి చూసింది.

"ఏందట్టా సూత్తావ్? తోటలోకి పోయి పరిగేరుకురా" అని గదమాయించింది చంద్రమ్మ.

కర్రిదానికి చంద్రమ్మ ఏంచెప్పిందో అర్థం కాలేదు. కానీ అలా చూడకూడదనీ, తనని అక్కడినుండి పొమ్మంటున్నదనీ అర్థం అయి నీరసంగా బయటకు వచ్చింది.

చుట్టుపక్కల గుడిశెలవాళ్ళంతా చద్దిమూటలు కట్టుకుని, గుంపులు గుంపులుగా ఎటో పోతున్నారు. కర్రిదానికి తల్లి కూడా అలా పోవడం గుర్తుకొచ్చింది. అందరినీ పట్టిపట్టి చూసింది. వాళ్ళల్లో తల్లిలేదు. కానీ వెనక నుండి చంద్రమ్మ తన వీపుమీద చరిచిన చరుపుకి మాత్రం అది తూలి ముందుకు పడింది.

"ఏందీ? ఇంకా తోటలోకి పోలా?"

★ ★ ★

ఇప్పుడు కర్రిదానికి చాలా పనులొచ్చు. ఉదయమే లేచి, వాకిలి ఊడ్చి నీళ్ళు చల్లేది. పొయ్యికింద మంటపెట్టి, చంద్రమ్మ స్నానానికి నీళ్ళు కాచేది. అన్నం ఉడకేసేది. అంట్లగిన్నెలు తోమేది. పరిగ ఏరుకొచ్చేది.

చంద్రమ్మ మధ్యాహ్నంపూట 'రాగిసంకటి' పెట్టేది. రాత్రిపూట వరి అన్నం, గంజి పోసేది. ఎప్పుడయినా కూర కూడా పెట్టేది.

చంద్రమ్మకి మొగుడులేడు. ఇదివరకు ఉండేవాడేమో తెలీదు. పిల్లాజెల్లా లేరు. ఇన్నాళ్ళూ ఒంటరిగా వున్న చంద్రమ్మకి కర్రిదాని తోడు బాగానే వుంది. సౌకర్యంగా కూడా వుంది.

కర్రిదానికి 'రాత్రుళ్ళు చాలా భయంవేసేది. రక్తమూ, గొడ్డలీ, స్త్రీపురుషుల నగ్నత్వం, హృదయవిదారకమైన కేకలు... ఏవేవో గుర్తుకొచ్చేవి. చాలా దిగులుగా వుండేది.

రెండు సంవత్సరాలు అలాగే గడిచిపోయాయి.

ఒకరోజు చంద్రమ్మ గుడిసెకి ఒక మగమనిషి వచ్చాడు. మిఠాయి, పూలూ తెచ్చాడు. కర్రిదానికి బజ్జీల మామయ్య గుర్తుకొచ్చాడు. మామయ్య ఎప్పుడయినా ఒకటీ, అరా బజ్జీలిచ్చేవాడు. ఆ ఆశతోనే ఇతన్నీ చూసింది. అయితే ఈ మామయ్య దానికి ఏమీ ఇవ్వలేదు. చంద్రమ్మనూ, మిఠాయి మామయ్యనూ చూస్తే దానికెందుకో భయం వేసేది.

ఆ మగమనిషి పేరు నాయుడు. చంద్రమ్మతోపాటు కూలిపని చేస్తాడు. అక్కడే వాళ్ళిద్దరికీ పరిచయం అయింది. కర్రిదానికి రోజులు బాగానే గడుస్తున్నాయి. కానీ ఇంతలో చలికాలం ప్రారంభం అయింది. నాయుడు వచ్చిన దగ్గర్నుండీ దానిపక్క బయట అరుగుమీదకు మారింది. కప్పుకున్న చిరుగుల దుప్పటితో చలి ఆగేది కాదు. లోపలనుండి చంద్రమ్మ, నాయుళ్ళ కేరింతలు, గుసగుసలు వింటోంటే దానికెంతో భయం వేసేది.

★ ★ ★

నాయుడు ఒకరోజు పెందరాళే ఇంటికొచ్చాడు. వచ్చీరాగానే 'మంచంమీద పడి తలారా ముసుగుపెట్టేశాడు. సందెదీపాలు పెట్టాక, చంద్రమ్మ గుడిసెకి వచ్చింది రుసరుసలాడుతూ.

"బువ్వొండేవా?" అనడిగింది కర్రిదాన్ని.

కర్రిది తలూపింది.

"ఇంద... డబ్బుల్తీసుకో. రెండు గుడ్లు, పదిపైసల మిర్చి, పావలా ఉల్లిపాయలూ పట్రా. బేగి లగెత్తు. అట్టా సూత్తావేం?"

కర్రిది పరుగెత్తింది.

★ ★ ★

నాయుడికి మేస్త్రీతో గొడవ వచ్చి పని



పోయిందని చంద్రమ్మకి నాయుడిమీద కోపం వచ్చినా మళ్ళీ ఒంటరిగా ఉండలేక సర్దుకు పోయింది. ఇపుడు చంద్రమ్మ పని లోకి వెళ్తున్నది. నాయుడు కర్రిదానితో పాటు ఇంటిపనులూ, వంటా చేస్తున్నాడు.

'ఖాళీగా వున్న మానవుడి మెదడు దెయ్యాల కార్ఖానా' అన్నమాటల్లో ఎంతో సత్యం వుంది. నాయుడు కర్రిదానితో ఒళ్ళు పట్టించుకునేవాడు. కాళ్ళు పిసికించుకునే వాడు. వీపు తోమించుకునేవాడు. ఈ చర్య లన్నిటిద్వారా అతను వికృతమయిన ఆనందం పొందేవాడు.

కర్రిదానికి ఈ పనులు చేయడం పెద్ద అభ్యంతరంగా తోచలేదు. చంద్రమ్మకంటే నాయుడు భోజనం బాగా పెడుతున్నాడు. అత్తలా చీటికీ మాటికీ తన్నడు, మంచి వాడు. కానీ అతను తరచూ, ఆ పిల్లను ఒడిలో కూర్చోపెట్టుకుని బుగ్గలు నొక్కుతూ ఒళ్ళంతా తడుముతూ వుండేవాడు. ఈ చర్యమాత్రం దానికి చాలా అసౌకర్యంగా వుండేది. కానీ భయంవల్ల నోరు మెదిపేది కాదు. అత్తకు చెపుదామంటే ఆమె కూడా తననే దండిస్తుందేమోనని భయం.

అయితే కర్రిదాని అదృష్టం బావుండి, ఒక రోజు అటువంటి దృశ్యం చంద్రమ్మ కళ్ళప డింది. మునుపటి కంటే చంద్రమ్మకు వయసు పెరిగింది. వయసుతోపాటు తెలివి తేటలూ పెరిగాయి. ఈ వయసులో ఇంకో మగాడు ఆమెను చేరదీయడం దాదాపు అసంభవం. నాయుడిని వెళ్ళగొట్టడం ఆమెకు ఇపుడు లాభదాయకం కాదు. అందువల్ల ఆమె అతడిని పల్లెత్తుమాట అన లేదు. అసలు తను ఆ విషయాన్ని గమనిం చనట్టే వూరుకుంది. కానీ కర్రిదాన్ని మాత్రం ఇంటినుండి వెళ్ళగొట్టాలనుకుంది. ఉన్నప ళంగా ఆ అమాయకురాలిని వెళ్ళగొట్టడానికి ఆమె స్త్రీ హృదయం అంగీకరించలేదు. అవ

కాశంకోసం చూడసాగింది.



తెల్లని పెద్ద మేడ.

పెద్ద పెద్ద అరుగులతో, ఎగరటానికి సిద్ధంగా, రాజహంస రెక్కలు చాచుకున్నట్టు వుంది. చుట్టూ అల్లుకున్న లతలు.

చంద్రమ్మా, కర్రిదీ మిట్టమధ్యాహ్నం వేళ పట్నంలో బస్సుదిగి ఎదురైన ప్రతి వ్యక్తికీ తమ చేతిలోని కాగితం చూపిస్తూ అతి ప్రయాసతో అక్కడికి చేరారు.

'ఆ బాబు చెప్పిన ఆనవాలు ప్రకారం ఈ యిల్లే అయుండాల' అనుకుంది చంద్రమ్మ.

"బాబూ! బాబూ!" అని తలుపు తట్టి తట్టి విసిగి గోడవారగా కూర్చున్నారు ఇద్దరూ. గుమ్మంముందు కట్టిన ధాన్యపు గుత్తిలో నుండి వడ్లు ఏరుకుంటోన్న పిచ్చుకల అల్లరి తప్ప వాతావరణం నిశ్శబ్దంగా వుంది.

అంత ఎండలో బస్టాండునుండి నడిచి వచ్చారేమో ఇద్దరికీ ఆకలీ, దాహమూ, నిస్స త్తువా ముప్పిరిగొన్నట్టుగా వున్నాయి. కాళ్ళు బొబ్బలెక్కి మంటలు పెడుతున్నాయి. మధ్యమధ్యలో కర్రిది చంద్రమ్మ కొనిచ్చిన జంతిక నములుతూ చేస్తోన్న చప్పుడు విచి త్రంగా వుంది.

"ఎవరికోసం వచ్చారు? "

ఆ ప్రశ్నకు ఇద్దరూ ఒకేసారి తలపైకెత్తి




చూశారు. మేడమెట్లమీద నుండి దిగి వస్తోన్న ఆ స్త్రీమూర్తి దేవలోకంలో నుండి తమ కోసమే దిగి వస్తోన్న దేవకన్యలా తోచింది ఇద్దరికీ. తెల్లనిచీరె, తెల్లనిజాకెట్టు, తలంటుకుని వదిలేసిన పొడవాటి జుట్టు, కర్రిది కళ్ళు విప్పార్చుకుని చూసింది.

"సూర్రావు బాబుగోరిల్లు ఇదేనా?" చంద్రమ్మ అడిగింది.

"అవును ఏం...?"

"ఆ అయ్యకి పనిగుంట ఖావాల్నంటే పట్టు కొచ్చినాను"

"ఎవరూ? పనిచేసేది ఈ పిల్లా?"

"అవునమ్మా! కసువూడుత్తది. గిన్నెలు తోముద్ది. పరిగె... ఏరుకొత్తది" అనబోయి తన తెలివితక్కువకి తనే ఓ మొట్టికాయ వేసుకుంది.

"సిన్నసిన్న పనులన్నీ సేత్తదండీ. గెహింపు సెక్తి ఎక్కువ. దగ్గరుండి నెమ్మదిగా చెప్పి సెయ్యించుకోవాలండి. అమ్మా, అయ్యాలేరు"

కర్రిది ఆల్చిప్పల్లాంటి కళ్ళతో ఆ స్త్రీమూర్తినే చూస్తోంది. మాట్లాడేటపుడు కదిలే ఎర్రని పెదవులు, తళుక్కుమని మెరుస్తున్న పలువరుస, గాలిలో సంగీతంలా వినవస్తోన్న ఆమెమాటలు... చాలా బావున్నాయి దానికి.

ఆమె తలుపుకు ఒకపక్కగా బిగించి వున్న కాలింగ్‌బెల్ నొక్కింది. లోపల ఎక్కడో 'కుహూ... కుహూ...' అని పిట్ట కూసిన శబ్దం అయింది. కర్రిది ఆశ్చర్యంలో మునిగి తేలుతూ వుండగానే... ఇంతక్రితం వాళ్ళిద్దరూ ఎంత బాదినా తెరుచుకోని తలుపు 'ఆలీబాబా నలభైదొంగలు' సినిమాలో 'ఓపెన్‌ససేమ్' మంత్రం విన్నదానిలా ఠక్కున తెరుచుకుంది. తలుపుకవతల చారల పైజమా యువకుడొకడు నిలబడి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటున్నాడు.

"మోహన్! మీ నాన్నగారు పనికి పిల్ల కావాలన్నారట. ఈమె తీసుకువచ్చింది" అని అతనికి చెప్పి 'లోపలకు రండి' అని చంద్రమ్మనూ, కర్రిదాన్నీ ఆహ్వానించింది. ఇద్దరూ బితుకుబితుకుమంటూ లోపలకు వచ్చి కూర్చున్నారు. ఫ్యాన్ ఆన్‌చేసి, లోపలినుండి చల్లటి మంచినీరు తెచ్చి ఇచ్చింది. మోహన్ కూర్చున్న సోఫాకి ఎదురు సోఫాలో కూర్చుని, "భోం చేస్తారా?" అనడిగింది. ఆ మాట వినగానే చంద్రమ్మ ముఖం విప్పారింది.

"నా తల్లి... నాతల్లే... ఉదయమనగా రెండుముద్దలు తిని బయలుదేరాం. పెట్టించమ్మా!"

చంద్రమ్మ మాటలకు నవ్వుకుని ఆమె లోపలికి వెళ్ళింది.

కర్రిది విస్మయంగా ఆ యింటిని నలుదెసలా పరికించి చూస్తోంది. ఆ ఇంట్లో పనంటే దానికి చాలా సంబరంగా వుంది. చంద్రమ్మ గుడిశె కంటే పదింతలు పెద్దదయిన ఆ మేడలో పని కూడా అంతకు పదిరెట్లు వుంటుందని ఆ చిన్ని బుర్రకి తట్టలేదు. చల్లని గాలి వీచే పంకాలు, అయిసు లాంటినీరు, పిట్టలా కువకువలాడే కాలింగ్ ఖెల్లూ... ఇంకా ఎన్ని విచిత్రాలున్నాయో అని కుతూహలపడింది.

"నీ పేరేంటి పాపా?" అనడిగాడు మోహన్ ఆవలిస్తూ చిటికెవేసి. కర్రిది పుట్టాక, ఈ పదేళ్ళలోనూ దాన్నెవరూ పాపా! అని పిలవలేదు. అందువల్ల మోహన్ అడిగిన ప్రశ్న తననే అని అది గ్రహించలేకపోయింది. పెద్దపెద్ద కళ్ళతో గోడలకున్న ప్రకృతి దృశ్యాలను, ఎదురుగా వున్న అలమార్లలోని గాజుతలుపుల వెనకాలవున్న అందమయిన బొమ్మలను చూస్తోంది. మధ్యమధ్య రెండు చేతులతోనూ తలగోక్కుంటూ వుంది. చంద్రమ్మ దాని నెత్తిన ఒక్కటి మొట్టి "నిన్నేనే కర్రిదానా?" అంది.

దానినుండి సమాధానం ఆశించని మోహన్, "నిర్మలా! నాన్నలేడు. హైద్రాబాద్

వెళ్ళాడు" అన్నాడు లోపలకు వెళ్ళిన యువతినుద్దేశించి. నిర్మల బయటకు వచ్చింది.

"అయ్యగారు ఊళ్ళోలేర్రట. నాలుగు రోజులు ఆగి రండి" అంది చంద్రమ్మతో. చంద్రమ్మకు కర్రిదాన్ని వెనక్కు తీసుకువెళ్ళడం సుతరామూ ఇష్టంలేదు.

"అయ్యొచ్చేవరకూ ఈ గుంట ఈడనే వుంటది బాబూ! సిన్నా, సితకా పనులు సేత్తది. ఓ ముద్దేస్తే పడుంటది" అంది.

నిర్మల వారిద్దరినీ పెరట్లోకి తీసుకువెళ్ళి వేడివేడి అన్నం పెట్టింది. ఆమె పావుగంటలో అన్నం వండి, వడ్డించెయ్యడం కర్రిదానికి పెద్ద అద్భుతంగా తోచింది.

"ఇంకొంచెం అన్నంపెట్టుకో. మజ్జిగ వేసుకో" అని నిర్మల అంటోంటే దాని మనసు కృతజ్ఞతాభావంతో బరువెక్కిపోయింది. ఇలా అన్నం తినటమేమిటి అలా నిద్ర వచ్చేసింది. దానికి మెలకువ వచ్చేటప్పటికి కనుచీకటి పడుతోంది. చంద్రమ్మలేదు.

దాని జీవితంలో మళ్ళీ ఎప్పుడూ అది చంద్రమ్మనుకానీ, నాయుడుని కానీ చూడనే లేదు.



కర్రిదాని జీవితంలో ఒక అధ్యాయం ముగిసింది. రెండవ అధ్యాయం సూర్యారావింట్లో మొదలయింది.

సూర్యారావుకి బీదతనం అంటే అసహ్యం. అతను బీదతనంలో పుట్టాడు. తప్పనిసరై ఆ బీదతనాన్ని భరించాడు. దానిని అనుక్షణమూ ద్వేషించాడు.

అందులోనుండి బయటపడటానికి అతను రెండు మార్గాలు ఎంచుకున్నాడు. మొదటిది ఎవరయినా లక్షాధికారి ఇంటికి అల్లుడవటం, రెండవది ఐ.ఎ.ఎస్ పాసవటం.

మొదటి మార్గానికి అనువుగా అతను బియ్యే చదివే రోజుల్లో తన క్లాస్‌మేట్ కుసుమని ప్రేమించానన్నాడు. ఆ మాట కుసుమ నమ్మింది. అందువల్ల తానూ అతన్ని ప్రేమించింది. కానీ ఆమె లక్షాధికారి తండ్రి బీద సూర్యారావుని అల్లుడిగా చేసుకోవటానికి అంగీకరించలేదు.

అతని రెండవ మార్గం అతన్ని కరుణించింది. అతను ఐ.ఎ.ఎస్ పాసయి కలెక్టరయ్యాడు. అప్పుడు కుసుమ తండ్రి తానే స్వయంగా వచ్చి కూతురిని చేసుకొమ్మని సూర్యారావుని అభ్యర్థించాడు. సూర్యారావు ఎగిరి గంతేసి ఒప్పుకోలేదు. తండ్రిని ఎదిరించి, తనను పెళ్ళిచేసుకోనందుకు అతనికి కుసుమమీద కొంత కినుకగా కూడా వుంది. కలెక్టరయ్యాక ఎన్నో సంబంధాలు పెద్ద మొత్తం కట్నం యిస్తామంటూ వస్తున్నాయి. వాటిల్లో ఒక సంబంధం నిశ్చయించుకోవటమా? లేక లక్షల ఆస్తికి ఏకైక వారసురాలు కుసుమని చేసుకోవటమా? అని అతను కొంతకాలం తర్జనభర్జనలుపడి, కుసుమను వరించటమే లాభదాయకమని నిర్ణయించుకున్నాడు.

అతను వెంటనే సంతోషంగా పెళ్ళికి ఒప్పుకోకుండా కొంత గడువు పిదప అంగీకారం తెలపడం కుసుమకు కూడా అసంతృప్తినే మిగిల్చింది. అతనికి తాను అక్కర్లేదేమో, తన ఆస్తికోసమే తనని ప్రేమించాడేమో, ఇప్పుడు పెళ్ళి కూడా అందుకే చేసుకుంటున్నాడేమో అనే అనుమానం మొలకెత్తింది. అయినా కుసుమ అతన్ని పెళ్ళాడింది. ఆస్తినీ, తండ్రినీ వదిలేసి కాపురానికి వచ్చింది. ఆమె తన వెంట అతను ఆశించినట్టు లక్షలేమీ తీసుకురానందుకు సూర్యారావు బాధపడ్డాడు. కానీ పైకి వెల్లడించలేదు.

నడమంత్రపుసిరి మనిషిని నిలవనివ్వదు. దానికి అధికారం తోడయితే యిక చెప్పేదేముంది? సూర్యారావుకి డబ్బూ, అధికారాలతో సంక్రమించే అన్ని దురలవాట్లు త్వరలోనే అలవడ్డాయి. ఆ అలవాట్లకు అతని జీతం చాలేది కాదు. కుసుమ ఉన్నంతలోనే సర్ది, సంసారం చేసేది. కానీ తండ్రి నుండి





డబ్బు తెచ్చేది కాదు. ఈ ఒడిదుడుకుల్లోనే మోహన్ పుట్టాడు.

జీతం వ్యసనాలకు చాలదు. భార్య పుట్టింటి నుండి డబ్బు తీసుకురాదు. సూర్యారావుకి 'అక్రమార్జన' తప్ప అన్యథా మార్గం తోచలేదు. విపరీతంగా లంచాలు పుచ్చుకునేవాడు. కుసుమ శారీరకంగానూ, మానసికంగానూ క్రుంగిపోయింది. ఆమె ప్రేమించిన సూర్యారావు ఇతను కాడు. పెళ్ళాడిన సూర్యారావుని ఆమె ప్రేమించలేక పోయింది. పరోక్షంగా అతను ఆమెను తండ్రివద్దనుండి డబ్బు తెమ్మని వేధించే వాడు. ఆమె మౌనమే ఆయుధంగా పోరాటం సాగించింది తప్ప అతని కోరికకు తల ఒగ్గలేదు. మోహన్ పుట్టిన పన్నెండు సంవత్సరాలకు ఆమె తిరిగి గర్భవతయింది. తండ్రి వచ్చి, కూతురి పరిస్థితి చూసి నెత్తీ, నోరూ బాదుకున్నాడు. 'ఆస్తి వాడి మొహాన పారేద్దాం' అన్నాడు. 'పోనీ నువ్వు బిడ్డతో మనింటికి వచ్చెయ్' అన్నాడు. కుసుమ దేనినీ అంగీకరించలేదు. ఆమెకు నెలలు నిండి కవలలు పుట్టారు. ఇద్దరూ మగపిల్లలే. మనిషికి జీవించాలనే ఆశలేదు. శరీరమూ అందుకు సహకరించలేదు.

"నాన్నా! ఆస్తిని సూర్యానికి యివ్వొద్దు నాన్నా!" అంది. అవే ఆమె ఆఖరి మాటలు.

కూతురు పోగానే ఆయన మనుమలు ముగ్గుర్నీ తీసుకుని, తనింటికి బయలుదేరాడు. సూర్యారావు పిల్లల్ని ఆయనకు ఇవ్వనన్నాడు. తనను ఆస్తికోసం పెళ్ళాడినందుకు ఆ ఆస్తిని అతనికి దక్కనివ్వకుండా కుసుమ సూర్యారావుని శిక్షిస్తే- పిల్లల్ని మామగారికి యివ్వకుండా అతను కొంతలో కొంత ప్రతీకారం తీర్చుకున్నాడు. ముసలాయన ఏమీ చేయలేక వెళ్ళిపోయాడే తప్ప అల్లుడితో రాజీకొచ్చి ఆస్తి అప్పగించలేదు. అవినీతి నిరోధకశాఖ పుణ్యమా అని సూర్యారావు ఉద్యోగం పోయింది. అయినా కుసుమ తండ్రికి జాలి కలగలేదు. తను పోయే ముందు మాత్రం ఆస్తిని పిల్లలు ముగ్గురికీ రాసి, అందులో సూర్యారావుకి ఏ ప్రమేయమూ లేకుండా చేసిపోయాడు.

ప్రస్తుతం సూర్యారావు వుంటున్న మేడ మామగారిదే. పొలాలున్నాయి. ఆదాయం వస్తుంది. అంతా పిల్లల పేరనే జమ అవుతుంది. మోహన్‌ని కలెక్టర్‌ని చేసి 'ఏసిబి' వాళ్ళకు దొరక్కుండా, ఎలా లంచాలు తిన వచ్చో జాగ్రత్తగా దగ్గరుండి నేర్పాలనుకున్నాడు. మోహన్ బుద్ధిగా చదువుకుని లెక్చరర్ అయ్యాడు. ముగ్గురు పిల్లలకూ తండ్రంటే చాలా భయం. సూర్యారావు వాళ్ళను దండించి కొంత, తాతగారి గురించీ, తల్లి గురించీ, వాళ్ళిద్దరూ కలిసి తనను పెట్టిన కష్టాల గురించి పిల్లలకు చెప్పి ఏడ్చి కొంతా, ఇంటికి ఎవరయినా వస్తే వాళ్ళ మధ్య పంచాయితీ పెట్టి, పిల్లల్ని 'ఎమోషనల్‌గా బ్లాక్‌మెయిల్' చేసి తన మాట వినేలా చేసుకుంటాడు. అతని మాట వినకపోతే వాళ్ళకు జీవితం నరకం. వాళ్ళకు అది అలవాటయిపోయింది. ఏమయినా మోహన్ తండ్రి కోరిక మేరకు కలెక్టరు కాలేకపోయాడు.

★ ★ ★

నిర్మల రాత్రి ఎనిమిది గంటలకు ట్యూషన్లన్నీ పూర్తి చేసుకొని వచ్చి, మేడ మెట్లు ఎక్కబోతూ సూర్యారావింట్లోకి తొంగి చూసింది. మోహన్ కవలసోదరులలో చిన్నవాడు రజనీకాంత్ కూర్చుని నోట్సు రాసుకుంటున్నాడు. "అన్నయ్యలేడు. రామసుబ్బారావు గారింటికి వెళ్లాడు" అన్నాడు, నిర్మల చూసేది అందుకోసమే అన్నట్టు. నిర్మల తలతిప్పి చూస్తే గోడకు ఆనుకుని కళ్ళు మూసుకుని వున్న కర్రిది కనుపించింది. నిద్రవల్లనో, నీరసం వల్లనో దాని కన్నులు మూతపడి వున్నాయి. మధ్యాహ్నం చంద్రమ్మ ఎక్కడ వదిలి వెళ్ళిందో అక్కడనే వుంది. నిర్మల హృదయం ద్రవించింది. దగ్గరకు వెళ్ళి భుజంమీద చెయ్యివేసింది.

దానినుండి కొట్టిన వాసనకు కడుపులో తిప్పి నట్టయింది. తమాయించుకుని కుదిపి లేపింది.

"ఆకలేస్తోందా? "

'బువ్వేట్టవా? ' అని ఒకటికి పదిసార్లు దేవిరించితేగానీ గంజి దొరకని కర్రిదానికి ఆకలేస్తోందా అని నిర్మల అడిగితే ఏనుగు ఎక్కినంత సంబరమయింది. గబగబా తల వూపింది.

"పద"

"ఈ అమ్మాయెవరక్కా? "

నిర్మల నళినీకాంత్ ప్రశ్నకు సమాధానం యివ్వలేదు.

"మళ్ళీ వస్తాను" అని మాత్రం అంది.

కర్రిది గేదెవెంట దూడలా నిర్మలను అనుసరించింది. మేడమీదకు వంగివున్న పక్కింటి బాదంచెట్టు నుండి ఆకులు తెంపి, పూచిక పుల్లలతో అస్తవ్యస్తంగా విస్తరికుట్టి, తను రాత్రికి వండి వుంచుకున్న అన్నమూ, పప్పు పెట్టింది. కర్రిది ఆ ఆకుమీదకు లంఘించి, ఒక మెతుకు కూడా మిగల్చ కుండా తినేసింది. తిన్న వెంటనే అక్కడే పడి నిద్రపోయింది.

★ ★ ★

ఉదయం కర్రిది లేచేసరికి బారెడు పొద్దె క్కింది. తలంటుకున్న నిర్మల తడి జుట్టు ఆరపెట్టుకుంటోంది. మేడమీద అటూఇటూ తిరుగుతూ నిద్రలేచిన కర్రిదాన్ని చూసి ప్రేమపూరితంగా నవ్వింది. ఆ నవ్వువల్ల తన వునికి మారిందనీ, తాను గుడిశెలో లేననీ గుర్తుకు వచ్చింది కర్రిదానికి. నిన్నటి కమ్మటి భోజనమూ, నిర్మల ఆదరణా గుర్తు కొచ్చి మనసంతా కృతజ్ఞతతో నిండింది.

"బాగా నిద్రపోయావా? "

తల వూపింది.

"ఆకలేస్తోందా? "

ఈసారి కర్రిదానికి ఎందుకో సిగ్గువేసింది. తలవంచుకుంది.





డాబా మూలనున్న తాటాకు బుట్టలో నుండి ఆకు తుంపి, ట్యూబు నుండి పేస్టు వేలిమీదకు వేసి "పళ్ళు తోముకో" అంది.

కర్రిది నోట్లో వేలుపెట్టుకుని ఆ రుచికి తట్టుకోలేక గుటుక్కున మింగేసింది.

"అరె! తినేశావా? తినకూడదు. చూడు. యిలా పళ్ళు తోముకోవాలి. అవిగో నీళ్ళు"

"వాట్ మేడమ్! ఈ పిల్లను ఉద్ధరిస్తు న్నావా? " అంటూ వచ్చాడు మోహన్.

"నన్ను నేనే ఉద్ధరించుకోలేనిదాన్ని. ఇంకొక రినేం ఉద్ధరిస్తాను మోహన్? "

మోహన్ నొచ్చుకున్నట్టు చూశాడు. మాట్లాడలేదు. నిర్మల లోపలకు వెళ్ళి రెండు ప్లేట్లలో ఇడ్లీలు తెచ్చింది. ఒకటి కర్రి దానికి యిచ్చింది.

"మోహన్! నీకు? "

"కావాలి నిర్మలా! ఆకలి దంచేస్తోంది. రమణమ్మగారు పని మానేసినప్పటినుండీ మేమంతా ఆకలితో అల్లాడిపోతున్నామ నుకో"

రమణమ్మ మోహన్ వాళ్ళ వంటమనిషి.

"అయ్యో! మధ్యాహ్నం వంట నేను చేసి పెడతానులే. అయినా... మోహన్! రమణ మ్మగారు పని ఎందుకు మానేసింది? " నిర్మల అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది.

ఆరేళ్ళ పసిపిల్ల నుండి అరవైయేళ్ళ ముస లమ్మవరకూ సూర్యారావుకి ఏ స్త్రీని చూసినా 'సెక్స్' మాత్రమే గుర్తుకువస్తుంది. రమ ణమ్మ మగదిక్కులేని స్త్రీ. ప్రతి మనిషీ తన లాగే కామవాంఛతో కొట్టుకుపోతూ వుంటా లనే భ్రమతో సూర్యారావు ఆమెను కౌగలిం చుకోబోయేసరికి దవడ పేలగొట్టి, పని మానేసి వెళ్ళిపోయింది. ఆ విషయం మోహన్‌కి తెలుసు. నిర్మల వూహించగ లదు. అయినా, నిర్మల ప్రశ్న అతన్ని యిబ్బంది పెట్టింది. అతను తలవంచుకుని ఇడ్లీలు తినసాగాడు. కర్రిది టిఫిన్ పూర్తిచే యటం చూసి నిర్మల ఒక పాత దువ్వెన తెచ్చి దానికిచ్చింది.

"దువ్వుకో" అంది.

అది పైపైన దువ్వుకోవటం గమనించి, అనుమానం వచ్చి దగ్గరకు వెళ్ళి చూసింది. దాని తలనిండా పుళ్లు, జుత్తు నిండా అట్టలు కట్టిన రక్తమూ, చెమటా.

"మోహన్ ఈ పిల్లను తీసుకుపోయి గుండు చేయించుకు రారాదూ? "

"అన్యాయం నిర్మలా? నాలుగు యిడ్లీలు పెట్టి యిలాంటి సంఘసేవా కార్యక్రమాలు' అప్పచెప్పటం"

నిర్మల ఫక్కున నవ్వింది. ఆ నవ్వుకి చక్ర వర్తులను జయించగల మోహనత్వం వుంది. ఇక మోహన్ అనగా ఎంత? కర్రిది దాన్ని తీసుకువెళ్ళి గుండు చేయిస్తున్నంత సేపూ తెలిసినవాళ్ళు ఎవరయినా కనపడతా రేమోనని మోహన్ భయపడుతూనే వున్నాడు. అతని అదృష్టవశాత్తూ అలా ఎవరూ కనపడలేదు. కానీ ఇంటికి వచ్చేస రికి అంతకంటే పెద్ద ప్రమాదమే ఎదుర యింది. సూర్యారావు వూరునుండి వచ్చే శాడు. అతను చూసిన చూపుకి మోహన్ నేలలోకి దిగిపోయాడు. కర్రిదానితో "నువ్వు పైకి వెళ్ళు" అని గొణిగి, తండ్రిని తప్పించు కుని లోపలకు వెళ్ళిపోయాడు.

కర్రిది నిర్మల కాచి వుంచిన వేడినీళ్లతో స్నానం చేసి, ఆమెదే ఒక పాత చీర లుంగీలా చుట్టుకుంది. నిర్మల ఆయింట్ మెంట్ తెచ్చి గుండుమీద వుళ్ళకు రాస్తూ,

"నీ పేరేంటీ? " అనడిగింది.

"కర్రిది"

నిర్మలకు జాలేసింది. పిల్ల నల్లగా వుంది. నిఖార్సయిన నలుపు. చామనచాయ కూడా కాదు. కానీ ఆ నలుపులో గొప్ప సొగసు వుంది. చక్రాల్లాంటి కళ్లు, చిన్న పొందిక యిన ముక్కు, లక్కపిడతలా బుల్లి నోరు, నల్ల చందనపు బొమ్మలా వున్న పిల్లను పట్టుకుని ఎంత నల్లగా వుంటే మాత్రం 'కర్రిది' అనెయ్యటమేనా?

"ఛ! అదేం పేరు! నీకంటూ ఓ పేరు లేదూ? మీ అమ్మా, నాన్న పెట్టిన పేరు..."

"ఏమో? ... అత్త కర్రిది అంటావుందిగా!"

"మీ అమ్మ ఏమని పిలిచేది? "

కర్రిది గుర్తుతెచ్చుకోవటానికి ప్రయత్నిం చింది. నిజమే, అమ్మ 'కర్రిదానా' అని పిలి చేది కాదు. మరేమని పిలిచేది? తన పేరే మిటి?

"లక్ష్మీ? మల్లి? సీత? సత్యవతి? రమణ? దేవుడమ్మ? పైడితల్లి? " నిర్మల ఆ వరుసలో చాలా పేర్లు చెప్పింది. కానీ కర్రి దానికి ఏమీ గుర్తుకురాలేదు. అలవాటు చొప్పున తలగోక్కోబోయింది. చేతులకు నున్నటి గుండు తగిలింది. ఇద్దరూ నవ్వే శారు. వెంటనే వాళ్ళ నవ్వులు ఠక్కున ఆగి పోయాయి. ఎదురుగా గుమ్మంలో సూర్యా రావు నిలబడి వున్నాడు. లుంగీని 'ఇన్‌డీ సెంట్' అన్పించేటంత పైకి మడుచుకుని వెకిలిగా నవ్వుతూ.

"ఈ పిల్లని చంద్రమ్మ మా యింటికి పనికి పంపింది. పిల్లలంటే అభిమాన ముంటే కనరాదూ? "

అతని మాటలకు నిర్మల గుండె పగి లింది. అవమానంతో ముఖం ఎర్రబడింది. పెదవులు వణికాయి. కానీ మాట బయ టకు రాలేదు.

కర్రిది భయంభయంగా ఆమె చేతిని గట్టిగా పట్టుకుంది. గద్దని చూస్తే తల్లికోడి పిల్లలను రెక్కల కింద దాచుకుంటుంది. కానీ నిర్మల కర్రిదానికి తల్లి కాదు.

సూర్యారావు నిర్మల చేతినుండి కర్రిదాని చేతిని విడకొట్టి దాన్ని బరబరా కిందకు లాక్కుపోయాడు.

★ ★ ★

సూర్యారావు కుటుంబానికీ, నిర్మలకూ రక్త సంబంధం ఏమీ లేదు. కానీ ఒకే కులం కావడంవల్ల ఎక్కడో బీరకాయపీచు బంధుత్వం వుంది. ఒక వరుసన ఆమె సూర్యారావుకి మరదలవుతుంది. మరొక వరుస చెల్లెలవుతుంది. అతని స్వభావానిక నుగుణంగా అతను మొదటి వరుసను

మాత్రమే గుర్తుంచుకున్నాడు. నిర్మలకి చాలా చిన్న వయస్సులో పెళ్ళయింది. భర్త కూడా ఆమెకంటే ఎంతో పెద్దవాడు కాదు. ఇద్దరూ కలిసి 'గోళీలు' ఆడిన గుర్తుంది ఆమెకు. అంతకు మించిన స్మృతులేవీ లేవు. అతను ఎప్పుడు పోయాడో కూడా గుర్తు లేదు. కొంచెం వూహ తెలిసేక తండ్రి దగ్గరే చదువుకుంది. అన్నల పుస్తకాలతో విజ్ఞానం పెంచుకుంది. నిర్మల వంటి దురదృష్టవంతురాలే అయిన మరొక స్త్రీ వీణ మాత్రం కూలంకషంగా నేర్పింది. తండ్రి పోయాక నిర్మల సహజంగానే అన్నలిద్దరికీ భారమయింది. ఆమె ఎన్నడూ చూడని అత్తగారింటికి ఆమెను పంపాలని కూడా వాళ్ళు ప్రయత్నించారు. ఇంతలో సూర్యారావు ఒక బంధువు పెళ్ళిలో నిర్మలను చూశాడు. హిందూ కుటుంబాలలోని విధవలమీద బంధువులందరికీ వుమ్మడి హక్కు వుంటుంది. ఆ హక్కుని పురస్కరించుకుని అతను నిర్మలను తనతో పంపమనీ, ఆడదిక్కుగా వుంటుందనీ ఆమె అన్నలను అడిగేడు. సూర్యారావు స్త్రీచాపల్యం జగమెరిగిన సత్యం! కానీ స్వార్థం రక్తసంబంధంకంటే బలమయినది. ఆ కారణంగా వాళ్లు సంతోషంగా నిర్మలను సూర్యారావుతో పంపారు. అప్పుడు నిర్మలకు పెనంమీద నుండి పొయ్యిలో పడుతున్నానని తెలియదు.

★ ★ ★

ఇంటిపనీ, వంటపనీ చేయటానికి నిర్మల ఎప్పుడూ జంకలేదు. కానీ సూర్యారావింట్లో నిర్మల సమస్య పని కాదు. సూర్యారావే. అందగత్తె కావటంవల్లనూ, భర్తలేకపోవటం వల్లనూ, యిన్నేళ్లూ పల్లెటూరిలో నివసించటంవల్లనూ నిర్మలకు ఈ సమస్య కొత్తదిగా తోచలేదు. కానీ అపాయం అడపాదడపా కలగటం వేరు. అపాయంతో కలిసి ఒకచోట నివసించటం వేరు.

'గుడ్డిలోమెల్ల'లా అదృష్టం ఏమిటంటే సూర్యారావుకి వున్న అన్ని వ్యసనాలలోనూ అతి ఖరీదయిన వ్యసనం గుర్రప్పందాలు. అవి అతనికి హైద్రాబాద్‌లో కానీ అందుబాటులో వుండవు. పేకాట మాత్రం వున్న ఊళ్లోనే ఆడగలడు. అతనికి కావలసిన ఆడవాళ్ళు కూడా చాలా మంది హైద్రాబాదులోనే వుండటంతో అతను నెలకు పది, పదిహేను రోజులు అక్కడే వుంటాడు. ఆవిధంగా ఆ పదిహేను రోజులు అతనితో సమస్య వుండేదికాదు. కానీ మిగిలిన రోజులు కత్తిమీద సామే! మోహన్, రజనీ, నళినీ వున్నపుడు ఫర్వాలేదు. వాళ్ళు లేకపోతే అతను రేసుకుక్కలా ఆమెను వేటాడేవాడు. అతని నడక అసభ్యం. మాట అసభ్యం. మొత్తం ప్రవర్తనే అసభ్యం. కాఫీ యిస్తోంటే చేతులు తగిలించటం, నిలబడి వుంటే రాసుకుని వెళ్ళడం, బూతు జోకులు వెయ్యటం వంటి వికారపు చేష్టలన్నీ చేసేవాడు. నిర్మల పరిస్థితి 'ముందు నుయ్యి వెనుక గొయ్యి'లా తయారయింది. అన్నల దగ్గరకు వెళ్ళలేదు. సూర్యారావు దగ్గర వుండలేదు.

మోహన్ నిర్మలకంటే రెండు సంవత్సరాలు చిన్నవాడు. అతను ఆమెపట్ల ఎంతో మర్యాదగా వుంటాడు. వయసు తారతమ్యం అంతగా లేకపోవటంచేత ఇద్దరికీ ఆంగ్లసాహిత్యం అభిమాన విషయం కావటంచేతా మోహనూ, నిర్మలా చాలా త్వరలోనే చేరువయ్యారు. వాళ్ళు అంతకంటే చేరువకావటానికి సంఘమూ, వాళ్ళ బంధుత్వమూ కూడా ఒప్పుకోవు. 'ఎంత చేరువో మరి అంత దూరమూ' అనేది వాళ్ళపట్ల అక్షరసత్యం!

సూర్యారావు పశుత్వంనుండి, మోహన్ ఆకర్షణ నుండి తప్పుకోవటానికి నిర్మలకు తోచిన ఒకే ఒక్క ఉపాయం ఆ ఇంటినుండి వెళ్ళిపోవటం. విచిత్రం ఏమిటంటే ఆమె అక్కడ వుండనూలేదు. తెగతెంపులు చేసుకుని వెళ్లనూలేదు. ఇది మనసుకు సంబంధించిన సమస్య. అయితే భౌతికమైన సమస్య ఏమిటంటే సూర్యారావు ఆమెకు





బంధువు. ఇతనితో అల్లరి పడిందా- చుట్టా లందరిలోనూ నిర్మలను అల్లరి చేస్తాడు. ఆమె తర్జనభర్జనలు పడి తన సమస్యకు ఒక తాత్కాలిక పరిష్కారాన్ని కనిపెట్టింది. ఒకసారి సూర్యారావు హైద్రాబాదు వెళ్లి వచ్చేసరికి నాలుగయిదు ట్యూషన్లు, మరో నాలుగయిదు వీణ పాఠాలు కుదుర్చుకుని వాళ్ళమేడమీద వున్న గదిలోకి మకాం మార్చేసింది. నిర్మల ఈ చర్య సహజంగానే సూర్యారావుకి చాలా కోపం కలిగించింది. కానీ వెల్లడించగల పరిస్థితి కాదు. అందు వల్ల పనికి, వంటకి వేరే మనిషిని కుదుర్చు కుని నిర్మలకు గది ఉదారంగా యిచ్చినట్టు ప్రకటించుకున్నాడు. నిర్మల అతని ఉదార తను అంగీకరించలేదు. ఆమె దానికి బాడు గను నిర్ణయించి, ప్రతి నెలా మొదటి తారీ ఖున మోహన్‌కి అద్దె చెల్లిస్తూ సూర్యారావు మీద తన ఆధిక్యతను నిలుపుకుంది. అటు వంటి నిర్మలమీద అతనికి కోపం వుండటం సహజం.

★ ★ ★

సూర్యారావుతో కింద గదుల్లోకి లాక్కురా బడ్డ కర్రిదానికి ఏం చేయాలో తోచలేదు. ముందుగదిలోనే నిలబడిపోయింది. అర గంట తర్వాత "ఓయ్ గుండూ! కొంచెం టీ పెట్టి యివ్వు" అని సూర్యారావు గర్జించాడు. కర్రిది ఆ అరుపుకు ఉలిక్కిపడింది. కానీ అది తనను ఉద్దేశించిందే అని గ్రహించలేక పోయింది. అది వెర్రి చూపులు చూస్తోంటే నళినీకాంత్ చెప్పాడు.

"పాపా! నిన్నే! నాన్న టీ పెట్టి ఇమ్మంటు న్నారు"

టీ ఎప్పుడూ పెట్టలేదు. కానీ చంద్రమ్మ పెట్టుకుంటోంటే ఒకటి రెండుసార్లు చూసింది. ఆ ధైర్యంతో వంటింట్లోకి వెళ్ళింది. కానీ అక్కడ దానికి పొయ్యి కన పడలేదు. దాని సందిగ్ధం చూసి. నళిని, "రాదా? " అనడిగాడు చేతులు తిప్పుతూ.

"వచ్చు పొయ్యేదీ? "

"ఇదిగో, ఇక్కడుందిగా"

తనకంటే ఎత్తు గట్టుమీద వున్న ఆ స్టౌకేసి తేరిపార చూసింది. గ్యాస్టౌ, దానికి వున్న ఆకుపచ్చటి రబ్బరు ట్యూబు, దాని చివర ఎర్రటి సిలిండరు. ఈ పొయ్యి యొక్క స్వరూప స్వభావాలేమిటో దానికి తెలియలేదు. దాని అయోమయం గ్రహించి నళిని గ్యాస్ వెలిగించాడు. ఒక గిన్నెలో నీళ్ళు పెట్టి, నళినిని అడిగి దానిలో తేయాకు వేసింది. ఎలాగో అలా టీ తయారు చెయ్య గలిగిన కర్రిది గట్టు ఎత్తుగా వుండటంవల్ల కాళ్ళు ఎత్తి గిన్నె దించబోయి మీద వలక పోసుకుని, ఒళ్లు కాల్చుకోవటమేకాక, సూర్యా రావుకి టీ అందించలేక తన్నులు తింది.

"బ్లడీఫూల్! పనిపిల్లని తీసుకురావే అంటే లాగూ కూడా వేసుకోవటం రాని చిన్నపిల్లని తీసుకొచ్చి అంటగట్టింది. పంపించేద్దాం దీన్ని" అని విసుక్కుని సాయంత్రం క్లబ్బుకి వెళ్ళటానికి టైమ్ అవడంతో అతను వెళ్ళిపో యాడు.

సాయంత్రం మోహన్ కాలేజీ నుండి వచ్చేసరికి కర్రిది పొట్టమీద కాలిన బొబ్బ లతో, నిర్మల తడిచిన పాత చీరెలో, ఏడ్చి ఏడ్చి ఉబ్బిన ముఖంతో కూర్చుని వుంది. తమ్ముళ్ళిద్దరూ ఆటకు వెళ్లిపోయారు. పైకి వెళ్ళి చూస్తే నిర్మల గదికి తాళంవేసి వుంది. బహుశా ట్యూషన్లకు వెళ్ళి వుంటుంది. తడిచిన గువ్వపిట్టలా వున్న ఆ పసిదాన్ని చూసి అతని మనసు ఆర్ద్రమ యింది.

"మధ్యాహ్నం భోంచేశావా? "

'లేదన్నట్టు' తల అడ్డంగా వూపింది. రమ ణమ్మ మానేసిన దగ్గర్నుండీ సూర్యారావు వూళ్ళో లేకపోవడంవల్ల నిర్మలే వంట చేస్తోంది. ఇలా తరచూ వంట మనుషులు మానేయటం వాళ్ళకి అలవాటే. అటువంటి పరిస్థితుల్లో ఒక్కొక్కసారి నిర్మల కూరలు చేసి పంపిస్తూ వుంటుంది. ఒక్కోసారి సూర్యారావు బయటకు వెళ్లిన సమయంలో

వచ్చి వంటచేసి వెళుతుంది. మళ్ళీ ఎవరో ఒకరు వంటకి కుదురుతారు. ఇవన్నీ సర్వ సాధారణమైపోయాయి వాళ్ళకి. కానీ ఇవాళ సూర్యారావు అన్న మాటలకి నొచ్చుకున్న ట్టుంది. నిర్మల ఇటువైపు తిరిగి చూడలేదు. అందువల్ల ఇంట్లో వంట చెయ్యలేదు. బహుశా తండ్రి హోటల్‌లో భోంచేసి వుంటాడు. తమ్ముళ్ళు స్కూలు క్యాంటీన్‌లో ఏదో ఒకటి తిని వుంటారు. ఈ పసిది పొట్ట మాడ్చుకుని, పైన కాల్చుకుని, ఏడుస్తూ వుంది.

అతను మొట్టమొదట చేసిన పని దాని బట్టలు మార్పించటం. నళినిది పాతచొక్కా ఇచ్చాడు. పొట్టమీద బర్నాల్ రాసి, తినటా నికి బ్రెడ్డూ, జామూ ఇచ్చాడు.

"మీ ఊరు వెళ్ళిపోతావా? "

తల అడ్డంగా వూపింది.

"అమ్మా, నాన్నా వున్నారా? "

"లేరు"

"ఆ రోజు నిన్ను తెచ్చి దింపి వెళ్ళిన మని షెవరు? "

"చంద్రమ్మత్త"

"ఆమె దగ్గరకు పంపిస్తాను వెళతావా? "

"కొట్టుద్ది"

అతను యింకేమీ ప్రశ్నలు వెయ్యలేదు. సోఫాలో వెనక్కివాలి పేపరు చదువుకోసా గాడు.

"అన్నయ్యా!"

ఆ పిల్ల తననే పిలుస్తున్నదని ఒక్కక్షణం పాటు అతనికి తోచలేదు. ఏమిటన్నట్టు చూశాడు.

"పొయ్యి చాలా ఎత్తుమీద వుంది. కిందకి దించి పెడితే అన్నం వండటం వచ్చు నాకు. అంట్లు తోముతాను. ఇల్లు తుడు స్తాను. పని నేర్చుకుంటా అన్నయ్యా! నన్ను పంపించెయ్యొద్దు"

అతనికి అపరిమితమయిన జాలి కలి గింది. ఆప్యాయంగా దాని గుండు తడి మాడు.

"పద! నేను నీకు పని నేర్పిస్తాను"

గుండు చాలా ఉత్సాహంగా లేచింది. మోహన్ పొయ్యి కిందకు దించి, దాని ఎత్తుకు తగ్గట్టు అన్ని వస్తువులూ అమ ర్చాడు. అది కూడా ఆ వంటిల్లే తన సామ్రాజ్యం అన్నట్టు చకచకా తిరిగి అన్నీ సర్దింది. కుక్కర్‌లో అన్నం వండటం ఎలానో చూపించాడు. క్యారియర్, డబ్బులు తీసుకువెళ్ళి పక్క వీధిలోని మెస్ నుండి కూరలు తెచ్చింది.

"అన్నయ్యా! కూర చెయ్యటం కూడా నేర్పు. చేసేద్దాం" అంది ఉత్సాహంగా.

"అమ్మో! నాక్కూడా రాదే! అవన్నీ నిర్మల నేర్పాల్సిందే" అన్నాడు మోహన్.

సూర్యారావు తనని పంపించటం గురించి మళ్ళీ మాట్లాడకపోవటం దానికి సంతోషం కలిగించింది.



పది రోజుల్లో గుండు చాలా పనులు నేర్చుకుంది. ఇల్లు తుడవటం వగైరా...! అంట్లు తోమడంలో దాని తొలి గురువు చంద్రమ్మే. కానీ ఆ పల్లెటూరిలో జానెడు స్థలం తుడిచి, నాలుగు గిన్నెలు తోమితే చాలు. ఇక్కడ ఇల్లు చాలా పెద్దది. తోమ వలసిన గిన్నెలు కూడా ఎక్కువే. అందరూ

మగవాళ్ళే కావటం వల్ల, ముఖ్యంగా రజనీ, నళినీ ఆటలు ఆడి బట్టలు చాలా మాపటం వల్ల యిదివరకటి పనివాళ్ళు బట్టలు ఉతక లేమని ఫిర్యాదు చేసేవాళ్ళు. ఆ కారణంగా బట్టలు వుతకటానికి ఒక చాకలిని కుదుర్చు కున్నారు. అతనే వారానికి ఒకసారి బట్టలు యిస్త్రీ కూడా చేస్తాడు. మిగిలిన ఇంటిప నులు గుండు చాలా ఉత్సాహంగా చేసేది. అన్నం, పప్పు వండేది. కాఫీ, టీలు చేసి ఇచ్చేది. చిన్నచిన్న బజారు పనులు కూడా అదే చేసేది. దేవుడు దానికి ఎటువంటి ఓపిక ఇచ్చాడో తెలీదు కానీ, ఒక్కక్షణం కూడా విశ్రాంతి తీసుకునేది కాదు. నిద్రలేస్తే నిద్రపోవాల్సిందే తప్ప అలసట అనే మాట దాని డిక్షనరీలో లేదు. ఇంట్లోని మగవాళ్ల నలుగురూ దానికంటే పెద్దవాళ్ళు అయ్యుండీ ఉదయం లేచింది మొదలు 'గుండూ! గుండూ!' అంటూ ప్రతి పనికీ దానిమీద ఆధారపడేవాళ్లు.

నిర్మల ఒకరోజు, "ఏమిటే నీ పేరు? కొన్నాళ్లు కర్రిది. ఇప్పుడు గుండుది. రేపు జుత్తు వచ్చాక బొచ్చుదీనా? బుద్ధిలేదూ? నీకు భూదేవికున్నంత ఓర్పున్నది. అందు వల్ల నీ పేరు వసుధ, ఇకనుండి అలా పిలి స్తేనే తప్ప పలక్కు" అని చెప్పింది.

మోహన్ నిర్మలంటే వున్న అభిమానం వల్ల, అతని తమ్ముళ్ళు చిన్నవాళ్ళు కావటం వల్ల వెంటనే ఆ పిలుపుకి అలవాటుపడ్డారు. కానీ సూర్యారావు గుండు అని మాత్రమే పిలిచేవాడు. కూరగాయలవాళ్లు, ఇంటికొ చ్చిన వాళ్ళు ఎవరయినా ఏయ్ పిల్లా అనో, అమ్మాయ్ అనో పిలిస్తే అది వెంటనే,

"నా పేరు వసుధ" అని చెప్పేది.

★ ★ ★

నిర్మల గది చాలా ప్రశాంతంగా వుంటుంది. మోహన్ తాతగారు దాన్ని ప్రత్యేకం తనకోసం కట్టించుకున్నారు. అందువల్ల అంత పెద్ద మేడమీద ఒకే గది. ఒక పక్కగా నీళ్ళ ట్యాంకు అది మినహా మిగిలిన స్థలమంతా ఖాళీ. ట్యూషన్లు లేన పుడు నిర్మల సాయంత్రాలు అక్కడే గడుపు తుంది. రాత్రి అయి, మంచుపడటం ప్రారం భించాక ఆమె లోపలకు వెళ్లి పడుకుం టుంది. సూర్యారావు వూళ్ళో లేకపోతే మోహన్ కాలేజీ నుండి వచ్చి సరాసరి అక్క డికే వెళతాడు. నిర్మల లోపలకు వెళ్ళి పడు కున్నాక, అతను కిందికి దిగి వస్తాడు. సాహిత్యవిషయ చర్చలు తప్ప మిగిలిన విషయాలు వాళ్లు అంతగా మాట్లాడుకు న్నట్టు తోచదు. మౌనంగా సంభాషించటం వాళ్ళకు అలవాటైపోయింది. చాలాసార్లు నిర్మల వీణ వాయిస్తుంది. అతను వాలుకు ర్చీలో పడుకుని, కళ్ళు మూసుకుని వింటాడు. ఆమె చాలా అరుదుగా నవ్వు తుంది. నవ్వినపుడు మాత్రం మల్లెలు జల జలా రాలినట్లు వుంటుంది. స్వచ్ఛంగా, తెల్లగా, శబ్దం లేకుండా.

★ ★ ★

ఆదివారం అంటే వసుధకు చాలా యిష్టం. ముఖ్యంగా సూర్యారావు వూళ్లోలేని ఆదివారాలంటే మరీ యిష్టం.

సూర్యారావు వూళ్లో వుంటే ఆ ఇంటికి రావటానికి సందేహించే నిర్మల అతను వూళ్లో లేనపుడు రోజులో చాలా సమయం అక్కడే గడుపుతుంది. రజనీకి, నళినీకి పుస్త కాలు అట్టలు వేసి పెడుతుంది. మోహన్ గది సర్దుతుంది. అందరి బట్టలకు గుండీలు కుట్టడం, కుట్లు సరిచెయ్యటం చేస్తుంది. మంచి టిఫిన్లు, భోజనాలు వండుతుంది. నిర్మల చిరునవ్వుతో, చలాకీగా అది తన ఇల్లే అయినట్లు సర్దుతూ, అటూఇటూ తిరు గుతోంటే వసుధకు చూడముచ్చటగా వుంటుంది.

ఒక ఆదివారం నిర్మల మధ్యాహ్నం వంట పూర్తిచేసి వసుధకు జడవేస్తూ కూర్చుంది. గుండు చేయించాక, వసుధకు జుట్టు చాలా ఆరోగ్యంగా పెరుగుతోంది. వీలున్నపుడల్లా తలంటుకోవాలని చెబుతుంది నిర్మల. దానికి

నిర్మల మాటంటే వేదవాక్కు.

మోహన్ సోఫా వెనక నుండి నిర్మల మీదకు వంగి ఏదో జోక్ చెపుతున్నాడు. తెల్లని బట్టలు, తలంటుకుని విరబోసుకున్న జుట్టు, ఆమె తలలోనుండి కుంకుడు కాయల పరిమళం అతను తన్మయుడై ఆమెతో మాట్లాడుతోంటే ఆమె తల వెనకు వాల్చి నవ్వుతోంది. ఎర్రని ఆమె పెదవులు అతనికి ఎంతో దగ్గరగా తోచాయి. ఆమె చేతిలో వసుధ జుట్టు వుండటంవల్ల దాని తల నిర్మల ఒడిలో వుంది. సోఫా వెనుక మోహన్, అతని గుండెలకు దగ్గరగా నిర్మల తల, ఆమె ఒడిలో తన తల. వసుధకు ఒక మనోహర దృశ్యంలా తోచింది. మోహన్ మనసును నిగ్రహించుకునే వుద్దేశ్యంలో తల విదిలిస్తోండగా, అప్పుడే గుమ్మంముందు తండ్రి ప్రత్యక్షమయ్యాడు. నిర్మల కూడా గుమ్మం దెస చూసింది. చూడటమేమిటి, తటాలున వసుధను తోసేస్తూ చటుక్కున లేచి నిలబడింది.

వెళ్లబోతుంటే సూర్యారావు ఆమెను దాదాపు రాసుకుంటూ లోపలకు వచ్చాడు. "కూర్చో నిర్మలా! వెళ్ళిపోతున్నావేం? " అని అభిమానంగా నిర్మలను పలకరించాడు.

"పనుంది" ముభావంగా సమాధానం చెప్పి వెళ్ళిపోయింది నిర్మల.

"ఏయ్! గుండూ! నాకు కొంచెం కాఫీ తీసుకురా' అతను నిర్మల ఖాళీ చేసిన సోఫాలో కూర్చున్నాడు.

"నాకిప్పుడు జుట్టు వచ్చేసిందయ్యగారూ!"

"అవునేవ్ నిజమే" అంటూ అతను వంగి దాని జుట్టు అందుకోబోతుంటే మోహన్ కల్పించుకుని

"వసుధా! లోపలకు వెళ్లి నాన్నకూ, నాకూ కాఫీ తీసుకురా" అని గద్దించాడు.

మోహన్ కోప్పడుతున్నాడనుకుని చిన్నబుచ్చుకుందేగానీ తండ్రి పెర్వర్షన్ నుండి తన బాల్యాన్ని కాపాడుతున్నాడని దాని పసిమనసుకు తెలీదు. వసుధ వచ్చిన నాటినుండి కూడా అతను తీసుకున్న మరొక జాగ్రత్త దాన్నెపుడూ నిద్రపోవటానికి నిర్మల గదికే పంపటం.

"ఎందుకురా దాన్ని పైకి పంపుతున్నావు? " అని తండ్రి అడిగితే,

"నిర్మలకు తోడు కావాలట నాన్నా" అని చెప్పేవాడు.

"ఏంటో నీ పిచ్చి! దానికి భగవంతుడే తోడు రాసిపెట్టలేదు" అన్నాడతను.

ఏ స్త్రీనయినా ఆమె పరోక్షంలో అది అనటం ఆయన సంస్కారం. తండ్రి పేర సైట్. తన ఉద్యోగమూ, తమకు తాతగారిచ్చిన ఆస్తిమీద వచ్చే ఆదాయమూ తప్ప ఆయనకంటూ చివరికి పెన్షన్ కూడా రాదు అర్ధాంతరంగా డిస్మిస్ కాబడటంవల్ల. అయినా తండ్రిని ఏ మాటా అనలేకపోవటం అతని సంస్కారమే కాదు అతని పిరికితనం కూడా! పిరికితనం ఏ వ్యక్తికీ శోభనివ్వదు. ముఖ్యంగా మగవాడికి.

★ ★ ★

మోహన్ కాలేజీకి వెళ్లిపోయాడు. రజనీ, నళినీ స్కూలుకి వెళ్లారు. నిర్మలకు మామూలు ట్యూషన్లు, వీణ పాఠాలు కూడా సాయంత్రమే వుంటాయి. ఉదయం పూట ఆమె చేతితో ఎంబ్రాయిడరీ చేస్తుంది. దాని వల్ల వచ్చే ఆదాయం చాలా స్వల్పమే కానీ టైము గడుస్తుంది. ఉదయం పది గంటల ప్రాంతంలో వసుధ వచ్చి "అక్కా అయ్యగారు బయటకు వెళ్లారు. కూరలు కిందకి వచ్చి చేస్తావా? పైకి తీసుకురానా? " అని అడిగింది.

నిర్మల కుట్టుపని ఆపి లేచింది.

"నేను వస్తాలే పద"

ఇద్దరూ కిందికి దిగివచ్చారు.

"ఏం చేద్దాం? "

"వంకాయలున్నాయక్కా! మోహన్ అన్నయ్యకి ఇష్టంగా, గుత్తివంకాయ చేద్దామా? "

"సరే"

మసాలా దినుసులు వసుధకు రుబ్బేం





దుకు ఇస్తూ చూసుకుంది నిర్మల. ధని యాలు లేవు.

"ధనియాల్లేవే"

"కొట్టు దగ్గరకు వెళ్లి తీసుకురానా అక్కా!"

"వద్దులే, ఇప్పుడేం వెళతావు? "

"పర్లేదక్కా వెళతాను"

నిర్మల సమాధానంకోసం చూడకుండానే వసుధ మోహన్ టేబిల్ సొరుగులో నుండి డబ్బులు తీసుకుని వెళ్లిపోయింది. పది నిమిషాల తర్వాత వీధి తలుపు గడియ వేస్తోన్న శబ్దం వినపడింది.

"వసుధా! తలుపు వెయ్యకు. మీ అయ్య గారు వచ్చే టయిమయ్యింది" అని అరిచింది నిర్మల వంటింట్లో నుండే.

"టైమవ్వటం ఏమిటీ? వచ్చేశాను" అంటూ వంటింటి గుమ్మం ముందు సూర్యా రావు ప్రత్యక్షమయ్యేడు. టకటకా చొక్కా గుండీలు విప్పుకుంటున్నాడు. నిర్మల చిత్త రువులా చూస్తూ నిలబడిపోయింది. అతను ఆ చొక్కాను స్టాండు మీద వెయ్యటానికి వెళ్లినపుడు కానీ ఆమె కదల్లేకపోయింది. అతని స్వభావం తెలిసి ఆమె ఎప్పుడూ ఇటువంటి పరిస్థితి రానివ్వకుండా జాగ్రత్తప డుతూ వచ్చింది. ఇప్పుడేమిటి చెయ్యటం? ఇంతలో అతను లుంగీ కట్టుకుని మళ్లీ వంటింట్లోకి వచ్చాడు. గ్యాస్‌స్టవ్వు ముందు నిలుచుని వున్న ఆమె మీదుగా వంగి అగ్గి పెట్టె అందుకున్నాడు. తర్వాత అక్కడినుండి కదల్లేదు. అతను తన వెనుకగా దాదాపు తనను ఆనుకుని నిలబడి వున్నాడని ఆమెకు అర్థం అవుతోంది.

"కొంచెం కాఫీ ఇస్తావా నిర్మలా? "

ఆమె ఠక్కున వెలుగుతున్న స్టవ్‌ని ఆర్పే సింది.

"నాకు కొంచెం తలనొప్పిగా వుంది" అంటూ వెళ్లటానికి ఉద్యుక్తురాలైంది. గబ గబా ముందుగదిలోకి వచ్చి గడియ మీద చెయ్యివేసింది. అతను కూడా ఆమెను అను సరించి వచ్చి ఆ చేతిమీద చెయ్యివేసి "అయ్యో" అన్నాడు.

ఆమె విసురుగా తలుపు తీసేసరికి వసుధ గుమ్మానికి ఎదురుగా నిలబడి వుంది. నిర్మల దాన్ని తోసుకుంటూ గబ గబా తన గదికి వెళ్లిపోయింది. సూర్యారావు వెనక్కివెళ్లి తన కుర్చీలో కూలబడ్డాడు.

★ ★ ★

మధ్యాహ్నం భోజనానికి మోహనూ, అతని తమ్ముళ్లూ వచ్చేసరికి అన్నమూ, సాంబారు వున్నాయి.

"ఆమ్లెట్టు వేసి ఇస్తా అన్నయ్యా" అంది వసుధ.

"నిర్మల కూరలేమీ చేసివ్వలేదూ!"

"అక్కా నేనూ గుత్తి వంకాయకూర చెయ్యాలనుకున్నాం అన్నయ్యా! నేను ధని యాల కోసం వెళ్లివచ్చేసరికి తలనొప్పట అక్క వెళ్లిపోయింది? "

మోహన్ నొసలు చిట్లించాడు.

"ఎవరు చెప్పారు? "

"అయ్యగారు!"

ఆ సమయంలో తండ్రి ఇంట్లో ఎందుకు న్నాడో అతనికి అర్థం కాలేదు. ఏం జరిగి వుంటుందో వూహించటానికి ప్రయత్నిం చాడు. తండ్రి తన గదిలో పడుకుని వున్నాడు. ఆయన్ను అడిగే ధైర్యంలేదు. నిర్మలను అడిగే ధైర్యం అంతకంటే లేదు. ఏం వినాల్సి వస్తుందో అని భయం.

"చూడు వసుధా! నువ్వు అక్కని వదలి ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లకు అర్థమయిందా? "

"నేనూ... ధనియాలు..."

"అది సరేలే! ఇక ఎప్పుడూ అక్కని ఒంట రిగా వదలవద్దు. మీ ఇద్దరూ ఫ్రెండ్స్‌కదా!"

వసుధ సరే అన్నట్టు తల వూపింది.

★ ★ ★

వసుధకు చదువు చెప్పాలనే ఆలోచన మొదట నళినికి కలిగింది. నళిని వసుధకు చదువు చెప్పటం మొదలుపెట్టేక 'నిజమే సుమా! చిన్నవాడికి తట్టిన ఆలోచన మనకు

తట్టలేదు. వసుధ చదువుకోవాలి' అని నిర్మలకూ, మోహన్‌కూ కూడా అన్పించింది. ఆ విధంగా వసుధ తెలుగూ, ఇంగ్లీష్ కూడా చదవటం మొదలు పెట్టింది. నళిని ఆడటానికి స్నేహితులు దొరకనప్పుడల్లా దాని వెనకపడి "ఏదీ కాపీ రాయి. ఎక్కాలు అప్పచెప్పు, హోంవర్కు చెయ్యలేదా? చెయ్యి పట్టు కొట్టాలి" అని ఏడిపించుకు తినేవాడు. అయినా వసుధకు చదువుకోవటం సరదాగానే వుండేది.

బయటకు వెళ్లినపుడు గౌనులు వేసుకున్నా ఇంట్లో పనిచేసేటపుడు అది రజనీ, నళినీ వదిలేసిన పాత లాగూచొక్కాలు వేసుకునేది. ఎదిగీ ఎదగని జుట్టు, నల్లని శరీర ఛ్ఛాయ, మగపిల్లవాడి దుస్తులు. ఇందులో ఏవి దానిని సూర్యారావు నుండి రక్షించాయో తెలీదు కానీ అతను తన పెర్వర్షన్‌ని దానిపట్ల అంతగా ప్రదర్శించలేదు.

సూర్యారావు తన పట్ల అతి చనువు ప్రదర్శించటం నిర్మలకు ఏమాత్రమూ రుచించలేదు. అతను తనని దురుద్దేశంతోనే ఈ వూరికి తీసుకొచ్చాడని గ్రహించటానికి ఆమెకు ఎక్కువకాలం పట్టలేదు. అతనిని, ఆ రక్షణనూ కాదని పోగల స్థితిలో తను లేదు. అన్నలూ, వదినలు తనని వదిలించుకున్నారు. మాటల్లో చెప్పకపోయినా వాళ్ల అభిప్రాయం అదే. యవ్వనంలో వున్న విధవాడపడుచును జీవితాంతం పోషించటానికి వాళ్లు సిద్ధంగాలేరు. అత్తగారి తరపువాళ్లు ఎవరో, వాళ్లు తనని ఏవిధంగా ఆదుకోగలరో, అసలు వాళ్లకు తనను పోషించవలసిన అవసరం వున్నదో లేదో నిర్మలకు తెలీదు. ఆమెకు వచ్చిన చదువును కొలిచే డిగ్రీలు ఆమె వద్దలేవు. బయటి ప్రపంచం ఎట్లా వుంటుందో ఆమెకు సరైన అవగాహన లేదు. అందువల్ల కొంచెం జాగ్రత్తగా మసలుకోగలిగితే సూర్యారావు ఇల్లు తనకు బయటి ప్రపంచం కంటే సురక్షితమయినదని ఆమె మనసారా నమ్మింది. అదీకాక ఆమె సూర్యారావు ఇంటిని పట్టుకు వేళ్లాడ్డంలోని మరో రహస్యం మోహన్! ఆమె తన మనసు తన అదుపులో వున్నపుడు నేను విధవను, వివాహానికి అర్హురాలిని కాను, మోహన్‌కంటే వయసులో పెద్దదాన్ని, బంధుత్వరీత్యా వరసైన దాన్ని కూడా కాదు అని తననుతాను మందలించుకుంటుంది. కానీ ఆమె మనసు ఇరవై ఎనిమిదేళ్ల శరీరంలో వుండటంవల్లనైతేనేమి, ఆ శరీరం పురుష స్పర్శను ఎరుగని కారణంగానైతేనేమి తరచూ అదుపు తప్పుతూ వుంటుంది. అతనిని చూడకుండా దినం గడవటం ఆమెకు దుస్సహంగానూ దుర్భరంగానూ వుంటుంది. ఇది ఉత్త స్నేహమే అని ఆమె తననుతాను నమ్మించుకో చూస్తుంది. సూర్యారావు ప్రవర్తన శృతి మించుతోందని ఆమెకు అర్థం అవుతూనే వుంది. మోహన్‌కి తండ్రిని ఎదిరించగల శక్తి లేదని కూడా ఆమె ఎరుగును. ఈ పరిస్థితుల్లో ఆమె చెయ్యగిలినదల్లా సూర్యారావుని దూరంగా వుంచగలగటం మాత్రమే!

"ఈ నిర్మలేంటీ? ఇదివరకు కూరయినా చేసేది. పూర్తిగా మానేసినట్టుంది" అన్నాడు సూర్యారావు ఒకరోజు భోజనాల దగ్గర. అప్పటికి నాలుగు రోజులుగా వసుధ చేసే పప్పూ, చారూ తిని అతని నాలుక చవి తప్పిపోయింది.

"అవున్నాన్నా! నిర్మలక్క వంట బాగా చేస్తుంది. నువ్వు లేనప్పుడు టిఫిన్లూ, అన్నం కూడా చేస్తుంది. భలే బావుంటాయిలే" అన్నాడు రజనీకాంత్.

"మరి ఇప్పుడేం మాయరోగం వచ్చింది? " అన్నాడు సూర్యారావు.

వసుధ తలెత్తి మోహన్‌ని చూసింది. ఇప్పుడు నిర్మలకి వచ్చిన 'మాయరోగం' గురించి స్పష్టంగా అర్థమయింది మోహన్‌కి. కొంచెం అస్పష్టంగా తెలిసింది వసుధకే. కానీ, ఇద్దరూ అసహాయంగా మౌనం వహించి వున్నారు.





"మొగుడు చచ్చిన ముండని తెచ్చి నెత్తి మీద ఎక్కించుకున్నందుకు చెప్పుతో కొట్టుకో వాలి మనని మనం" మోహన్‌ని తన మాటలు నొప్పిస్తాయని అతనికి తెలుసు. నొప్పించాలనే అతని ఉద్దేశ్యం కూడా. అది కొంత వరకూ ఫలించింది.

"నిర్మల మనింట్లో వుత్తినే వుండటం లేదు కదండీ! ఆ గదిని మనం స్టోర్ రూముగా వాడేవాళ్ళం. దానికి తాను నెలకు రెండువం దల రూపాయలు అద్దె ఇస్తోంది" అన్నాడు మోహన్ నెమ్మదిగానే.

"అదేం స్టోర్ రూము? ఆ ముసలాడికి (మోహన్ తాతగారికి) స్వర్గం అది. ఎప్పుడూ అక్కడే పడుండేవాడు. ఆ గదిని దయ్యమై పట్టి వుంటాడని జడిసి దాన్ని స్టోర్ రూము చేశాను నేను. ఇదుగో ఇప్పుడీ దెయ్యం వచ్చి తిష్టవేసింది"

మోహన్‌కి ఈ అప్రియమయిన సంభా షణ చాలా దుఃఖాన్ని కలిగించింది. నిర్మ లను ఆయన ఎందుకంతగా దుర్భాషలాడు తున్నాడో కూడా అతనికి అర్థం అయింది.

'ఆమె తనకు దక్కడం లేదన్న దుగ్ధ కొంత, కొడుక్కి చేరువ అవుతుందేమోనని దుగ్ధ మరికొంత' మోహన్‌కి భోజనం రుచిం చలేదు. అన్నంలో చెయ్యి కడుక్కుని వెళ్ళి పోయేడు.

★ ★ ★

మధ్యాహ్నం నిద్రలేచేసరికి వసుధ ప్లేటులో పకోడీలు తెచ్చి ఇచ్చింది. అతని మధ్యాహ్న భోజనం అర్థాంతరంగా ముగిసిం దేమో మంచి ఆకలిమీద వున్నాడు. గబ గబా రెండు నోట్లో వేసుకుని,

"ఎక్కడివి వసుధా?" అని అడిగాడు.

"నిర్మలక్క ఇచ్చిందన్నయ్యా?"

మళ్ళీ తనే అంది.

"నువ్వు మధ్యాహ్నం భోజనం సరిగ్గా చెయ్యలేదుగా. నేనే చెప్పా అక్కకి"

అతనికి వసుధ ఆ క్షణాన ఎంతో ఆత్మీ యంగా తోచింది. "మా అమ్మ చచ్చిపోయి, నీ రూపాన పుట్టినట్టుందే" అని దాన్ని దగ్గ రకు తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"జాగ్రత్త మోహన్! దాని రంగు అంటు కుంటుంది"

అతను విస్మయంగా తలపైకెత్తి చూశాడు.

గుమ్మంలో నవ్వుతూ నిర్మల. తండ్రి వుండగా నిర్మల మళ్ళీ తన ఇంటివైపు కన్నెత్తి చూడదనే అనుకున్నాడు. అతని విస్మయాన్ని గ్రహించిన దానిలా వసుధ,

"మధ్యాహ్నం నువ్వు నిద్రపోయేక, అయ్యా గారు వూరెళ్ళి పోయారన్నయ్యా" అని చెప్పింది.

'ఇది నిజంగా నాకు ఆత్మీయురాలు. నా మనసులో ఏమనుకున్నా దీనికి తెలిసిపోతు న్నాయి' అనుకున్నాడు మోహన్.

★ ★ ★

ఆ పోవటం పోవటం పదిహేను రోజులు దాటినా సూర్యారావు అయిపులేడు. ఇల్లు ప్రశాంతంగా వుంది. అతను వూళ్ళో లేన పుడు వంట సమస్యే వుండదు. నిర్మల దిన మంతా ఆ ఇంట్లోనే గడుపుతుంది. అతను వస్తేనే అందరికీ సమస్య. నిర్మలకు అతను అతి చొరవ ప్రదర్శిస్తాడేమో, పళ్ళు రాలగొ ట్టవలసి వుంటుందేమో, వంటమనిషి రమ ణమ్మగారిలా తనకి ఇల్లు లేకపోతే పదిళ్ళు లేవే అని భయం. మోహన్‌కి తండ్రిలో ధన పిశాచం కనపడతాడు. 'బయ్యింగ్‌పీస్' అంటే శాంతిని కొనుక్కోవటం అనేది ఆయన విషయంలో అక్షర సత్యం. మోహన్ దగ్గర డబ్బులేదని కాదు, తాత గారు నాలుగు తరాలకు సరిపడా సంపాదిం చారు. తన ఉద్యోగం వుండనే వుంది. తమ్ముళ్ళు ఇంకా చిన్నవాళ్ళు అయినందువల్ల ఆస్తి వ్యవహారాలన్నీ అతనే చూస్తున్నాడు. తాతగారి పుణ్యమా అని డబ్బుకు కొరతలేని మాట నిజమే. అయినా ఈ విధంగా తండ్రి వ్యసనాలకు డబ్బు ఇస్తూపోతే, ఎంతకాలం ఈ ఆస్తి నిలుస్తుంది? దీనికి అంతం

ఎక్కడ? ఇవ్వను అనటానికి అతనికి ధైర్యం లేదు. ఆయన అరుస్తాడు. యాగీచేస్తాడు. పంచాయితీలు పెడతాడు. కన్నీళ్ళు కారుస్తాడు. ఆ పైశాచికశక్తి ముందు తాను ఎప్పుడూ అశక్తుడే. డబ్బిచ్చేస్తే ఆ డబ్బు పుచ్చుకుని పోతాడు. ఇల్లు ప్రశాంతంగా వుంటుంది. కంటికి నిండుగా నిర్మల కనిపిస్తుంది. చిన్న పిల్లలు రజనికి, నళినికి, వసుధకు కూడా అతన్ని చూస్తే బూచాడిని చూసినట్టు వుంటుంది. ఆయన వచ్చిన దగ్గర్నుండీ అంతా ఆయన పోవటం గురించి ఎదురుచూసేవాళ్ళే. ఇలా ఎంతకాలం సాగుతుంది?

'సాగినంత కాలం' అనుకుంటాడు మోహన్ సమస్యలను వాయిదా వేస్తూ.

ఆ సాయంత్రం...

"అన్నయ్యా! సినిమాకు వెళదామా? " అని ప్రపోజల్ పెట్టేడు రజని.

"అమ్మయ్యో! అయ్యగారు వస్తే..." అని భయాన్ని వెల్లడించింది వసుధ, గుండెల మీద చేతులుంచుకుని. దానికి ఏడాదిగా అలవాటయిపోయింది అయ్యగారు అకస్మాత్తుగా రావటం, అంతే అకస్మాత్తుగా మాయమయిపోవటం.

"వస్తే భయమా? సినిమాకు వెళ్ళామని చెపుదాం" అన్నాడు నళిని.

"ఇప్పుడేం సినిమారా? చదువుకోకుండా? " అన్నాడు మోహన్.

"ఎప్పుడూ చదువేనా? బోరుకొడుతోంది అన్నయ్యా" అని పేచీ మొదలుపెట్టారు తమ్ముళ్ళిద్దరూ.

సాధారణంగా ఆ సమయంలో వాళ్ళిద్దరూ ఆటకు వెళ్ళిపోతారు. బయట ముసురుగా వుంది. వాతావరణం ఆటకు అనుకూలంగాలేదు. ఇంట్లో తోచక పేచీకి దిగేరు. ముసురు వల్ల నిర్మల కూడా ట్యూషన్లకు వెళ్ళలేదు.

"పోనీ తీసుకెళ్ళరాదూ? " అని ఒక ఉచిత సలహా పడేసింది.

"నువ్వూ రారాదూ! అందరం కలిసి వెళదాం" అన్నాడు మోహన్. నిర్మల ఒప్పుకుంటుందని ఆశలేదు. చాలా యధాలాపంగా అన్నాడు.

"నేనా? " నీకేమైనా పిచ్చా అన్నట్టు చూసింది.

నిర్మలక్క వస్తే అన్నయ్య సినిమాకు తీసుకు వెళతాడు లేకపోతే సినిమాలేదు అన్పించినట్టుంది.

"అక్కా, నువ్వూరా" అని గొడవ చేశారు మగపిల్లలిద్దరూ.

"రా అక్కా! అందరం వెళదాం" అంది వసుధ కూడా.

"నిన్నెవరు తీసుకెళ్తున్నారే? " అని దాని తలమీద మొట్టికాయ వేసి నవ్వేశాడు మోహన్.

ఇంటికి తాళంవేసి అయిదుగురూ రోడ్డు మీద పడ్డారు. సినిమా వదిలేసరికి వాన పెద్దదయింది. బ్రహ్మ ప్రయత్నంమీద రెండు రిక్షాలు దొరికేయి. రిక్షా వాటాలు వేసుకుని, పిల్లలు ముగ్గురినీ ఒక రిక్షాలోనూ, పెద్దలిద్దరినీ ఒక రిక్షాలోనూ కూర్చుండచేశారు.

నిర్మలకు ఆ సినిమా, ఈ వానా, రిక్షాలో మోహన్‌తో ప్రయాణమూ- అగ్నిపరీక్షలానే వుంది. అతని ఉచ్ఛ్వాసనిశ్వాసాలు బరువుగా వున్నాయి. అతని స్పర్శ సంకల్పితమో, అసంకల్పితమో తెలియటంలేదు. నోరు విప్పితే ఏ ప్రమాదం ముంచుకు వస్తుందో అని భయపడ్డదానిలా మాట్లాడకుండా కూర్చుంది.

మగపిల్లలు భోజనాలు కూడా చెయ్యకుండా నిద్రపోయారు. మోహన్ ఏవో కాలేజీ విషయాలు మాట్లాడ్డం మొదలుపెట్టేడు మాట్లాడ్డం ఆపితే ఆమె వెళ్ళిపోతుందని భయపడ్డవాడిలా. ఏమీ అర్థంకాకపోయినా, వసుధ వింటూ కూర్చుని కాసేపటికి అక్కడే నేలమీద పడి నిద్రపోయింది.

చాలాసేపటి తర్వాత...




"నిద్ర రావటంలేదూ మోహన్? " అనడిగింది నిర్మల.

అతను తల అడ్డంగా వూపేడు.

"అయితే ఒక కప్పు కాఫీ తాగుదాం వుండు"

"ఇద్దరికీ కలిపి ఒక కప్పే? "

"ఆc" అని నవ్వుకుంటూ నిర్మల వంటింట్లోకి వెళ్ళింది.

అతను కూడా ఆమెను అనుసరించేడు. బొట్టులేని నుదురు, బోసిచేతులు, మెడ, తెల్లని దుస్తులు, నడుము వరకూ అలలు అలలుగా సాగిన నల్లని ఒత్తయిన జుట్టు, సహజ సౌందర్యంతో అలరారుతోంది నిర్మల.

"నిర్మలా" అతని గొంతులోని కంపన అతనికే స్పష్టంగా వినవస్తోంది. ఏం మాట్లాడాలో అతనికి తోచలేదు. ఈ ఏకాంతమూ, ఈ కాంత సాన్నిధ్యమూ కావాలని వుంది. సమాజంలో ఇన్ని నియమాలు, నిబంధనలు ఎవరు సృష్టించారు? సృష్టిలో ఏ జీవికీ లేని నియమాలు! అతనికి అసహనంగా వుంది. అతను నుదురు చిట్లించటం చూసి,

"తల నొప్పిగా వుందా మోహన్" అంటూ ఆమె దగ్గరకు వచ్చింది.

'రాకు, రాకు, నన్ను రక్షించు. నిన్ను నువ్వు రక్షించుకో' అందామనుకున్నాడు.

సగం రాత్రిలో వసుధకు చలివల్ల మెలకువ వచ్చింది. అది లేచి వెళ్ళి దుప్పటితెచ్చి కప్పుకుంటూ 'నిర్మలక్క ఇవాళ కిందే పడుకున్నట్టుంది' అనుకుంది.

★ ★ ★

సూర్యారావు ఈసారి హైద్రాబాదు నుండి వస్తూనే ఆయన పరిభాషలో 'శుభవార్త'తో వచ్చాడు.

"మోహన్! నీకు ఒక మంచి పెళ్లి సంబంధం కుదుర్చుకుని వచ్చాను. అమ్మాయి నాకు నచ్చింది. సెంట్రల్ యూనివర్శిటీలో ఎమ్మే లిటరేచర్ ప్రీవియస్ చేస్తోంది. కట్నం అదీ కూడా బాగా ఇవ్వగలవాళ్లు"

మోహన్ ఆయన మాటలకేమీ సమాధానం ఇవ్వలేదు. "నేను కాలేజీకి వెళ్తున్నాను" అంటూ వెళ్లిపోయాడు.

సూర్యారావు స్నానాదులు ముగించి వీధి తలుపులు బార్లా తీసి కూర్చున్నాడు. నిర్మల బయటకు వెళ్లి వుంటుంది. వస్తే పట్టుకుని గుమ్మంలోనే ఈ 'శుభవార్త' చెప్పాలని అతని శాడిస్టిక్ ఆలోచన. అతని అంచనా ఫలించి నిర్మల కనిపించింది.

"ఏం నిర్మలా? బావున్నావా? "

ఆమె తల వూపింది.

"కూరలేమైనా చేసి పెట్టకూడదూ! ఈ గుండుకి జుట్టయితే వచ్చింది. కానీ వంట మాత్రం రాలేదు"

అతని నవ్వు ఆమెకు కారం రాసుకున్నట్టుగా వుంది. సంభాళించుకుని,

"వంటకు అది లాభంలేదండీ. చిన్నపిల్ల కదా! కొంచెం పెద్దమనిషిని ఎవరినయినా చూడండి" అంది.

"ఆ! రెండేళ్లాగితే ఇదీ పెద్దమనిషవుతుంది" తన హాస్యానికి తనే నవ్వుకుంటున్నాడు.

"ఛీ! ఇతనితో మాట్లాడ్డం నాదే బుద్ధి తక్కువ" అనుకుంది వసుధ.

"అయినా ఇంక మాకు వంటమనుష్యుల బాధ లేదులే. మా మోహన్‌కి పెళ్లి చేసేస్తున్నాం. మా కోడలు వచ్చిందంటే ఇంక అన్నీ ఆ అమ్మాయే చూసుకుంటుంది"

నిర్మల ముఖం పాలిపోయింది. సూర్యారావుకి కావలసిన ఆనందం లభించింది. ఆమె తడబడుతున్న అడుగులతో మెట్లెక్కి తన గదిలోకి వెళ్లిపోయింది.

★ ★ ★

"నాకిప్పుడు పెళ్లేమిటి? అర్థంలేదు" విసుక్కున్నాడు మోహన్!

"ఏం? నువ్వేమయినా చిన్నపిల్లాడివనుకుంటున్నావా? ఇరవై ఆరేళ్లు నిండిపో

యేయి. చదువు పూర్తయిపోయింది. ఉద్యోగం చేస్తున్నావు. ఇంకా ఏమిటి అడ్డంకి? "

మోహన్ పది నిముషాలు మాట్లాడ లేదు. తర్వాత...

"ఇప్పుడప్పుడే పెళ్లి నాకిష్టంలేదు" అని గొణిగేడు.

"మరింకెప్పుడయితే ఇష్టం? సరేలే. అవన్నీ తరువాత మాట్లాడుకుందాం. సాయంత్రం రైలుకి అచ్యుతరామయ్య వస్తున్నాడు. అదేనోయ్, మీ కాబోయే మామగారు. నిన్ను చూస్తాడట. మిగిలిన విషయాలు ఆయనకు నువ్వు నచ్చేక మాట్లాడుకుందాం. ఇప్పటినుండి మనిద్దరికీ వాదనెందుకూ? "

వసుధ మధ్యాహ్నం నిర్మల నిద్రపోతోంటే వచ్చి తలుపు తట్టి నిద్రలేపింది.

"అక్కా! మోహన్ అన్నయ్యను చూడటానికి ఎవరో వస్తున్నారట. అయ్యగారు నిన్ను కిందకి వచ్చి టిఫిను చెయ్యమన్నారు"

సూర్యారావుంటే నిర్మలకు ఆ ఇల్లు నిషిద్ధం! ఆ విషయం ఎవరూ చెప్పకపోయినా సూర్యారావుకి బాగానే తెలుసు. అందువల్ల అతను ఎప్పుడూ ఆమెకు కబురు చెయ్యడు. ఈమధ్య అన్నీ విశేషాలే జరుగుతున్నాయి. నిర్మల మనసుకూడా అయోమయంగా కీకారణ్యంలో మంటల మధ్య చిక్కుకున్న జింకపిల్లలా వుంది. ఆమె వసుధతో "వస్తున్నానుపద" అని చెప్పి ముఖం కడుక్కుని కిందకు వెళ్లింది. ముందు గదిలోనే కూర్చుని వున్నాడు సూర్యారావు.

"సారీ నిర్మలా! నిన్ను కష్టపెట్టక తప్పటం లేదు. మోహన్‌ని చూసుకునేందుకు వాడి కాబోయే మామగారు వస్తున్నారు. ఒక స్వీటు, ఏదయినా హాటు చేసి పెడతావని పిలిచాను"

నిర్మల అతన్ని సూటిగా చూసింది. అతని కళ్లు క్రూరంగా నవ్వుతున్నాయి. అతనికి సమాధానం చెప్పాలంటే మోహన్ కలిసి రావాలి. అది జరిగే పని కాదు. అందువల్ల ఈ పోరాటంలో ఓటమి తనది. గెలుపు సూర్యారావుది. చేదుగా వున్నా తాను ఈ నిజాన్ని అంగీకరించి తీరాలి. నిర్మల వంటింట్లోకి వెళ్లి గులాబ్‌జాం చేసింది. జీడిపప్పు పకోడీ చేసింది. పండ్లు కడిగి పెట్టింది. ఇంతలో మోహన్ కాలేజీ నుండి వచ్చాడు. ఆ సమయంలో అదీ ఇంట్లో తండ్రి వుండగా నిర్మలను అక్కడ చూసి ఆశ్చర్యపోయాడు.

"నువ్వేమిటి? ఇక్కడ? "

"మీ మామగారు వస్తున్నారట సాయంత్రం రైలుకి. మీ నాన్నగారు టిఫిన్ చేయటానికి పిలిపించారు" అతను తప్పు చేసినవాడిలా తలవంచుకున్నాడు.

"ఏరా? స్టేషన్‌కి నువ్వు వెళతావా? నేను వెళ్లనా? " అంటూ వచ్చాడు సూర్యారావు.

"ఆయనెవరో నాకెట్లా తెలుస్తుంది? " అని విసుక్కున్నాడు మోహన్.

"అలాగేలే, నేనే వెళ్తాను" అంటూ వెళ్లిపోయాడు.

నిర్మల మోహన్‌కి కాఫీ కలిపి తెచ్చి ఇచ్చింది. అతను కాఫీతోపాటు ఆమె చేతిని అందుకోబోయాడు. ఆమె చటుక్కున చెయ్యి వెనక్కిలాక్కుంది. తలెత్తి ఆమె కళ్లలోకి చూసేందుక్కూడా అతనికి ధైర్యం చాల్లేదు. ఆమె డ్రాయింగ్‌రూముని నీటుగా సర్ది, వసుధతో వచ్చిన వాళ్లకు కాఫీ కలిపి ఇవ్వమని చెప్పింది.

"నేను వెళతాను మోహన్! నాకు ట్యూషన్లకు టైమయింది"

అతను నిస్తేజుడై చూస్తూనే వున్నాడు. ఆమె వెళ్లిపోయింది. ఆ రాత్రి చాలా పొద్దుపోయాక కానీ ఇంటికి తిరిగి రాలేదు నిర్మల. ఆమె నిశ్శబ్దంగా మెట్లెక్కుతూంటే





తన గది కిటికీలో నుండి నిస్సహాయంగా చూశాడు మోహన్.



ఏదిరోజుల తర్వాత మోహన్ హైద్రాబాద్ వెళ్లాడు అమ్మాయిని చూడటానికి. ఆ అమ్మాయి పేరు శిరీష, ఆ పిల్ల వెంటనే తన అభిప్రాయం చెప్పేసింది.

"నాకు పెళ్లికొడుకు నచ్చాడు"

మోహన్ తిరిగి వచ్చి తండ్రితో పేచీకి దిగాడు.

"ఆ అమ్మాయి చాలా ఫాస్ట్‌లా వుంది. నా స్వభావానికి సరిపడదు"

"అదేనా నీ అభ్యంతరం? " అని సూర్యారావు గద్దించేడు.

"అవును అది చాలదా? "

"ఆ అమ్మాయి సిటీలో పుట్టిపెరిగిన పిల్ల. అలాకాక బోడిముండలాగ ఒక మూల కూర్చుని వుంటుందనుకుంటున్నావా? నీకు ఆ మాత్రం చలాకీ అయిన పిల్ల కాకపోతే మరీ వానపాములా తయారవుతావు. ఐ.ఎ.ఎస్‌కి ప్రిపేర్‌కారా అంటే ఈ వెధవ పంతులు ఉద్యోగం వెలగబెడుతున్నావా? చక్కగా సిటీపిల్లని చేసుకోరా అంటే 'ఫాస్ట్' అంటావేం? నీకేం కావాలో నీకు తెలీదు. నేను చెప్తున్నా విను. శిరీషను చేసుకో. అన్నివిధాలా సుఖపడతావు. అచ్యుతరామయ్యగారూ, నేనూ అన్నీ మాట్లాడేసుకున్నాం" అన్నాడు సూర్యారావు.

ఆయన నిర్మలని మనసులో పెట్టుకుని ఇదంతా వాగాడని గ్రహించలేనంత మూర్ఖుడుకాడు మోహన్. 'నీకేం కావాలో నీకు తెలీదు' అన్న తండ్రి స్టేట్‌మెంట్‌తో కూడా అతను అంగీకరించలేకపోయాడు. 'నాకేం కావాలో నాకు తెలియకపోవడమేమిటి? దాన్ని పొందే మార్గం తెలీదుకానీ' అనుకున్నాడతను నిర్వేదంగా.

తండ్రి శిరీషతో తన పెళ్ళి నిశ్చయించేశాడు. ఇప్పుడు తను కాదంటే ఏంజరుగుతుందో మోహన్ బాగానే ఊహించగలడు. నిర్మలని బంధువుల్లో అల్లరిపెడతాడు. ఆయన అన్నింటికీ తెగించినవాడు. తిరస్కారమూ, అవమానమూ ఆయన్ని బాధించవు. తాను కోరుకున్నది జరిగితేచాలు. దానికోసం ఆయనెంతకయినా దిగజారగలడు.

మోహన్ ఎటూ నిర్ణయించుకోలేకపోయాడు. నాలుగురోజులపాటు నిర్మలను కలవాలని అతను చేసిన ప్రయత్నం ఫలించలేదు. సూర్యారావు ఎప్పుడూ ఇంట్లోనే వుంటున్నాడు. అతను లేని సమయంలో నిర్మల కావాలని వెళుతోందో లేక నిజంగా పని వుండే వెళుతోందోగానీ బయటకు వెళ్ళి బాగా చీకటిపడ్డాక వస్తోంది. అతనికి అన్నం సహించడం మానేసింది. వసుధే తల్లిలా, అతన్ని కనిపెట్టుకుని కాఫీ, టిఫిను ఇస్తుండేది.

"చూడబోతే నీకు తప్ప నేనెవరికీ అక్ఖర్లేదులా వుంది" అనేవాడతను.

అతనూ, నిర్మలా దేనికో బాధపడుతున్నారని దానికి తెలుసు. కానీ ఏంచెయ్యగల వయసూ, సామర్థ్యమూ ఆ పసిదానికి లేకపోయాయి.

★ ★ ★

మోహన్ పెళ్ళి ముహూర్తాలు నిర్ణయిం

చారు. అచ్యుతరామయ్యగారు కూతురు పెళ్లికి ఎంత కట్నం ఇస్తున్నాడో తెలీదు. సూర్యారావు వసుధతోసహా ఇంటిల్లిపాదికీ, పెళ్ళికూతురికీ బట్టలు కొన్నాడు. శిరీషకు నగలు కొన్నాడు. దేనికీ మోహన్ని డబ్బు అడగలేదు. దానిని బట్టి తండ్రికి అచ్యుతరామయ్య బాగానే డబ్బు ఇచ్చి వుంటాడని మోహన్ వూహించాడు. ఇంటికి సున్నం వేయించారు. తలుపులకూ, కిటికీలకూ రంగులు వేయించారు. ఇల్లు పెళ్ళికళ సంతరించుకుంది. ఒక సాయంత్రం మోహన్ లేనిసమయంలో సూర్యారావు పైకి నిర్మల గదికి వెళ్ళాడు.

"నిర్మలా, పదిహేనవ తేదీ మోహన్ పెళ్ళి. కొత్తదంపతులు కదా! కొంచెం సరదా, సరసం వుంటాయి మరి. నువ్వు ఈ గది ఖాళీ చేస్తే బావుంటుంది"

నిర్మల మోహన్ పెళ్ళివార్త తెలిసినది మొదలు క్షణక్షణమూ కృంగిపోతూనే వుంది. ఈ హెచ్చరిక అర్థమయిందామెకు. 'అలాగే' అన్నట్టు తల ఊపింది. మరురోజు ఉదయానికి నిర్మలకు ఒళ్ళు తెలియని జ్వరం వచ్చేసింది. ఆ విషయం ముందుగా వసుధ గమనించింది.

"అక్కా! నీ ఒళ్ళు నిప్పులా కాలిపోతోం దక్కా! డాక్టరు దగ్గరకు వెళదాం అక్కా" అని ఏడవడం మొదలుపెట్టింది.

"అలాగే... అలాగే. పిచ్చిదానా! ఏడవకు. మోహనన్నయ్య కాలేజీకీ, రజనీ, నళినీ స్కూల్కీ వెళ్ళిపోయాక వెళదాం. సరేనా? నువ్వు కూడా రా. ఇద్దరం కలిసే వెళదాం" అని వసుధని ఓదార్చింది.

వసుధ ఆ విధంగానే మగవాళ్ళంతా బయటకు వెళ్ళిపోయాక రిక్షా తీసుకుని వచ్చింది. నిర్మల ముఖాన బొట్టువుంది. పమిట భుజాలనిండుగా కప్పుకుంది.

"అక్కా! నువ్వు బొట్టుపెట్టుకుంటే ఎంత బావున్నావో" అంది వసుధ పసితనపు అమాయకత్వంతో. నిర్మల దానిని కౌగలించుకుని బిగ్గరగా ఏడ్చింది. బిత్తరపోయిన దానిముఖం చూసి, "ఒంట్లో బాగాలేదే. వాంతులయ్యాయి. బాగా తలనొప్పిగా వుంది" అంది.

ఇద్దరూ కలిసి లేడీ డాక్టరువద్దకు వెళ్ళారు. నిర్మల డాక్టరుకు చూపించుకోవడానికి లోపలకు వెళితే, వసుధ వరండాలో కూర్చుని గోడలకి వున్న పసిపిల్లల బొమ్మలన్నింటినీ పరీక్షగా చూస్తూ గడిపింది. అరగంట తర్వాత నిర్మల బయటకు వచ్చింది. రిక్షాలో కూర్చోగానే బొట్టు చెరిపేసుకుంది. మందులషాపు దగ్గర రిక్షా ఆపి మందులు కొనుక్కుంది. తిరిగి ఇద్దరూ ఇంటికి చేరారు. వచ్చేటప్పటికి సూర్యారావు తాళం వేసిన గుమ్మంముందు పచార్లు చేస్తున్నాడు.

"వసుధను కోప్పడకండి. నేనే ఒంట్లో బాగోలేకపోతే డాక్టరు వద్దకు సాయంగా తీసుకువెళ్ళాను" అంది నిర్మల.

"ఫర్వాలేదు నిర్మలా. గది విషయం ఏంచేశావు? "

"రేపో ఎల్లుండో నేను మా వూరు వెళ్ళిపోతున్నానండీ"

"అయ్యో! ఇన్నేళ్ళూ వుండి, పెళ్ళికి వుండకుండా వెళ్ళిపోతున్నావా? "

నిర్మల మౌనంగా మెట్లెక్కి వెళ్ళిపోయింది.

★ ★ ★

నిర్మల వెళ్ళిపోతోన్న విషయం విన్న వసుధ ప్రాన్పడిపోయింది. ఈ నగరంలో దానికి మొట్టమొదట తారసపడిన వ్యక్తి నిర్మలే. దానికి నామకరణం చేసినా, పని నేర్పినా, విద్య నేర్పినా అన్నీ నిర్మలే.

రాత్రుళ్ళు నిర్మల గదిలో పడుకోవడం అటుంచి, రోజులో ఒక్కసారయినా నిర్మలను చూడకపోతే దానికి తోచేదికాదు. నిర్మల వెళ్ళిపోతుందంటే గుండెల్లో చాలా వెలితిగా అన్పించింది. 'అన్నయ్యకు చెప్పాలి' అనుకుంది. అనుకోవడమేమిటి, ఆ




సాయంత్రం అతను రాగానే టీ కప్పు చేతిలో పెడుతూ అది మాట్లాడిన మొదటి సంగతి అదే!

"అన్నయ్యా! నిర్మలక్క వెళ్ళిపోతుందటగా"

అతని చేతిలోని కప్పు వణికింది.

"ఎవరు చెప్పారు? "

"ఇందాక నిర్మలక్క అయ్యగారికి చెప్పింది. అయ్యగారు అక్కని గది ఖాళీ చెయ్యమన్నారు. రేపో, ఎల్లుండో ఊరు వెళ్ళిపోతానని చెప్పింది"

'ఈ విషయమై నువ్వు ఏమీ చెయ్య లేవా? ' అన్నట్టు ఆశగా అతని ముఖంలోకి చూసింది. అతను టీ తాగటం ముగించి గబగబా పైకి వెళ్ళాడు. నిర్మల గదికి తాళం వేస్తోంది.

"నిర్మలా! ఒక్కసారి తాళం తియ్యి. నీతో కొంచెం మాట్లాడాలి"

"నేను ప్రయివేటు చెప్పడానికి వెళ్ళాలి"

"రేపు వెళ్ళిపోయేదానివి. ఈవేళ ప్రయివేట్లు చెప్పకపోతే ఏమీ మునిగిపోదులే. తలుపుతియ్యి"

ఆమె తలుపుతీసింది. అతను లోపలకు వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు. బయటకు వెళ్ళిన తండ్రి ఏ క్షణాన్నయినా రావచ్చు అతనికి భయం అన్పించలేదు.

"రేపు వెళ్ళిపోతున్నావటగా? "

"వసుధ చెప్పిందా? "

"రేపు వెళ్ళిపోతున్నావా? " అతను గొంతు హెచ్చించి అడిగాడు. బయట ఎంత పిరికివాడయినా, నెమ్మదస్తుడయినా మగవాడు తాను ప్రేమించిన ఆడదానిముందు ఎప్పుడూ తన ఆధిక్యతను ప్రదర్శిస్తూనే వుంటాడు. నిర్మల తల ఊపింది.

"... ... ..."

"ఏంనిర్మలా! ప్రతి ప్రశ్నా రెండుసార్లు అడిగితేకానీ సమాధానం యివ్వవా? "

"ఎందుకంటే... ఈ గది మీ భార్యాభర్తలకు..."

నిర్మల వాక్యం పూర్తిచేయకుండానే ఏడవడం మొదలుపెట్టింది. అతను దగ్గరకెళ్ళి ఆమెను కౌగలించుకున్నాడు. ఆమె ఏడుపు ఉధృతమైంది. చాలాసేపటికి తననుతాను సంభాళించుకుని అతనినుండి విడివడింది.

"నేను వెళ్తాను మోహన్. అదే అందరికీ మంచిది"

"అందరికీ అంటే? "

"నీకూ, నాకూ, నీ కుటుంబానికీ, మా అన్నల కుటుంబాలకీ... అందరికీ"

పరస్పరానురాగబద్ధులయిన ఇద్దరు యువతీయువకులు కలిసి జీవించడానికి ఇన్ని అడ్డంకులా? తాను వీటిని అధిగమించలేడా? ఇద్దరు బలహీన మనస్కుల ప్రేమ ఎప్పటికయినా విషాదాంతం కావల్సిందే! ఇంకో గత్యంతరంలేదు. అతను ఆమెను గట్టిగా పట్టుకుని తల వెనక్కు వంచి కక్ష తీర్చుకుంటున్నవాడిలా గట్టిగా పెదవులమీద ముద్దుపెట్టుకున్నాడు. తర్వాత గబగబా మెట్లు దిగి వెళ్ళిపోయాడు. ఆమె జీవితంలోనుండి కూడా ఆ క్షణానే వెళ్ళిపోయాడు.

★ ★ ★

వసుధ ఆశించినట్లు ఏ మాయా జరగలేదు. మోహన్ నిర్మల నిష్క్రమణను ఆపనూలేదు.

మరురోజు ఉదయం పైకి వెళ్ళిన వసుధకు తాళంకప్ప దర్శనమిచ్చింది. 'ఇంత ఉదయమే నిర్మలక్క ఎక్కడికి వెళ్ళిందబ్బా!' అనుకుంది.

పదిగంటల ప్రాంతంలో సూర్యారావు దానికి తాళంచెవి ఇచ్చి "కింద ఇంటితో పాటు పైగది కూడా శుభ్రంచేయించు" అని చెప్పినప్పుడు దానికి అక్క వెళ్ళిపోయిందని తెలిసింది. నిర్మల దానికి మళ్ళీ ఎప్పుడూ కనపడలేదు.

★ ★ ★

మోహన్ పెళ్ళి హైద్రాబాద్‌లో రంగరంగ వైభవంగా జరిగింది. వెంటనే శిరీష కాపురానికి కూడా వచ్చింది. ఆమె చాలా అందమై



నది. అందగత్తెననే అహం కూడా వుంది. ఆస్తిపరురాలు కూడా కావడంతో ఆ అహం మరింత పెరిగింది. వచ్చీరాగానే ఆఘమే ఘాలమీద అందరినీ అన్ని మూలలకూ పరుగెత్తించి వంటమనిషిని కుదిర్చింది.

"ఈ నల్లపిల్లకు అంట్లుతోమడం తప్ప ఇంకేపనీ లేదు. ఏమిస్తారో గానీ" అంది ఛీత్కారంగా వసుధను చూస్తూ.

నళినీకాంత్‌కి వదినగారిమీద చాలా కోపం వచ్చింది. వసుధనెవరయినా కర్రిది, గుండుది అంటే వాడికి చాలాకోపం. తండ్రి 'గుండు' అని పిలుస్తోంటే నిస్సహాయంగా కోపం దిగమింగుకుంటాడు. కానీ ఇంకెవ రైనా దాన్ని పల్లెత్తుమాట అంటే వాళ్ళతో కొట్లాటకు దిగుతాడు.

"వదినా! ఆమె పేరు వసుధ. మీరు నల్ల పిల్ల అంటే బావుండదు" అన్నాడు.

'బ్రేవో' అనుకున్నాడు మోహన్ మన సులో సంతోషంగానే.

"వసుధ. పేరు గొప్ప స్టైల్‌గా వుంది. అదిసరేగానీ, నువ్వేమిటి పనిపిల్లను వెనకే సుకొస్తున్నావ్" శిరీష నళినితో తగాదాకు దిగింది.

"తనేమీ పనిపిల్లకాదు, మా చెల్లి"

వసుధ తన పెద్దవయిన కళ్ళను మరింత విప్పార్చి నళినిని చూసింది. అందరినీ వరు సలు పెట్టి పిలుస్తుంది. కానీ వాళ్ళు తనకు యజమానులు. తాను పనిపిల్లను అని దానికి తెలుసు. నళిని తనను 'మా చెల్లి' అంటే దానికి ఎంతో సంతోషం కలిగింది. ఆ క్షణాన కాపీ రాయలేదని, ఎక్కాలు అప్ప చెప్పలేదని నళిని తనను కొట్టిన దెబ్బలన్నిం టినీ క్షమించేసింది.

"ఏడిచావులే. పనిముండ చెల్లేమిటి? నువ్వుపోయి చదువుకో" అంది శిరీష. ఆ క్షణాన ఆమె అందరికీ ఆడ సూర్యారావులా తోచింది.

కొత్త వంటమనిషి పేరు రాఘవమ్మ. ఏభై సంవత్సరాల వయసు వుంటుంది. ఆ మనిషి చాలా ఇళ్ళల్లో పనిచేసింది. జీవి తంలో ఢక్కామొక్కీలు తిన్న రాఘవమ్మకి ఈ ఇంటి వ్యవహారమంతా రెండురోజుల్లో అవగతమైపోయింది. పేరుకు ఇంటి యజ మాని అయిన సూర్యారావుకు ఆర్థిక స్వాతం త్ర్యంలేదు. అతను నెలకు పదిహేను రోజులు హైద్రాబాదులోని రేసుకోర్సుల్లోనూ, క్లబ్బులోనూ కాలం గడుపుతాడు. నిర్మల గదిని మోహన్ ఆక్రమించుకోవడానికి నిరా కరించడం వల్ల పైగదిని అతనే ఉపయోగి స్తున్నాడు. నిర్మల పుస్తకాలు పెట్టుకున్న అలమార్లలో ఇప్పుడు గుర్రపు సాహిత్యం, మందుబుడ్లూ వుంటున్నాయి. భార్య మర ణించింది మొదలూ అతని ఖర్మ ఏమిటో ఏ వంటమనిషీ అతనికి సహకరించలేదు. ఇదుగో ఇన్నాళ్ళకు ఈ రాఘవమ్మ దొరి కింది. 'బాబుగారికి ఏం కావాలో చూస్తాన' ంటూ అతను ఉన్నన్నిరోజులూ ఎక్కువ కాలం మేడమీదనే గడుపుతుంది. శిరీష ఈ నల్లపిల్లకు అంట్లుతోమటం తప్ప మరే పనీ లేదు అన్నమాటల్లో యదార్థంలేదు. రాఘ వమ్మ వసుధకు ఇరవైనాలుగు గంటలూ పనిచెప్తూనే వుంటుంది. బండెడు అంట్లు తోమేందుకు వేస్తుంది. తుడిపించిన గదులే మళ్ళీ మళ్ళీ తుడిపిస్తుంది. వాష్‌బేసిన్లు రుద్దిరుద్ది కడిగిస్తుంది. దానికితోడు శిరీషకు డ్రాయింగ్‌రూం అలంకరణ అంటే గొప్ప 'అబ్సెషన్'. తివాచీలు దులపటం, ఫ్లవర్‌వా జ్‌ల్లో పూలుపెట్టడం, బొమ్మలన్నింటినీ తుడిచి తిరిగి షోకేసుల్లో సర్దటం, రోజంతా ఏదో ఒకపని ఉంటూనే వుంటుంది వసు ధకు. భోజనం కూడా ఉదయానిది రాత్రి, రాత్రిది ఉదయమూ పెడతారు. పనిచెయ్యా టంకంటే శిరీషకు చొల్లు కబుర్లు, పితూరీలు చెప్పటం ఎక్కువ లాభదాయకమని గ్రహిం చిన రాఘవమ్మ ఆ రెండోపనే చేసి శిరీష దృష్టిలో 'రాఘవమ్మ'నుండి 'పిన్నిగారూ'! స్థాయికి ఎదిగింది. వసుధ ప్రతిక్షణమూ నిర్మలను తలుచుకుని నిట్టూర్చేది.

★ ★ ★





ఎప్పుడూ అరుస్తూ ఉండే శిరీష నిశ్శబ్దంగా పడుకుని వుంటే వసుధకు ఆశ్చర్యం కలిగింది.

సూర్యారావులాగానే శిరీషక్కూడా వసుధతో వరుసపెట్టి పిలిపించుకోవడం నామోషీ! ఆమె రాఘవమ్మకు 'అమ్మాయ్' కానీ వసుధకుమాత్రం 'అమ్మగారే'. వసుధ భయపడుతూనే దగ్గరకువెళ్ళి,

"అమ్మగారూ! అమ్మగారూ!" అని పిలిచింది.

శిరీష కళ్ళుతెరిచి చూసింది. ఆమె ముఖం ఉబ్బిపోయివుంది. కళ్ళు ఎర్రబడి వున్నాయి.

"జ్వరం వచ్చినట్టుగా వుందే? "

అది వణుకుతూనే శిరీష నుదిటిమీద చెయ్యివేసి చూసింది. వేడిగానే తోచింది.

"జ్వరం వచ్చిందమ్మగారూ!"

శిరీష ఏమీ మాట్లాడలేదు. తిరిగి కళ్ళు మూసుకుని పడుకుంది. వసుధ మోహన్ కోసం వెతికింది. అతను డైనింగ్‌టేబుల్ దగ్గర కనిపించాడు. కాఫీ తాగుతూ పేపరు చదువుకుంటున్నాడు.

"మోహనన్నయ్యా! అమ్మగారికి జ్వరం వచ్చింది"

అతను నింపాదిగా కాఫీ తాగటం ముగించి, పేపరు మడిచి శిరీష పడుకున్న గదిలోకి వచ్చాడు.

"జ్వరంగా వుందా? "

అతని ప్రశ్న ఆమెకు వినిపించిందో లేదో తెలియదు. ఆమె సమాధానం చెప్పలేదు. అతను వంగి నుదుటిమీద చెయ్యివేసి చూశాడు. వసుధవైపు తిరిగి,

"ఒళ్ళు వేడిగానేవుంది" అన్నాడు.

'నేను చెప్పలేదూ' అన్నట్టు చూసింది వసుధ.

"నువ్వు పోయి కొంచెం కాఫీ తీసుకురా" అతను భార్య మంచం దగ్గరకు కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు. వసుధ రాఘవమ్మనడిగి కాఫీ చేయించుకుని తెచ్చేసరికి శిరీష లేచి దిండుకు ఆనుకుని కూర్చుంది.

కాఫీ నోట్లో పెట్టుకోవడమేమిటి భళ్ళున వాంతయింది. అతను లేచి బయటకు వచ్చేశాడు.

"వసుధా! గది శుభ్రంచెయ్యి. మీ అమ్మగారిని బట్టలు మార్చుకోమని చెప్పు. ఆసుపత్రికి తీసుకువెళతాను"

"వద్దులెండి. మీరు కాలేజీకి వెళ్ళండి. నేను ఎవరినయినా తోడు తీసుకుని తర్వాత వెళతాను" అని శిరీష బలహీనమయిన స్వరంతో సమాధానం ఇచ్చింది.

మోహన్ ఆశ్చర్యపోయాడు. పెళ్ళయిన ఈ ఇరవైరోజుల్లో ఆమె ఈమాత్రం సౌమ్యంగా మాట్లాడడం ఇదే మొదటిసారి. అతను సంభాషణను కొనసాగించలేదు. స్నానమూ, టిఫినూ ముగించుకుని కాలేజీకి వెళ్లిపోయాడు.

"ఏం మనిషమ్మా! భార్యకి సుస్తీగా వుంటే ఏమీ పట్టనట్లు వెళ్ళిపోయాడు" అని రాఘవమ్మ కొంచెం అతిగా ఆశ్చర్యపోయింది. మళ్ళీ తనే...

"ఫర్వాలేదులే అమ్మాయీ! నేను తోడొస్తాను. వసుధా! నువ్వు పోయి రిక్షా తీసుకురా" అని ఆజ్ఞ జారీచేసింది.

ఇదివరకు నిర్మల కూడా జ్వరంతో ఆసుపత్రికి వెళ్ళడం వసుధకు గుర్తుకొచ్చింది. ఆ ఆసుపత్రి ఎక్కడో తెలుసు. రాములవారి కోవెలకు ఎదురు సందులో రిక్షా అక్కడికే బేరమాడి తీసుకువచ్చింది. తీరా రిక్షా వచ్చాక శిరీష,

"మీరు వుండండి పిన్నిగారూ! మీరొచ్చేస్తే వంటకూ, మామయ్యగారి భోజనానికీ ఇబ్బంది. వసుధను తీసుకువెళ్తానులెండి" అంది. రాఘవమ్మ ఆశ్చర్యపోయింది. కానీ ఏమీ మాట్లాడలేకపోయింది.

శిరీష రిక్షా సీటుమీద కూర్చుంటే వసుధ కింద ఆమె కాళ్ళదగ్గర కూర్చుంది. నిర్మల అయితే పక్కనే కూర్చోపెట్టుకునేది. అమ్మ, అమ్మగారు అంటే కాదు నిర్మలక్క అని

నేర్పించింది. రెండుపూటలా స్నానంచే యటం, తల శుభ్రంగా వుంచుకోవడం, బట్టలు ఉతుక్కోవడం నేర్పింది. దానికెందుకో శిరీషస్థానంలో నిర్మల వుంటే బాగుం డునన్పించింది. శిరీష డాక్టరు పరీక్షలకోసం లోపలకువెళ్ళింది. వసుధ పూర్వంలాగానే పసిబిడ్డల బొమ్మలను పరిశీలిస్తూ కూర్చుంది. తెల్లగా, బొద్దుగా ఒత్తయిన జుట్టుతో ఎంత ముద్దుగా వున్నారో! శిరీష పరీక్షలు చేయించుకుని బయటకు వచ్చింది. ఇద్దరూ తిరిగి రిక్షాలో ఇంటికి బయలుదేరారు.

కొంతదూరం వచ్చాక వసుధ,

"అమ్మగారూ! మందులు కొనుక్కోరూ? " అనడిగింది.

"ఇక్కడే మందులకొట్టు వుంది. డబ్బులివ్వండి. పట్టుకొస్తాను" అని కూడా అంది.

"నీకెట్లా తెలుసే? "

"ఇదివరకు నిర్మలక్కా, నేనూ ఈ ఆసుపత్రికి వచ్చాం అమ్మగారూ! ఈ షాపులోనే మందులు కొనుక్కున్నాం. అక్కకి కూడా జ్వరమూ, వాంతులూ అచ్చు మీలాగే. పాపం! అట్టాగే ఊరెళ్ళిపోయింది"

శిరీష ఏమీ మాట్లాడలేదు. ప్రిస్క్రిప్షనూ, డబ్బూ ఇచ్చింది. వసుధ వెళ్ళి మందులు కొనుక్కొచ్చింది. ఇద్దరూ తిరిగి రిక్షాలో ఇంటికి చేరారు. మధ్యాహ్నం రాఘవమ్మ పైగదిలో సూర్యారావుకి సేవ చేస్తోన్న సమయంలో శిరీష వసుధను పిలిచి దగ్గర కూర్చోపెట్టుకుంది. ఆమె ఇంత ఆప్యాయంగా ఎన్నడూ దానిని పలకరించలేదు.

"భోంచేశావా? " అని మొదలుపెట్టి ఈ నిర్మల ఎవరు? ఆమెకూ, ఈ ఇంటికీ సంబంధం ఏమిటి? అని కూపీలాగింది. వసుధకు శిరీష ఆంతర్యం తెలీదు. అంత వయసులేదు. నిర్మల ఆ ఇంటివాళ్లకు ఎంత దగ్గరదో కూడా దానికి తెలీదు. అది చేసిన తప్పు ఏదయినా వుందీ అంటే శిరీష అడిగిన ప్రశ్నలన్నింటికీ తనకు తెలిసిన, తోచిన సమాధానాలు చెప్పటమే. దానికి నిర్మలక్కను గురించి మాట్లాడ్డం సంతోషం కలిగించింది. ఎన్నడూలేనిది శిరీష అంత ఆదరంగా మాట్లాడ్డం కూడా దానికి ఎంతో ఉత్సాహాన్నిచ్చింది. ఆ హుషారులో వసుధ శిరీష ప్రశ్నలన్నింటికీ 'గుడ్‌గర్ల్'లా సమాధానాలిచ్చింది.

★ ★ ★

సాయంత్రం మోహన్ కాలేజీనుండి వచ్చేసరికి, రాఘవమ్మ 'స్వీట్' చేసి అతని ముందు ఉంచింది.

"ఏమిటి విశేషం? "అని అతను వసుధ నడిగితే సమాధానం కూడా ఆవిడే చెప్పింది. శిరీష వసుధను తీసుకుని డాక్టరు దగ్గరకు వెళ్ళిందట. ఆమె గర్భవతి అని డాక్టరు అనుమానిస్తోందట. ఇంకో ఇరవై రోజులో, నెలో అయితేగానీ ఖచ్చితంగా చెప్పలేనందట.

"ఖచ్చితంగా తెలిశాక తింటానులే" అని అతను స్వీటును పక్కకి తోసి వసుధను కాఫీ అడిగాడు. అది కాఫీ తెచ్చిచ్చాక,

"నిన్ను రామసుబ్బారావుగారింటికి వెళ్ళి పుస్తకాలు తెమ్మన్నాను. తెచ్చేవా? " అనడిగాడు.

"అయ్యో! మోహనన్నయ్యా! మరిచిపోయాను"

"నీకేంటే? పెద్దదానివయిపోతున్నావు. మతిమరుపు వచ్చేస్తోంది. ఫూల్! పద నాతో. నీకు పుస్తకాలిప్పించి నే లైబ్రరీకి వెళ్లొస్తాను"

"అయ్యో! ఆ పిల్లకు ఉల్లిపాయలు తరగవలసిన పనుందయ్యా" అంది రాఘవమ్మ.

"నువ్వు తరుక్కో" అన్నాడు మోహన్ కటువుగా.

కాసేపటికి వసుధా, మోహన్ బయటకు వచ్చారు. అతను పార్కువైపుకు నడుస్తోంటే,

"రామసుబ్బారావుగారిల్లు పుగాకు గోడౌన్ వైపు కదన్నయ్యా" అనడిగింది వసుధ.

"నాకు తెలుసులే" అని అతను పార్కు




# రచయితలకు మనవి



* 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
* ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.
* ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.
* ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టలోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
* సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
* ప్రతి నవలకు అందజేసే రు: 3000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

నవంబర్ చతుర నవల వసుధ

**సమీక్షకుని పేరు:** ..............................................

**చిరునామా:** ..............................................

..............................................

..............................................

..............................................

లోకి దారితీశాడు. ఇద్దరూ పార్కులో కూర్చున్నారు. ఇంటిపట్టున వుండడంవల్ల, వేళకు భోజనం తినటంవల్ల ఆ అమ్మాయి నలుపురంగుకు కొంచెం నునుపు వచ్చింది. ఇదివరకటిలా, కళ్ళు చెదిరేంతటి నలుపులా తోచటంలేదు. నళినిది చొక్కా, లాగు వేసుకుంది. తను ఉన్నన్ని రోజులూ నిర్మల చక్కగా నూనెరాసి, జడవేసేది. వెళ్ళేముందు దానికి జడ వేసుకోవడం రాదని క్రాపు చేయించింది. ఆ బట్టల్లో క్రాపులో వసుధ మగపిల్లవాడిలానే వుంది.

"ఐస్ క్రీం తింటావా?"

"వద్దులే"

"తిను ఫర్వాలేదు"

పర్సులోనుండి డబ్బులు తీసి ఇచ్చాడు.

"అదుగో ఐస్‌క్రీం అమ్మేషాపు. నీకొకటి, నాకొకటి తీసుకురా"

అయిదు నిముషాల్లో రెండుకప్పులు ఐస్‌క్రీం తెచ్చింది. అది తెచ్చుకున్న కప్పు పిస్తా, నిర్మలకి ఇష్టమయినది. దీనికి అన్నింటిలోనూ నిర్మలే ఆదర్శం అని ముద్దుగా విసుక్కున్నాడు. ఐస్‌క్రీం తిని, పంపుదగ్గర చేతులు కడుక్కుని జేబులోనుండి ఖర్చీఫ్ తీసి మూతి తుడుచుకుంది.

"మీ నిర్మలక్క నీకు బాగానే ట్రైనింగ్ ఇచ్చిందే" అని మెచ్చుకున్నాడు.

మోహన్‌కి రాఘవమ్మ మాటలు చాలా విచిత్రంగా తోచాయి. లేడీడాక్టర్ అయితే కడుపని చెప్పాలి. లేదా ఇప్పుడేమీ చెప్పలేనని చెప్పాలి. అంతేకానీ 'నేను నీకు గర్భం అని అనుమానిస్తున్నాను. ఇరవైరోజుల్లో ఏ విషయమూ చెపుతాను' అనడం అతనికి చాలా ఆశ్చర్యంగా అన్పించింది. అదీగాక, లేడీడాక్టరు దగ్గరకి తాను ఎంతగానో అభిమానించేది, అనుభవజ్ఞురాలు, వయసులో పెద్దది అయిన రాఘవమ్మని కాక తూర్పు పడమర తెలియని వసుధను శిరీష తోడు తీసుకెళ్ళడం అతనిలోని మగవాడికి అనుమానాన్ని కలిగించింది.

"వసుధా! ఇటురా"

వసుధ ఆటలు ఆపి వచ్చి మోహన్ ముందు నిలబడింది.

"కూర్చో"

ఎదురుగా బాసింపీట వేసుకుని కూర్చుంది.

"ఉదయం నువ్వూ, అమ్మగారూ ఏ ఆసుపత్రికి వెళ్ళారే?"

"అదే అన్నయ్యా! నేనూ, నిర్మలక్కా వెళ్ళలేదూ, చిన్నపిల్లల ఆసుపత్రికి. దానికే వెళ్ళాం"

హాస్పిటల్ వరండానిండా చిన్నపిల్లల బొమ్మలు ఉండడంవల్ల వసుధ దానిని చిన్నపిల్లల ఆసుపత్రిగా పేర్కొంది. ఆ మాటకి మోహన్ ఉలిక్కిపడ్డాడు. నిర్మల కూడా అదే ఆసుపత్రికి వెళ్ళిందా? దేనికి? వసుధకి మోహన్ ఆలోచనలతో పనిలేదు. అది దాని మాటలు కొనసాగించింది.

"అసలు అప్పుడు నిర్మలక్క వెళ్ళడంవల్లనే కదా నాకు ఆ ఆసుపత్రికి దారి తెలిసింది. ఇవాళ అమ్మగారిని నేనే సొంతంగా తీసుకెళ్ళా" పెద్ద ఘనకార్యం చేసినదానిలా చెప్పింది. మోహన్ నిశ్చేష్టుడై వింటున్నాడు.

"నిర్మలక్క గురించి అమ్మగారు ఏమిటేమిటో అడిగారన్నయ్యా?"

వసుధ ఉత్సాహంగా ఉదయం శిరీష ప్రశ్నలు, దానికి తన సమాధానాలు అన్నీ పూసగుచ్చినట్టు చెప్పుకొచ్చింది. అదంతా విని మోహన్ తన శరీరంలోని రక్తమంతా ఏ డ్రాక్యులానో పీల్చేసినట్టు వెలవెలబోయాడు. అతను నిస్సత్తువగా అక్కడే గడ్డిలో వాలి,

"సరే! నువ్వు ఇంక ఇంటికి వెళ్ళు. వెళ్తూ వెళ్తూ రామసుబ్బారావుగారింటికి వెళ్ళి పుస్తకాలు తీసుకువెళ్ళు" అన్నాడు. వసుధ పది అడుగులు వేశాక అతను మళ్ళీ దాన్ని వెనక్కు పిలిచాడు.

"చూడు వసుధా! నువ్వూ నేను పార్కుకి వచ్చామని, ఐస్‌క్రీం తిన్నామని ఎవరికీ

చెప్పకు" వసుధ తెల్లబోయింది. అదింకా వెళ్ళగానే ఈ వార్త రజనికీ, నళినీకి చెప్పి ఉడికించాలనుకుంటోంది.

"నువ్ ఐస్‌క్రీం తిన్నావని తెలిస్తే రాఘ వమ్మ నీకు అన్నం తగ్గించి పెడుతుంది"

అది అర్థమయినట్లు తల ఊపింది. మళ్ళీ బయలుదేరబోతోంటే అతను అడిగాడు.

"మీరు వెళ్ళిన ఆసుపత్రి ఎక్కడ? "

"రాములువారి కోవెలలేదూ? దాని ఎదురు సందులో"

"సరే నువ్వెళ్ళు, జాగ్రత్త. కొత్తవాళ్ళెవరి తోనూ మాట్లాడకు. పుస్తకాలు తీసుకుని తిన్నగా ఇంటికి వెళ్ళు" వసుధ వెళ్ళిపో యింది. అతను పార్కు కట్టేసేవరకు అక్కడే పచ్చికలో పడుకున్నాడు. అతని మనసంతా శూన్యంగా వుంది. తర్వాత కాళ్ళీ డ్చుకుంటూ బయటకు వచ్చాడు. 'ఇంటికి వెళ్ళి శిరీషను నమ్మటానికి ప్రయత్నిస్తాను' అనుకున్నాడు. రెండు అడుగులు ఇంటివేపు వేశాడు కూడా. కానీ అనుమానం వేరుపురు గులా మనసును దొలుస్తూనే వుంది. అతను దారిమార్చి వసుధ గుర్తులు చెప్పిన ఆసుపత్రికి వెళ్ళాడు. బయట కె. ఇందిరా దేవి, గైనకాలజిస్టు, ప్రసూతివైద్య నిపుణులు అని పెద్ద బోర్డు వేళ్ళాడుతోంది. ఆ లేడీ డాక్టరుతో ఏం మాట్లాడాలో మనసులోనే రిహార్సల్ వేసుకోసాగాడు. ఇంతలో నర్సు వచ్చి మగ పేషెంటును చూసి ఆశ్చర్యపో యింది. అతను నవ్వుకుని,

"నా భార్య ఉదయం వచ్చింది. మందులు ఎలా వేసుకోవాలో డాక్టరుగారిని అడగడానికి వచ్చాను" అని చెప్పాడు. అతను లోపల డాక్టరుకి కూడా అదే పాఠం చెప్పాడు.

"నా భార్య పేరు శిరీష. ఉదయం మీ హాస్పిటల్ కి వచ్చింది. ప్రెగ్నెంట్. జ్వరం ఇంకా అలాగే వుంది డాక్టరు గారూ! మందులేమయినా మారుస్తారా? "





డాక్టరు చేయిచాచి,

"ఉదయం నేను రాసిన ప్రిస్క్రిప్షన్ ఏదీ? " అనడిగింది. అతను చొక్కాజేబులు తడుముకుని,

"సారీ డాక్టరుగారూ. మరిచిపోయాను. వేరే షర్టులో వుండిపోయింది" అన్నాడు. ఆమె నవ్వి,

"ఫర్వాలేదులెండి" అని వేరే ప్రిస్క్రిప్షన్ రాసిచ్చింది.

మోహన్ కొంచెం తటపటాయించి,

"ఎక్స్‌పెక్టెడ్ డేటు ఎప్పుడు డాక్టరుగారూ!" అనడిగాడు.

ఆవిడ పెద్దగా నవ్వేసింది.

"ఏమిటీ చాలా కంగారుపడుతున్నారు. ఫస్ట్‌టైం కదా. అలాగే వుంటుందిలెండి. ఇప్పుడు మూడోనెలేగా. కొంచెం ఓపిక పట్టండి మరి" అంది.

అతను ఆ రాత్రంతా రోడ్లు కొలుస్తూ తిరి గాడు. ఇంటికి వెళ్ళలేదు.

★ ★ ★

ఆరోజు మొదలు మోహన్ పూర్తిగా మారిపోయాడు. మాట్లాడ్డం తగ్గించేశాడు. శిరీష అనే మనిషి ఇంట్లో వున్నది అనే విష యాన్ని అతను పూర్తిగా విస్మరించాడు. కాఫీ ఇచ్చినా, టిఫిను పెట్టినా, స్నానానికి నీళ్లు తోడినా, పుస్తకాలు సర్ది ఇచ్చినా, భోజనం పెట్టినా అన్నింటికీ వసుధే.

రాత్రుళ్ళు చాలా ఆలస్యంగా ఇంటికి వచ్చే వాడు. ఒక్కోసారి తాగి వచ్చేవాడు. వచ్చిన వాడు డ్రాయింగురూమ్‌లో సోఫాలో పడి నిద్రపోయేవాడు. ఎవరయినా పలకరిస్తే పెద్ద గొంతుతో వాళ్ళమీద అరిచేవాడు- ఒక ప్పుడు ఎంతో సౌమ్యంగా మాట్లాడే మోహన్. వసుధ ఒక్కతే అతని దగ్గరకు ధైర్యంగా వెళ్ళి బూట్లు, సాక్సు విప్పగలిగేది. ఒక్కోసారి కొంచెం టిఫినో, లేక పండో తిని పించగలిగేది. అతని ప్రవర్తనతో సూర్యారా వుకి సహనం నశించిపోయింది.

"నీ వ్యవహారం ఏం బాగాలేదు" అన్నాడు ఒకరోజు మోహన్ స్పృహలో వున్నప్పుడు.

ఇదివరకటి మోహన్ పిరికివాడు. సిగరెట్టు కూడా తాగటం తెలియనివాడు. ఇప్పుడు చూసేవాళ్ళకు ఇతను మోహనేనా? లేక అతని దెయ్యమా? అనిపించేలా తయారయ్యాడు. మునుపు ఎవరయినా గొంతు హెచ్చించి మాట్లాడితే ఇతను పిల్లిలా ముడుచుకుపోయేవాడు. అవతలివాళ్ళతో ఎంత అయిష్టమయిన విషయంలోనయినా సరే రాజీకి వచ్చేవాడు. ఇప్పుడు ఎవరయినా మాట్లాడిస్తే చాలు, రేచుకుక్కలా మీద పడుతున్నాడు. ఇప్పుడు సూర్యారావు.

"నీ వ్యవహారం బాగులేదు" అంటే అతను తపీమని.

"మీ వ్యవహారం నాకు అంతకంటె బాగోలేదు" అన్నాడు.

"నేనేం చేశాను? నీలాగ తాగి తందనాలాడేనా? " సూర్యారావు గొంతు పెంచి అరిచినట్టే అడిగాడు.

"చూడండి. మీరేం చేశారో, చేస్తున్నారో నాకు తెలుసు. నన్ను వూరికే రెచ్చగొట్టకండి. మీ ఇష్టం వచ్చినట్టు మీరుండండి. నా ఇష్టం వచ్చినట్టు ఇకనయినా నన్ను బతకనివ్వండి. నేను నోరు విప్పితే మీరూ, మిగిలినవాళ్ళూ కూడా ఆత్మహత్య చేసుకోవలసి వుంటుంది"

"రాఘవమ్మా, శిరీషా కూడా నేలకు కాళ్ళు అతికించినట్టే నిశ్చేష్టులైపోయారు. ఆ మాట తామిద్దరికీ అన్వయించుకుని ఇద్దరూ సూర్యారావునే శాంతింపచేశారు. మోహన్ మాత్రం ఏమీ జరగనట్టుగానే వసుధనడిగి టిఫిను పెట్టించుకుని తిని కాలేజీకి వెళ్ళిపోయాడు.

"ఆ రాత్రి శిరీష ఉదయం సూర్యారావు చేసిన తప్పునే తానూ చేసింది.

"ఏమిటండీ? పెద్దా, చిన్నా లేకుండా మామయ్యగారిని అంతంత మాటలన్నారు. పెళ్ళికిముందు ఏం అఘోరించారో ఏమో, పెళ్ళయినాక భార్య, దాని కోరికలు ఏమీ పట్టించుకోరా? ఈ తాగి రావటమేమిటి? ఆ డ్రాయింగురూములో పడకలేమిటి? "

అతను ఆమెను తీవ్రంగా చూశాడు.

"అలా చూస్తే బెదిరిపోతాననుకోకండి. నిర్మలతో మీ వ్యవహారం నాకు తెలుసు..." ఆమె వాక్యం కూడా పూర్తిచేయకముందే అతను చాచి చెంపమీద కొట్టాడు.

"ఏంటి? బ్లాక్‌మెయిల్ చేస్తున్నావా? నీ వ్యవహారం కూడా నాకు తెలుసు. నోరు మూసుకుని పడివుండు. చూడూ! నువ్వు నాకు మొదటిదానివి కాదు. నేనూ నీకు మొదటివాడిని కాదు. హం హం హం!" అని వికృతంగా నవ్వి అలాగే సోఫాలో వాలిపోయాడు.

అతను ఉదయం నిద్రలేచేసరికి సూర్యారావు.

"కోడలు వెళ్ళిపోతానంటున్నది" అని డిక్లేర్ చేశాడు, కొడుకుని చూడకుండా ఎదురుగా వున్న కోడలిని చూస్తూ.

"సంతోషం" అన్నాడు మోహన్ ఏ భావమూ లేకుండా.

"నేను మళ్ళీ ఇక్కడికి రాను" అంది శిరీష గబగబా అతని ముందుకువచ్చి నిలబడి.

"రాకు"

"నీకేమయినా పిచ్చెక్కిందా? " సూర్యారావు రెండు చేతులతోనూ తలపట్టుకున్నాడు.

"ఎక్కలేదు ఫాదర్! ఎక్కిన పిచ్చే దిగింది. ఏం శిరీషా? నీ గొప్పతనమంతా మీ మామగారికి చెప్పమంటావేమిటి? " అని నవ్వుతూ కన్ను గీటాడు. ఎంత రాక్షసమయిన నవ్వు! ఒక స్త్రీని సమ్మోహనపరచిన నవ్వు, మరొక స్త్రీ మనసులో మంటల్ని రేపుతోంది! అతని భావం ఏమిటో తెలుస్తూనే వుంది. అతను తనని బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడని గ్రహించలేనటువంటి మూర్ఖురాలు కాదు శిరీష.

"ఏంటిరా నాకు చెప్పేది? " అని సూర్యారావు రెచ్చిపోతోంటే,

"మీరు వూరుకోండి మామయ్యా! నేను



మా నాన్నగారి దగ్గరకు వెళ్తున్నాను కానీ అడవిలోకి కాదుగదా! కొన్నాళ్లు దూరంగా వుంటే ఆయనకే తెలిసివస్తుంది" అని అతన్ని శాంతింపచేసింది.

"అసలు మనం నిర్మలక్కని వెళ్ళిపోనివ్వ కుండా వుండాల్సిందన్నయ్యా!" అని ఏడ్చింది వసుధ, శిరీష రిక్షా, ఆ వెనుకే సూర్యారావు రిక్షా రైల్వేస్టేషనువైపు వెళ్తోంటే.

మోహన్ దాన్ని కౌగలించుకుని, "చిన్నదా నివి నీకున్న తెలివి నాకు లేకపోయిందే. అందుకే నాకీ శిక్ష" అని నిట్టూర్చాడు.

★ ★ ★

సూర్యారావు ఇదివరకటిలా ఇల్లు వదిలి క్యాంపులకు వెళ్ళటం లేదు. రేసులు వున్న ఊళ్లో కుదరవుగానీ, అతని మిగిలిన వ్యసనా లన్నీ నిరాటంకంగానే సాగిపోతున్నాయి. నిర్మల గది- అతను దెయ్యాల గది అని దూషించిన ఆ గది అతని ఆవాసం. అక్కడ అతను తాగి తందనాలాడతాడు. రాఘ వమ్మ సహకారం వుండనేవుంది. పేకాటకి ఊళ్లో క్లబ్బులు చాలు.

మోహన్ కూడా ఇదివరకులా తండ్రికి ధారాళంగా డబ్బు ఇవ్వటం లేదు. అందు వల్ల కూడా ఆయన రేసుల్ని, పొరుగూరు ప్రయాణాలను కొంతవరకు త్యాగం చెయ్య వలసివచ్చింది. పైగా ఇప్పుడు కొత్త భయం ఒకటి వచ్చిపడింది. హైదరాబాదు వెళితే వియ్యంకుడు కనపడి కూతురిని తీసుకెళ్ళ మంటాడేమోనని.

ఆ ఇంట్లో వచ్చిన మరొక మార్పు మోహన్ తాగుడు మానెయ్యటం. శిరీష ఇలా వెళ్ళిందో లేదో అతను తాగుడికి స్వస్తి చెప్పేశాడు. కాలేజీకి వెళ్ళటం, ఇంటికొస్తే తమ్ముళ్ళకూ, వసుధకూ పాఠాలు చెప్పటం అతని నిత్యకృత్యం అయిపోయింది. వసుధ కూడా శ్రద్ధగా చదువుకోవటం మొదలుపె ట్టింది.. ఎవరూ లేకుండా వసుధా, మోహన్ ఇద్దరే వుంటే ఎప్పుడూ నిర్మల గురించే మాట్లాడుకుంటారు. అదొక ఆనందం వాళ్ళిద్దరికీ.

వసుధ నీడలా ఎప్పుడూ నిర్మలతోనే వుండేదేమో మోహన్‌కి కూడా తెలియని ఎన్నో విశేషాలు చెపుతూ వుండేది. ఆరోజు నిర్మలక్క నీ బనీన్లు ఉతికింది. ఫలానా రోజు భలే సంతోషంగా వుందన్నయ్యా! శిరీ షమ్మగారి నాన్నగారు వచ్చినరోజు గులాబ్ జాములు చేసింది. చేస్తున్నంతసేపూ ఏడు స్తూనే వుంది. "ఉల్లిపాయలు కోస్తే ఏడు స్తారు కానీ, గులాబ్‌జామ్‌లు చేస్తే ఏడు స్తారా?" అని అడిగాను. "కొందరంతేలే. ఏం చేసినా జీవితమంతా ఏడుస్తూనే వుంటారు" అంది ఇలా ఎన్నో సంగతులు చెప్పేది. అవి అతని మనసుకు స్వాంతన కలిగించేవి. ఒక్కోసారి ఆలోచనల్లోకి జారు కునేవాడు. ఒక్కోసారి ఎంతో ఆవేదన పొందేవాడు.

"నీ భార్యకు 'అబార్షన్' అయిందట" అన్నాడు సూర్యారావు ఒకరోజు పోస్టులో వచ్చిన ఉత్తరం చదివి, "శుభం!" అన్నాడు మోహన్.

"అయ్యో! ఏం మాటలు నాయనా అవి?" అంది రాఘవమ్మ. అతను ఆమెని తీక్ష ణంగా చూశాడు. ఆవిడ పరుగెత్తుతున్నట్టు వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"గర్భం పోయిందంటే శుభం అంటావే మిత్రా?" అని మందలించాడు సూర్యా రావు.

"పోయిందో... తీయించుకుందో" అన్నాక అతని సంస్కారం మేల్కొంది. ఎదురుగా లేని ఒక స్త్రీని అవమానించి, అగౌరవపరిచే హక్కు తనకు లేదన్పించింది.

"ఎందుకు తీయించుకుంటుంది?"

"ఆ! సిటీలో పుట్టిపెరిగిన అమ్మాయి యూనివర్శిటీలో చదువుకున్నది. స్టైల్‌గా వుంటుంది. అప్పుడే కడుపేమిటి? అందం తరిగిపోతుందనుకుందేమో!"

"ఛ! ఛ! శిరీష అటువంటి అమ్మాయి





కాదు" అన్నాడు సూర్యారావు ఎంతో నమ్మకంగా.

"ఒకసారి పోయి చూసి రారాదూ? " అని కొడుక్కి సలహా కూడా ఇచ్చాడు.

సూర్యారావు ఆశ్చర్యపోయేలా మోహన్, "అలాగే" అని సమాధానం ఇచ్చాడు.

మోహన్ హైదరాబాద్ వెళ్లాడు. కానీ తిన్నగా మామగారి ఇంటికి వెళ్ళకుండా హోటల్లో దిగి, స్నానమూ, టిఫినూ ముగించుకుని ఉదయం పదిగంటల ప్రాంతంలో మామగారి ఇంటికి వెళ్ళాడు. శిరీష లేదు.

అచ్యుతరామయ్యగారు టిఫిన్ తింటున్నాడు. అల్లుడిని సాదరంగా ఆహ్వానించాడు. టిఫిన్ చెయ్యమన్నాడు. మోహన్ హోటల్లో దిగిన విషయం తెలుసుకుని నొచ్చుకున్నాడు.

"మమ్మల్ని క్షమించాలి అల్లుడూ! నీ బిడ్డను నీకు అప్పచెప్పలేకపోయాం" అని అల్లుడి చేతులు పట్టుకుని ప్రార్థించాడు. అయిదు నిమిషాలకు కానీ ఆయన శిరీష గర్భం పోయినందుకు విచారం వెలిబుచ్చుతున్నాడని అర్థం కాలేదు మోహన్‌కి.

"అమ్మాయి ఇప్పుడే స్నేహితులతో బయటకు వెళ్లిందయ్యా! నువ్వు విశ్రాంతి తీసుకో. వచ్చేస్తుంది" అని చెప్పి ఆయన కూడా వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం భోజనానికి శిరీష ఇంకొక యువకుడితో కలిసి ఇంటికి వచ్చింది. ఆమెని చూడగానే అర్థమయింది మోహన్‌కి. ఈ శిరీష తమ ఇంటికోడలు కాదు. జీన్స్ ప్యాంటు. పొట్టిచొక్కాతో వున్న ఈ శిరీష బహుశా ఇక తమ ఇంటికి రాకపోవచ్చు శిరీషతో వచ్చిన యువకుడు, ఆమె ఒక సోఫాలో కూర్చున్నారు. అతనికి మోహన్ ఎవరో తెలియదు. ఆమెను తట్టి, తట్టి మీదపడి మాట్లాడుతుంటే శిరీష ఇక తట్టుకోలేక, పరిచయ కార్యక్రమం మొదలు పెట్టింది. అతని పేరు సుబ్రాతోముఖర్జీ యం.బి.ఏ. చేశాడు.

ఇప్పుడు విదేశాలకు వెళ్ళాలనే ప్రయత్నంలో వున్నాడట.

"సుబ్రాతో! హి ఈజ్ మై హజ్బెండ్ మోహన్!"

ఆ మాట వినగానే అతను 'షాక్' కొట్టిన వాడిలా లేచి నిలబడి.

"మళ్ళీ కలుద్దాం శిరీ...షా!" అని పరుగెత్తుతున్నట్టు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయాక శిరీష లోపలకు వెళ్ళి దుస్తులు మార్చుకుని చీరె ధరించి వచ్చింది.

"ఇంత అకస్మాత్తుగా వచ్చారేం? ఉత్తరమయినా రాయలేదు" అంది.

"అనుకోకుండా వచ్చాను. నాన్నగారు నీకు 'అబార్షన్' అయిందంటే..."

"ఆయన కోసం వచ్చేరన్నమాట"

తనను వాక్యం పూర్తి చెయ్యనివ్వని ఆమె అసహనానికి అతను ఆశ్చర్యపోయాడు.

'నాన్నగారి కోసం రాలేదు. ఆయన అబార్షన్ అయిందని చెప్పారు. నేను చూడటానికి వచ్చాను' అందామనుకున్నాడు. కానీ అతనికి ఏమీ అనాలన్పించలేదు.

"ఉంటారా నాలుగురోజులు? "

"కుదరదు శిరీషా! సెలవులు లేవు"

"ఏం ఉద్యోగమండీ అదీ? వెధవ పంతులు ఉద్యోగం. సుబ్రాతో చూడండి. ఫారిన్ వెళ్ళాలనుకుంటున్నాడు. తిరిగి వచ్చాక స్వతంత్రంగా ఏ బిజినెస్సో పెడతాడు"

'నీ భార్య నిన్ను ప్రేమించటం లేదనటానికి దీనికంటే నిదర్శనం ఏం కావాలిరా మోహన్? ' అనుకున్నాడు మనసులో. మొగుడిని మరొక పురుషుడితో పోల్చి కించపరిచే ఏ ఆడదీ అతన్ని ప్రేమించనట్టే లెఖ్ఖ. గౌరవం, ప్రేమ కవలలు. ఒకటి లేని చోట ఒకటి వుండవు.

"పోనీ, మీరూ ఇక్కడే 'సెటిల్' అయిపోరాదూ? నాన్నగారు ఏదో ఒకటి చూస్తారు"

అతను దానికే సమాధానం ఇవ్వలేదు. అతను ఎంతో ప్రేమించిన సబ్జెక్టు ఆంగ్ల

సాహిత్యం. అతను కోరి వరించిన ఉద్యోగం అధ్యాపకవృత్తి. ఆ రెంటినీ తను వదలడు.

శిరీష కొంతసేపయ్యాక అంది.

"నేను బహుశా మీతో రాలేనేమో!"

దానికి మాత్రం అతను వెంటనే సమాధానం ఇచ్చాడు.

"మంచిది. నాకు రైలుకు వేళయింది. వస్తాను. మీ నాన్నగారు వస్తే చెప్పు"



నాలుగయిదు నెలల తర్వాత సూర్యారావు చెప్పాడు. శిరీష సుబ్రాతో అనే బెంగాలీవాడితో కలిసి అమెరికా వెళ్ళిపోయిందని. బహుశా మోహన్ మనసులో ఇటువంటిదేదో జరుగుతుందని అనుమానం వుండి వుండాలి. అతనికి ఏ భావమూ కలుగలేదు. అసలు ఈ వివాహవ్యవస్థే అతనికి చాలా అస్తవ్యస్తంగా తోచింది. ఈ వరసలు, బంధుత్వాలు, నిషిద్ధ ప్రేమలు, వివాహం వ్యక్తిగతం కాక సామాజికం అవటమూ, అన్నీ అతనికి తలక్రిందులుగా తోచాయి. ఇద్దరు యువతీయువకులు పరస్పరం ఆకర్షితులై; ఏకశయ్యాగతులవటానికి ఇంత తంతూ, తతంగమూ, ఈ నియమాలూ, నిబంధనలూ వుండబట్టే ప్రేమలూ, పెళ్ళిళ్లు కూడా విఫలమవుతున్నాయనుకొన్నాడతను.

శిరీష వ్యవహారం కూడా అతనికేమీ అంతు చిక్కలేదు. అందమయిన పిల్ల. ఆస్తిపరురాలు. తనకంటే చాలా చొరవ కలది. ధైర్యం కలది. ఎందుకు తన జీవితంలోకి వచ్చింది? మన పెళ్ళిళ్లల్లో వయసు సరిపోయిందా లేదా అని చూస్తారు. ఆస్తీ, అంతస్తూ సరితూగేయా? అని చూస్తారు. ఎత్తూ, లావూ, ఈడూ, జోడూ అన్ని చూసే పెద్దలు 'కల్చరల్ బ్యాక్‌గ్రవుండ్' గురించి ఎందుకు ఆలోచించరు? శిరీష పుట్టి పెరిగిన సంస్కృతి వేరు. మెట్టి, మనుగడ సాగించవలసివచ్చిన సంస్కృతి వేరు. అంత ఆధునికమయిన ఆ అమ్మాయి తనవంటివాడిని భరించలేకపోయిందేమో! తామిద్దరూ ఒకరికొకరు అర్థం కానేలేదు. నిర్మలనే తలుచుకుంటూ భగ్నప్రేమికుడిలా కాలం గడపాలని అతను అనుకోలేదు. జీవితంతో రాజీపడ్డాడు.

★ ★ ★

శిరీషతోటి తొలి సమాగమం నిర్మలను మరిపించాలని ఎంతో ఆశించాడు. ఆ ఆశ అడియాసే అయింది. నెలరోజులు కూడా కలిసి బతక్కుండానే ఆమె తన జీవితం నుండి నిష్క్రమించింది. తను కొంత సహనం వహిస్తే ఏమయినా ప్రయోజనం వుండేదా? అదీ ఖచ్చితంగా చెప్పలేదు. శిరీష ఒక జడివానలా కురిసి వెలిసింది.

★ ★ ★

"పిల్ల పెద్దదయిందండీ!" అంది రాఘవమ్మ చింకిచేటంత ముఖం చేసుకుని. సూర్యారావు "అట్టాగా!" అంటూ ఉత్సాహంగా లేచి వెళ్ళి వసుధను చూసి వచ్చాడు. అది బిక్కముఖం వేసుకుని అయోమయంగా నిలబడి వుంది.

"వాళ్ళమ్మా వాళ్ళకి ఎవరికయినా కబురు చేయాలా!" అని రాఘవమ్మ ఆరాగా అడిగింది.

"లేదు. దానికెవరూ లేరు. నయం! సమయానికి మీరయినా వున్నారు. దాని





అదృష్టం. మీరే ఏదో ఒకలాగ జరిపించె య్యండి" అన్నాడు సూర్యారావు.

శిరీష కూడా వెళ్ళిపోయాక రాఘవమ్మదే రాజ్యం! ఆమె గూభ్యంలాంటి కొట్టుగది ఖాళీచేసి వసుధను అందులో కూర్చోబె ట్టింది. భౌతికంగా, మానసికంగా ఆ పసిది ఎంత బాధను, అయోమయాన్ని అనుభవిం చిందో దాని మనసుకే తెలుసు. రాఘవ మ్మకు అవన్నీ అనవసరం. నళినీ, రజనీ వెళ్ళి గుమ్మం దగ్గర నిలబడి దాన్ని జాలిగా చూసేవాళ్లు. రాఘవమ్మ చుట్టుపక్కల లేన ప్పుడు వాళ్లు వసుధ ఒడిలో పళ్లు విసిరేసి, "తినెయ్. తినెయ్. మళ్ళీ ఆ దెయ్యం వస్తుంది" అనేవాళ్లు.

మోహన్ మూడు నాలుగురోజుల తర్వాత ఇక తట్టుకోలేక,

"ఏమిటీ, ఆ పసిదాన్ని తీసికెళ్ళి ఆ చీకటి గుహలో పారేశావు? ఆ మట్టిమూకుళ్ళలో భోజనాలేమిటి? జడుసుకుని దాంట్లోనే చస్తుంది. దాన్ని బయటకు తియ్యండి" అని అరిచాడు.

"అవన్నీ ఆడవాళ్ల వ్యవహారాలు. మనకెం దుకురా? రాఘవమ్మ చూసుకుంటుందిలే. నువ్వూరుకో" అని సూర్యారావు కొడుకుని శాంతింపచేశాడు. అంతకంటె ఎక్కువగా కల్పించుకోవటం మోహన్‌కి కూడా 'ఎంబరా సింగ్'గా తోచింది. కానీ పదవరోజు అది స్నానం చేసేటప్పటికి నాలుగు జతలు లంగాలు, ఓణీలు కొనుక్కుని వచ్చాడు.

★ ★ ★

ఆ బట్టలు వేసుకుని బయటకు రావటా నికి వసుధ చాలా సిగ్గుపడింది. పమిట నడుము చుట్టూ బిగించుకుని వచ్చి మోహన్ కాళ్లకు దణ్ణం పెట్టింది. పుస్తకం చదువుతున్నవాడల్లా ఉలిక్కిపడి,

"ఓయ్! ఓయ్! ఏమిటే ఇది? ఎవరు చెప్పారు నీకు?" అనడిగాడు.

"రాఘవమ్మగారు"

అతను దాని రెండు భుజాలు పట్టిలేవ నెత్తి నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు. జేబులోనుండి వందరూపాయలు తీసిచ్చి,

"ఏమయినా కొనుక్కో" అన్నాడు.

"నాకెందుకన్నయ్యా! నేనేం కొనుక్కుం టాను?"

"ఉంచుకో పిల్లా! చెవులు కుట్టించుకో" అంది రాఘవమ్మ.

అతనికి నిర్మల గుర్తుకు వచ్చింది. వసుధ అక్కా అని ఎందుకు పిలిచేదోగానీ, ఆమె దాన్ని తల్లిలా ఆదరించింది. ఎన్ని మంచి అలవాట్లు నేర్పింది! ఈరోజు ఆడపిల్లకి తల్లి అవసరమయ్యే ఈ వయసులో ఆమె ఇక్కడ వుంటే వసుధకు ఎన్ని జాగ్రత్తలు నేర్పి వుండేదో! దాని దురదృష్టం! ఈ రాఘవమ్మ పాలపడింది.

'అయ్యో! వసుధ బాల్యమా! నిన్నటివరకు దాని శరీరంలో దాగుని వున్నదానివి ఎక్క డికి పోయేవమ్మా! ఈ యవ్వనాన్ని తీసుకు వచ్చి ఈ చిట్టితల్లి శరీరంలో అప్పుడే ఎందుకు ప్రవేశపెట్టావ్? ఇక ఈ జనార ణ్యంలో ఇది ఎన్ని కష్టాలు పడాలో!' వసుధ భవిష్యత్తును తలుచుకుంటే అతనికి భయం వేయసాగింది.

ఆ సాయంత్రం మోహన్ పుస్తకాల షాపు లన్నీ తిరిగి 'వెన్ యు ఆర్ బికమింగ్ ఎ ఉమెన్' అనే ఇంగ్లీషు పుస్తకం ఒకటి కొను క్కుని వచ్చాడు. దానిలో కౌమారంలోకి అడుగుపెడుతోన్న బాలికల సందిగ్ధావస్థలు, శారీరక, మానసిక మార్పులు కూలంకషంగా వివరింపబడి వున్నాయి. అతను చాలారో జులు ఆ పుస్తకాన్ని దీర్ఘంగా స్టడీ చేశాడు. అలాగే సంవత్సరం గడిచిపోయింది.

★ ★ ★

ఒకరోజు మధ్యాహ్నం తలనొప్పిగా వుండి మోహన్ కాలేజీనుండి త్వరగా ఇంటికి వచ్చే శాడు. ఇంటికి తాళంవేసి వుంది. తండ్రి సరే! ఎప్పుడు ఇంటి దగ్గర వుంటాడో, ఎప్పుడు వూరిమీదకు వెళతాడో అతనికే తెలియదు. రాఘవమ్మా, వసుధా ఇద్దరూ



కట్టుకట్టుకుని ఒకేసారి ఎక్కడికి పోయివుంటారు? అతను అసహనంగా అటూ ఇటూ పచార్లు చేస్తోంటే, కాసేపటికి పైనుండి వసుధ దిగివస్తూ కనపడింది.

"నువ్వు పైనేం చేస్తున్నావు వసుధా?" మోహన్ ఆశ్చర్యంగా అడిగాడు. ఆమె మాట్లాడలేదు. తలుపు తాళంతీసింది.

"వసుధా! మాట్లాడవేం? నువ్వు ఒక్కదానివీ పైనేం చేస్తున్నావు?"

"నేను ఒక్కదాన్నే కాదు. పైన అయ్యగారు, రాఘవమ్మగారు వున్నారు"

మోహన్ ఆశ్చర్యం రెట్టింపయింది.

"కింద ఇంటికి తాళంవేసి పైన మీరంతా ఏం చేస్తున్నారు?"

"అయ్యగారు కాళ్ళు పట్టమంటే పడుతున్నాను" ఆమె గొంతు రుద్ధంగా వుంది. మోహన్‌కి పైన ఏం జరుగుతోందో వూహకి అందలేదు.

"రాఘవమ్మ ఏం చేస్తోంది?"

"ఆమె కూడా కాళ్ళు పడుతోంది"

అతనికి కోపం నషాళానికి అంటింది. గిరుక్కున వెనక్కి తిరిగి పైకి వెళ్ళబోయాడు.

వసుధ చప్పున అతని చెయ్యి పట్టుకుంది.

"వద్దన్నయ్యా! నువ్వు పైకి వెళ్ళొద్దు. కాళ్ళు కడుక్కుని రా. భోజనం పెడతాను"

మోహన్ భోజనం చేస్తూవుండగా అతనికి హఠాత్తుగా ఒక భయంకరమైన ఊహ మదిలో మెదిలింది.

"వసుధా! ఇటురా" అని అరిచినంత పని చేశాడు.

వసుధ వంటింట్లో పనిచేస్తున్నదల్లా చేతిలో పని వదిలేసి పరుగెత్తుకుంటూ వచ్చింది.

"ఏంటన్నయ్యా?" అతను అంత పెద్దగా ఎందుకరిచాడో ఆమెకు అర్థం కాలేదు. పిలిచాడే కానీ ఏం అడగాలో ఎలా అడగాలో అతనికి కూడా అర్థం కాలేదు.

"వసుధా! నువ్వు ఆయనకి కాళ్ళు పట్టడమేనా? ఇంకేమయినా పనులు చేస్తున్నావా?" వసుధ గబుక్కున మోహన్ని పట్టుకుని ఏడవటం మొదలుపెట్టింది. అతనికి మనసు చెదిరిపోయింది. అన్నం వదిలేసి చెయ్యి కడుక్కున్నాడు.

"వీళ్ళిద్దరూ మేడమీద ఎప్పటివరకూ వుంటారు?"

"సాయంత్రంవరకూ"

"వీధి తలుపు గడియవేసి, నా గదిలోకి రా"

★ ★ ★

వసుధ మోహన్ గదిలో కూర్చుంది. అతను తను సంవత్సరం క్రితం కొన్న 'వెన్ యు ఆర్ బి కమింగ్ ఎ వుమన్' పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు.

"వసుధా! నువ్వు పెద్ద పిల్లవైనప్పుడు, ఈ పుస్తకం నీ కోసమే కొన్నాను. కానీ అప్పుడే దీని అవసరం నీకుండదు. నువ్వింకా చిన్నదానివే. ఇంగ్లీష్ చదవటం కూడా నీకు అంతగా రాదు అని ఈ పుస్తకం నీకు ఇవ్వలేదు. ఇప్పుడు ఇక్కడ నిర్మలక్క వుంటే నీకు ఎంతో బావుండేది. లేదు కాబట్టి నేనే నీకు అమ్మనీ, అక్కనీ కూడా తెలిసిందా?"

ఆమె తెలిసిందన్నట్టు తల వూపింది.

"నీకిప్పుడు ఎన్ని సంవత్సరాలు?"

"తెలీదన్నయ్యా!"

"నాకు కూడా తెలియదు. కానీ పదమూడో, పధ్నాలుగో వుంటాయి" వసుధ అంగీకరిస్తున్నట్టు తల వూపింది.

"నీకు ఇప్పుడు చాలా విషయాలు తెలియాలి." అని.

"వసుధా! నువ్వు పెద్దదానివి అవుతున్నావు. ఈ లోకం చాలా చెడ్డది. నాన్నలాంటి వాళ్ళు, రాఘవమ్మలాంటి వాళ్ళు చాలామంది వుంటారు. ఎప్పుడూ నిన్ను ఎవరు రక్షిస్తారు? నిన్ను నువ్వే కాపాడుకోవాలి. ఒంటినిండా బట్టలు వేసుకోవాలి. నీ శరీరాన్ని ఎవర్నీ చూడనివ్వకూడదు. నువ్వు




ఎవరినీ, రజనిని, నళినిని, ఆఖరుకి రాఘవమ్మను కూడా నిన్ను తాకనివ్వకూడదు. నువ్వు ఎవరినీ తాకకూడదు. అర్థమయిందా? " ఈ ఆఖరి ఉపదేశం మాత్రం ఆమెకు అర్థమయింది. 'ఓ' అని తల తిప్పింది.

"ఇంక ఫో. పోయి తలుపు తియ్యి. ఈ విషయాలన్నీ మనసులో పెట్టుకో. ఎవరి దగ్గరా వాగకు"

★ ★ ★

ఇరవైఆరో తారీకు విజయవాడలో పెళ్లి వుంది బంధువులది. దానికి కుటుంబం అంతా కలిసి వెళ్ళాలనుకున్నారు. ఆ ముందురోజు మోహన్ వసుధతో ఎవరూ లేని సమయం చూసి చెప్పాడు.

"వసుధా! నీ బట్టలవీ ఉతికి, ఒకచోట పెట్టుకో"

ఎందుకో ఆమెకు అర్థంకాలేదు. కానీ అన్ని బట్టలూ శుభ్రంగా ఉతికి ఆరేసుకుంది. రాఘవమ్మ ఎగతాళి చేసింది.

"పెళ్లికెడుతున్నావా? పెళ్ళి చేసుకోవటానికి వెళ్తున్నావా? అన్ని బట్టలెందుకు పిల్లా? " అని. తీరా అందరూ పెళ్ళికి బయలుదేరాక.

"నాకు కాలేజీలో సెలవు దొరకలేదు. నేను రాన"న్నాడు మోహన్. వసుధను బయలుదేరతీస్తోంటే "దాన్ని కూడా తీసుకుపోతే, నాకు అన్నం ఎవరు వండి పెడతారు? " అన్నాడు.

"అయ్యో! చిన్నపిల్ల. సరదా కొద్దీ నిన్న బట్టలన్నీ శుభ్రం చేసుకుని సర్దుకుంది. రానివ్వు నాయనా!" అని రాఘవమ్మ దీర్ఘాలు తీసింది.

"సరే. అది వెళ్తుంది. నువ్వుండు పోనీ" అన్నాడు మోహన్.

"నేనుంటే ఎట్లా బాబూ! అక్కడ అయ్యగారికీ, తమ్ముళ్ళకీ ఇబ్బంది కాదూ!"

'తమ్ముళ్ళకు కాదుగానీ, అయ్యగారికి పాపం చాలా ఇబ్బంది' అనుకున్నాడు మోహన్. తండ్రీ, రాఘవమ్మా, తమ్ముళ్ళూ పెళ్ళికి బయలుదేరి వెళ్ళారు. అరగంట తర్వాత మోహన్.

"వసుధా! ఇటురా" అని పిలిచాడు.

"అన్నం వండుతున్నా అన్నయ్యా! భోజనం చేసి కాలేజీకి వెళ్ళవూ? " అంటూ వచ్చింది వసుధ. తనను పెళ్ళికి వెళ్ళనివ్వలేదని ఆమెకు చాలా కోపంగా ఉంది. అతని ముందు ఖాళీచేసిన అతని సూటుకేసు వుంది.

"నీ మొహం, అన్నం లేదు, దణ్ణంలేదు. ఈ సూటుకేసు తీసుకునిపోయి నీ బట్టలు ఇందులో సర్దు"

"ఎందుకన్నయ్యా? మనం కూడా పెళ్ళికి వెళుతున్నామా? "

"అదంతా తర్వాత చెబుతానులే. ముందు బట్టలు సర్దు"

ఆమె బట్టలు సర్దుకున్నాక, అతను సూట్‌కేస్ తీసుకుని, వసుధతోసహా బయటకు వచ్చి ఇంటికి తాళం వేసేశాడు.

"మరి నీ బట్టలు అన్నయ్యా? " అడిగింది వసుధ.

ఆ ప్రశ్నకు అతను సమాధానం ఇవ్వలేదు. ఇద్దరూ రిక్షాలో బస్టాండ్‌కు వచ్చి, బస్సు ఎక్కారు. బస్సు ఊరు పొలిమేరలు దాటాక చెప్పాడు మోహన్.

"వసుధా! నిన్ను కాన్వెంటులో చేరుస్తున్నాను, కైలాసపురంలో. నువ్వు ఇకనుంచి అక్కడే వుంటావు. అది క్రిస్టియన్ మిషనరీ. నువ్వు అక్కడ చదువుకోవాలి"

"అంటే ఏంటి? "

"క్రిస్టియన్ మిషనరీ అంటేనా? అక్కడంతా ఏసుక్రీస్తు భక్తులుంటారు. అందరూ ఆడవాళ్ళే. తెల్లబట్టలు వేసుకుని వుంటారు. చాలా మంచివాళ్ళు నిర్మలక్కలా. వాళ్ళే నీకు చదువు చెబుతారు. భోజనం పెడతారు"

చంద్రమ్మలాగే మోహన్ కూడా తనను వదిలించుకుంటున్నాడు అని తోచింది వసు

ధకి. చాలా దుఃఖం కలిగింది.

"అక్కడేం పని చెయ్యాలి అన్నయ్యా" అన డిగింది. ఏడుపువల్ల కంఠం జీరగా ధ్వనిం చింది.

అతను జాలీ, ప్రేమా ముప్పిరికొనగా, ఆమెను దగ్గరకు లాక్కుని ముద్దు పెట్టుకు న్నాడు. ఆమె అతని కౌగిలి విడిపించుకుని, "నువ్వు నన్ను ఎవరూ తాకకూడదని చెప్పావుగా" అనడిగింది. అతను పెద్దగా నవ్వాడు.

"నిజమేనే. కరెక్టుగా చెప్పావు. పిచ్చిము ఖమా! ఇక నువ్వు పని చెయ్యనక్కర్లేదు. చదువుకుంటే మంచి ఉద్యోగం వస్తుంది. అప్పుడు పెళ్ళిచేసుకో. నేను ముసలివాడినై పోయాక నీ దగ్గరకు వచ్చి వుంటాను అర్థ మయిందా? "

వసుధ బిక్కమొహం పెట్టేసింది.

"అన్నయ్యా! నేను ఇంకెప్పుడూ మనింటికి రానా? "

మోహన్ మనసు కఠినం చేసుకుని చెప్పాడు.

"రావు. రావద్దు కూడా"

"రజనీ అన్నయ్యా... నళినన్నయ్యా..." అంటూ ఏడవడం మొదలుపెట్టింది.

మోహన్ ఆమెను ఓదార్చే ప్రయత్నం చేయలేదు. 'పోనియ్. నాకెలాగూ ఏడ్చే అదృష్టంలేదు. దానినయినా కరువుతీరా ఏడవనిద్దాం' అనుకున్నాడు విషాదంగా. వసుధ ఏడ్చి ఏడ్చి అతని భుజంమీద పడి నిద్రపోయింది. ఎన్నిగంటలు ప్రయాణం చేశారో వసుధకు తెలియదు. బస్సు ఆగితే ఆమెకు మెలకువ వచ్చింది. బస్టాండునుండి కాన్వెంటుకి వెళ్ళేవరకూ మోహన్ ఆమెకు సుద్దులు చెబుతూనే వున్నాడు.

"వసుధా! నేను కూడా ఇంకెప్పుడూ నీ దగ్గరకి రాను. నువ్వు జాగ్రత్తగా చదువుకో వాలి. నీకు మంచీచెడూ వివరం చెప్పడానికి అమ్మానాన్నాలేరు. నిర్మలక్క కూడా లేదు కదా! అందువల్ల నువ్వే జాగ్రత్తగా వుండడం నేర్చుకోవాలి. అర్థమయిందా? "

వసుధ సమాధానం చెప్పలేదు. ఇద్దరూ కాన్వెంటు చేరారు. అతను అక్కడి సిస్టర్‌తో హాస్టలుసీటు కూడా కావాలని చెప్పాడు. అతను అప్లికేషన్ ఫాం నింపుతోంటే వసుధ పక్కనే నిలబడి చూసింది. అతను వయసు రాసి వున్నచోట 'పదకొండు సంవత్సరాలు' వేశాడు. గార్డియన్ (సంరక్షకుడు) లేక తండ్రి అని వున్నచోట ముందు పదం కొట్టేసి కె. మోహన్ అని రాసి సంతకం చేశాడు. అతను ఫాం నింపి బయటకు రాగానే వసుధ అడిగింది.

"అన్నయ్యా! నాకు పదమూడో, పధ్నా లుగో వుంటాయి అని చెప్పావుగా. మరి ఆ కాగితంలో పదకొండు అని రాశావేం? "

"నీ వయసెంతో నాకు ఖచ్చితంగా తెలీదు కదమ్మా. నీకు ఆరవతరగతి పుస్తకాలు మాత్రమే చదవడం వచ్చు. ఇప్పుడు నేను ఏడవ తరగతిలో చేరుస్తున్నాను. నీ తరగ తికి తగ్గట్టుగా నీ వయసు వేశాను. పెద్ద య్యాక నీకు దీని ఉపయోగం తెలుస్తుంది. మరి నేను వెళ్ళిరానా? "

మోహన్ చెప్పిన 'తాకకూడదు' నిబంధ నను పక్కకుపెట్టి వసుధ అతన్ని కౌగలిం చుకుని బావురుమని ఏడ్చింది. అతను కూడా కళ్ళనీరు నింపుకున్నాడు.

"డోంట్ వర్రీ. వుయ్ షల్ టేక్ కేర్ ఆఫ్ హర్" అంది తెల్లగౌనులో దేవదూతలా నిల బడిన సిస్టర్ ఒకామె.

మోహన్ కొంచెం తటపటాయించి,

"నాదొక చిన్న మనవి సిస్టర్!" అన్నాడు.

"చెప్పండి"

"వసుధా! నీ సూటుకేసు తీసుకుని నీ రూముకు వెళ్ళు" అని చెప్పాడు వసుధవైపు తిరిగి.

మోహన్‌ని పలకరించిన సిస్టర్ పేరు 'మోడెస్టీనా'. వసుధ సూట్‌కేస్‌తో పైకి వెళ్ళి పోయాక ఆమె వివరాలు మోహన్ సిస్టర్‌కి చెప్పాడు.





"సిస్టర్! వసుధ అనాథ. తల్లీతండ్రీ లేరు. ఎవరో ఒక పుణ్యాత్మురాలు దాన్ని మా ఇంటికి పనిమనిషిగా తీసుకువచ్చింది. గత మూడునాలుగేళ్ళుగా మాతోనే వుంటోంది. ఇప్పుడు మేం తనని ఉంచుకోగల స్థితిలో లేం. అందువల్ల మీ రక్షణలో వదులుతు న్నాను. నేను ప్రతినెలా స్కూలు ఫీజు, హాస్టలు ఫీజు పంపుతాను. నేనుమాత్రం రాలేను. దయ ఉంచండి"

సిస్టర్ ఖంగుతింది. ఆమెకు ఇందాకటి నుండి అనుమానంగానే ఉంది. 'పది పన్నెం డేళ్ళ పిల్లకు ఇంత యంగ్ ఫాదరా!' అని.

"సో... యూ ఆర్ నాట్ హెర్ ఫాదర్" అంది అతని ఘోషలో ఆ వాక్యం ఒకటే తనకు అర్థం అయినట్లు.

"కాదు సిస్టర్! దానికీ, నాకూ రక్తసంబం ధంలేదు. ఆత్మసంబంధం తప్ప"

"అయితే మిస్టర్ మోహన్! మాకు ఒక అనాథ శరణాలయం కూడా వుంది. ఆమెను అందులో చేర్చమంటారా? "

మోహన్ కంగారుపడ్డాడు.

"వద్దు వద్దు సిస్టర్. వసుధ తాను అనా థగా భావించుకోవడం నాకు ఇష్టం లేదు. దాని ఫీజులూ, ఖర్చులూ నేనే భరి స్తాను. ఎప్పుడైనా, ఏదైనా అవాంఛనీయ మైన సంఘటన జరిగి నేను పంపలేకపోతే మీకు తోచిన సహాయం చేయండి"

నలభై సంవత్సరాల ఆ సన్యాసిని భావర హితంగా వుండడానికి చాలా ప్రయత్నించ వ లసి వచ్చింది.

"ధైర్యంగా వుండండి మిస్టర్ మోహన్. ఆ బిడ్డ బాధ్యత నాది. మీరు నిశ్చింతగా వెళ్ళి రండి"

అతను ఆమెకు నమస్కరించి, బయటకు వచ్చి ఎదురుగా వున్న భవనాలవైపు తల పైకెత్తి చూశాడు. తెల్ల లంగా, ఆకుపచ్చ ఓణీతో వసుధ మూడవ అంతస్థులో నిల బడి వుంది. అతన్ని చూసి గబగబా కిందకు రాబోయింది. అతడు 'రావద్దు' అన్నట్టు సైగచేశాడు. తరువాత తల వంచు కుని గబగబా బయటకువచ్చి రోడ్డెక్కేశాడు.

★ ★ ★

ఆ విధంగా వసుధ జీవితం కైలాసపురం లోని క్రిస్టియన్ మిషనరీలో ప్రారంభం అయింది. నిర్మల బోధనవల్ల నళిని దెబ్బల వల్ల ఆమెకు చదువు బాగానే వచ్చు. ఆ కార ణంగా ఏడవ తరగతిలో చేర్చుకునేందుకు ప్రవేశపరీక్ష పెడితే అందరిలోనూ ప్రథము రాలిగా ఉత్తీర్ణురాలయింది.

"నిన్ను ఎనిమిదిలో వేస్తాం" అన్నారు పరీక్ష నిర్వహించిన సిస్టర్.

వసుధకు సంతోషం కలిగింది. తర్వాత సిస్టర్ మోడెస్టీనా వచ్చి చెప్పారు.

"ఫారం ప్రకారం వసుధకు పదకొండు సంవత్సరాలే. ఎనిమిదిలో వెయ్యడానికి కుదరదు" వసుధ వికసించిన ముఖం ఈ మాట వినగానే వాడిపోయింది. 'తనకు పదమూడు సంవత్సరాలనీ, అన్నయ్య వీళ్ళు ఏడులో చేరుస్తారనే ఉద్దేశ్యంతో పదకొండు వేశాడనీ' చెపుదామా అనుకుంది. మళ్ళీ అలా చెపితే అన్నయ్యను వీళ్ళు అబద్ధా లకోరు అనుకుంటారని భయంవేసి మౌనం వహించింది.

"ఒక పనిచేద్దాం. ఆ ఫారం వెనక్కు పంపి, వయసు ఎక్కువ వేసి ఇంకొకఫారం పంపమని రాద్దాం" అని సలహా ఇచ్చారు ఆ సిస్టర్.

సిస్టర్ మోడెస్టీనా అయిదు నిమిషాలు ఆలోచించారు. తర్వాత,

"సిస్టర్! ఈ పాపకు 'ఫ్యాక్చుయల్'గా నేనే 'గార్డియన్'ని. రికార్డులో వయసు సరిదిద్దు తాను. మీరు ఎనిమిదవ తరగతిలో చేర్చు కోండి" అన్నారు. అలా వసుధ ఎనిమిదవ తరగతిలో చేరి, చదువు మొదలుపెట్టింది. సిస్టర్ మోడెస్టీనా మోహన్‌కి చేసిన వాగ్దా నాన్ని నిలబెట్టుకున్నారు. వసుధ సంరక్షణ భారం ఆమె వహించారు. కొత్త యూనిఫా రాలు కుట్టించారు. హాస్టల్‌లో ధరించేం

దుకు మామూలు స్కర్టులు, షర్టులు కుట్టించారు. నిర్మల వెళ్ళేటప్పుడు చేయించిన క్రాపు ఎదిగి భుజాలవరకు జుట్టు పెరిగింది. 'ఈ పిల్లది బాబ్డ్ హెయిర్ కాబోలు' అనుకుని జుట్టుని 'ట్రిమ్' చేయించారు. బట్టల దగ్గర్నుండి, సబ్బూ, పేస్టువరకు అన్నీ వసుధ ఇష్టాన్ని తెలుసుకొని కొని ఇచ్చారు.

నిన్నటివరకూ అందరూ భోజనం చేసిన కంచాలు తను కడిగేది. ఇప్పుడు తను భోజనం చేసిన కంచం మరెవరో కడగడం విచిత్రంగా తోచేది. రాత్రిళ్ళు పడుకుంటే ఆమెకు మోహన్, నిర్మల, రజనీ, నళినీ అంతా వరసగా గుర్తుకొచ్చేవారు. దిగులుగా వుండేది. చాలా ఆదివారాలు స్నేహితురాళ్ళు తల్లిదండ్రులకోసం, బంధువులకోసం ఎదురుచూస్తోంటే వసుధ మోహన్‌కోసం ఎదురుచూసేది. కనీసం ఉత్తరమయినా రాయకూడదూ? అని వ్యధ చెందేది. మోహన్ వసుధకు చెప్పినట్టుగానే ఎప్పుడూ రాలేదు. ఉత్తరాలు కూడా రాయలేదు. సిస్టర్ మోడెస్టీనాకు మాత్రం కేరాఫ్ పోస్ట్ మాస్టర్ ఎడ్రస్‌నుండి వసుధ ఖర్చుల నిమిత్తమై డబ్బు వచ్చేది. ఆ విషయం వసుధకు తెలియదు. ఒక్కోసారి ఒంటరిగా కూర్చుని తానులేని ఆ తెల్ల మేడను ఊహించుకునేది. అన్నయ్యకు అన్నం ఎవరు పెడుతున్నారో? కాఫీ ఎవరిస్తున్నారో? రజనీ, నళినీ కాలేజీలో చేరి వుంటారు. వసుధ ఏది అన్నయ్యా అని అడిగితే మోహన్ అన్నయ్య ఏం సమాధానం చెప్పివుంటాడు?

క్వార్టర్లీ పరీక్షలు పూర్తయి స్కూలుకి శలవులిచ్చాక కానీ వసుధకు పూర్తిగా అర్థంకాలేదు 'ఇంత పెద్ద ప్రపంచంలో తాను ఒంటరినని'. పిల్లలంతా తల్లిదండ్రులతో, బంధువులతో ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఆమెమాత్రం ఒంటరిగా మిగిలిపోయింది. 'మోహన్ అన్నయ్య ఇకరాడు. నిర్మలక్క లాగానే ఎక్కడికో వెళ్ళిపోయాడు' అనుకుంది. నిజానికి వెళ్ళిపోయింది తాననీ, మోహన్ అక్కడే వుండి వుండొచ్చని వసుధకు స్ఫురించలేదు.

ఆ సాయంత్రం ఒక్కత్తే స్కూలు గ్రౌండ్‌లో తిరుగుతుంటే సిస్టర్ మోడెస్టీనా చూసింది.

"హాయ్ వసుధా!"

"గుడ్‌మార్నింగ్ సిస్టర్!"

"మీ రూమ్‌మేట్సు వూరు వెళ్ళిపోయారా? "

సమాధానంగా తల ఊపింది.

"హాస్టల్లో ఎవరయినా వున్నారా ఇంకా? "

"లేరు సిస్టర్, అంతా వెళ్ళిపోయారు"

"మై గుడ్‌నెస్! నువ్వు ఒక్కదానివే ఏం చేస్తున్నావు? "

"... ..."

"భోజనం చేశావా? "

"మెస్ కట్టేశారు సిస్టర్! క్యాంటీన్‌లో టిఫిన్ తిన్నాను"

"అయాం సారీ వసుధా! మీ ఫాదర్ చెప్పారు. నేనే మరిచిపోయాను. కమాన్, నీ సూట్‌కేస్ తీసుకో. నాతోరా" అని ఆమే పనిమనిషికి పురమాయించి వసుధ బట్టల పెట్టె తెప్పించింది. ఆమెతో కలిసి వసుధ ఆ మిషనరీవాళ్ళే నడుపుతున్న అనాథ శరణాలయానికి వెళ్ళింది. అందులో పిల్లలంతా అనాథలే. వాళ్ళలో వసుధ తరగతిలో చదివే అమ్మాయిలు కూడా వున్నారు. అంతకంటే చిన్న అమ్మాయిలూ, పెద్ద అమ్మాయిలూ వున్నారు. అక్కడికి వచ్చేవరకూ వీళ్ళంతా అనాథలని వసుధకు తెలియదు. క్లాసులోనూ, స్కూల్లోనూ అంతా యూనిఫారంలో వుంటారు. ఆ దుస్తుల్లో ఎవరు ఎవరి పిల్లలో, వాళ్ళ ఆర్థిక స్తోమత ఏమిటో అంచనా వేయడం కష్టం. వాళ్లని చూసి వసుధ ఆశ్చర్యపోయినట్టే, వసుధను చూసి వాళ్ళూ ఆశ్చర్యపోయారు.

"ఏయ్ వసుధా! నువ్వేంటీ ఇంటికి వెళ్ళలేదు" అని అడిగారు.

ఆమెకు ఏం సమాధానం చెప్పాలో తెలి




యలేదు.

"అవును. వెళ్ళలేదు" అంది దిగులుగా.

కానీ ఒక గంటలో దిగులు మరిచిపో యింది. వాళ్ళతో కలిసి భోజనం చేసింది. ఆడింది, పాడింది. తలమీద ఖర్చీఫ్ వేసు కొని చర్చిలోకెళ్ళి ప్రార్ధన చేసింది. ఆ రాత్రి కలలో నిర్మల మేరీమాతలా, తాను రెక్క లున్న చిన్న దేవదూతలా కన్పించారు. శల వులు ఇట్టే గడిచిపోయాయి.

"సిస్టర్! నేను ఇక్కడే వుండిపోయేదా? " అనడిగింది స్కూళ్ళు తెరిచిన తర్వాత.

"అక్కర్లేదు వసుధా! మీ ఫాదర్ నీకు హాస్టల్ ఫీజు కట్టారుగా. నువ్వు హాస్టల్ లో నీ రూములోనే వుండు" అన్నారు సిస్టర్ మోడెస్టీనా. తన సూట్ కేసుతో తిరిగి హాస్టల్ కి వచ్చేసింది వసుధ.

★ ★ ★

వసుధ పదవతరగతి మంచి మార్కు లతో ప్యాసయింది. ఇదివరకటిమీద మనసూ, వయసూ పరిణతి చెందాయి. ఇప్పుడు వసుధకు తాను అనాధనని తెలుసు. చంద్రమ్మనుండి మోహన్‌వరకూ తనకు తారసపడిన వ్యక్తులెవరూ తనకు రక్తసంబంధీకులు కారని తెలుసు. తాను అనాధననే వాస్తవం ఆమెకు అలవాటైపో యింది. దానిగురించి ప్రత్యేకం బాధపడడం మానేసింది. ఒక సాయంత్రం సిస్టర్ మోడె స్టీనా కబురుచేసింది.

"గుడ్‌మార్నింగ్ సిస్టర్!"

ఈ మూడు సంవత్సరాలలోనూ ఆమె చాలా వృద్ధురాలయినట్టు తోచింది వసు ధకు. ఆమె చర్చి వెనకాల వున్న తోటలో సిమెంటు బెంచీమీద కూర్చుని వుంది.

"కమాన్ మై ఛైల్డ్! ఇటురా, ఇలా నా పక్కన కూర్చో" అని వసుధను ఆప్యా యంగా పక్కన కూర్చోబెట్టుకుంది.

"ఆ! ఇప్పుడు చెప్పు. నీ పదవతరగతి పూర్తయిపోయింది. మంచిమార్కులు తెచ్చు కున్నావు. సంతోషం. ఏం చదువుతావు? "

ఈ ప్రశ్నకు వసుధ వెంటనే సమాధానం చెప్పలేదు. ఇన్నాళ్ళూ తనను సంస్థ చదివి స్తోందని నమ్మింది. మానవతా దృక్పథంతో అనాథపిల్లల శరణాలయం, ఆసుపత్రి, కుష్టు వ్యాధి పీడితుల పునరావాస కేంద్రం, వృద్ధు లైన అనాథలకు ప్రత్యేక గృహం నిర్వ హించే ఈ సంస్థ స్కూలుకు, జూనియర్ కాలేజీకి, తత్సంబంధమైన హాస్టళ్ళకు చాలా ఎక్కువ ఫీజులు వసూలుచేసింది. బహుశా వాళ్ళు ఆ ఫీజులు ఇతర సేవాకార్యక్రమా లకు వినియోగిస్తూ వుండి వుండొచ్చు. ఏమ యినా తనను సంస్థ చదివించటంలేదు అనే నిజం నిర్ధారణగా ఆమెకు నాలుగయిదు నెలల క్రితమే తెలిసింది. తెలిశాక బహుశా తనను సిస్టర్ మోడెస్టీనా చదివిస్తున్నారేమో నని కొన్నాళ్ళు నమ్మింది. కానీ ఆమెకెందుకు తనపట్ల ఆసక్తి? అయినా ఆమె కూడా సంస్థ నియమనిబంధనలకు బద్ధురాలు. ఆమే తనను చదివించి వుంటే తాను అనా థశరణాలయంలో వుండి వుండాలి. కానీ తాను హాస్టల్లో వుంటున్నది. 'మీ ఫాదర్ ఫీజు కట్టారుగా' అన్నారు సిస్టర్ చాలా సార్లు. అంటే మోహన్ అన్నయ్య ఇంత డబ్బు ఫీజు రూపేణా తనకోసం కట్టి ఉంటాడా? తన ఇంట్లో పనిచేసే ఈ నల్ల, బీద, పనిపిల్ల కోసం ఇంత డబ్బు వెచ్చించి వుంటాడా? ఆ విషయం సిస్టర్ మోడెస్టీ నాను అడిగి నిర్ధారించుకోవాలని వసుధ చాలాసార్లు అనుకుంది. కానీ ధైర్యం చాలేది కాదు.

ఇప్పుడు 'సిస్టర్ ఏం చదువుతావు వసుధా' అని అడిగాక వసుధ ధైర్యం కూడ గట్టుకుని ఆమెను అడిగింది.

"సిస్టర్! నేను ఇంకా చదువుకునేందుకు వీలుందా? "

ఆమె ఆశ్చర్యపోయింది.

"వై నాట్? "

"డబ్బు... డబ్బు ఎక్కడిది సిస్టర్? "

ఆమె వసుధ చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకుంది.

"మీ ఫాదర్ పంపారుకదమ్మా!"

"నాకు ఫాదర్ లేడు సిస్టర్!"

"మిస్టర్ మోహన్!"

ఇన్నేళ్ళూ సిస్టర్ 'మీ ఫాదర్' అని రిఫర్ చేస్తున్నది మోహన్ అన్నయ్యనని వసుధకు ఇప్పుడు నమ్మకంగా తెలిసింది.

"వసుధా! ఈ మూడు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా మిస్టర్ మోహన్ నీకు స్కూలు ఫీజు, హాస్టలు ఫీజులు కడుతూ వచ్చారు. నిన్ను చేర్పించినప్పుడు ఆయన నీ గురించి అంతా నాకు చెప్పారు. ఆయన నీ ఫాదర్ కాదని నేను ఎరుగుదును. కానీ అప్లికేషన్ ఫారంలోను, స్కూలు రికార్డులోనూ ఆయన 'ఫాదర్' అనే కాలమ్‌లో తన పేరు రాసి సంతకం చేశారు. నీ వయసు కూడా ఆయన ముందుచూపుతో తగ్గించివేశారు. దానిని నీ మంచికోసమే మార్చవలసి వచ్చింది. అది వేరే విషయం. ఇంత తెలివికల మిస్టర్ మోహన్ ఒక చిన్న పొరపాటు చేశాడు. 'కులం' బి.సి. అని కానీ యస్.సి. అని కానీ రాసి వుంటే నీకు ప్రభుత్వ కళాశాలల్లో రిజర్వేషను లభించి వుండేది. నువ్వు తెలివికలదానివి. ఆ సౌకర్యం నీకు అవసరం లేదనుకో. కానీ ఫీజులు బాగా తగ్గివుండేవి. ఉచిత హాస్టలు సౌకర్యం లభించి ఉండేది. కానీ ఆ కాలమ్‌లో కూడా ఆయన తన కులమే రాసినట్లున్నారు. ఆ విధంగా నువ్వు 'ఫార్వర్డ్ కేస్ట్' అయినందువల్ల నీకు ఏ రాయితీలు లభించవు"

ఆమె చెప్పింది వసుధకు కొంత అర్థమయింది. కొంత అర్థంకాలేదు. 'అవును. కులం ఒకటి వుందికదూ' అనుకుంది. తాను ఏ కులంలో పుట్టిందో తనకు తెలియదు. మోహన్ అన్నయ్య ఇంటికి రాక ముందు నీచుమాంసాలు తినేది. వచ్చాక కూడా తినేది. వసుధకు మోహన్ అన్నయ్య కులమే తన కులం అనీ, రికార్డుల్లో అయినా సరే, ఆయనే తన తండ్రి అని కొంచెం గర్వం కలిగింది. సిస్టర్ మోడెస్టీనా నెమ్మదిగా లేచి వెళ్ళిపోయింది.

"వసుధా! నిన్న నేను నీకు పూర్తిగా అన్ని విషయాలు చెప్పలేదు. మీ ఫాదర్ నాకు ఉత్తరం రాశారు. ఆయన విదేశాలకు వెళ్ళిపోతున్నారట. నీ పేరున ఇరవైవేల రూపాయలకు చెక్కు పంపారు" అంది మరునాడు సిస్టర్ మోడెస్టీనా కనిపించి.

'ఆయన విదేశాలకు వెళ్ళిపోతున్నారట' అన్నమాటలు చర్చి గంటల హోరులో వసుధకు వినపడలేదు. డబ్బు చెక్కుగా పంపారన్నదే వినపడింది. అందువల్ల ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి,

"అమ్మో! అంత డబ్బు నేనేం చేసుకుంటాను సిస్టర్!" అనడిగింది.

సిస్టర్ నవ్వేసింది.

"పిచ్చిదానా! నువ్వు సరిగ్గా చదువుకుంటే ఇందులో చాలా మొత్తం నీ ఫీజులకీ, పుస్తకాలకీ ఖర్చయిపోతుంది. ఈ డబ్బుని నువ్వు చదువు పూర్తయి, ఉద్యోగం దొరికేవరకు పొదుపుగా వాడుకోవాలి. సైన్సు సబ్జెక్ట్‌లోగానీ, లెక్కలలోగానీ ఇంటర్‌లో చేరితే ఫీజు చాలా ఎక్కువ అవుతుంది. ఆర్ట్సు గ్రూపు తీసుకో"

"అలాగే సిస్టర్!" అని అంది ఉత్సాహంగా.

★ ★ ★

వసుధ హైస్కూలునుండి జూనియర్ కాలేజీకి మారింది. హాస్టల్ కూడా ఆ క్యాంపస్ నుండిమారిపోయింది. కానీ హైస్కూల్‌కు, జూనియర్ కాలేజీకి పెద్ద దూరంలేదు.

సిస్టర్ మోడెస్టీనా వసుధకు పుస్తకాలు, బట్టలూ కొన్నారు. స్కూల్‌కీ, హాస్టల్‌కీ ఫీజులు కట్టారు. ఆ రశీదులన్నీ తెచ్చి వసుధకిచ్చారు.

"అయ్యో సిస్టర్! మీరెందుకొచ్చారు?





నాకు కబురు చెయ్యకపోయేరా? నేనే వచ్చే దాన్నికదా!" అని నొచ్చుకుంది వసుధ. తర్వాత రశీదులు చూసి "నాకెందుకు సిస్టర్! ఇవన్నీ ఇచ్చారు. ఇన్నాళ్ళూ అన్నీ మీరే చూసుకున్నారుగా. ఇంతలోనే పెద్ద దాన్ని అయిపోయానా? " అంది.

ఆవిడ కరుణపూరితంగా నవ్వింది.

"ఇన్నాళ్ళూ ఇవన్నీ మిస్టర్ మోహన్ చూసుకున్నారమ్మా! డబ్బు అయిపోకముందే డబ్బు పంపేవారు. 'సిస్టర్! వసుధను మీ చేతుల్లో పెడుతున్నాను. ఇక దాని మంచీ చెడూ అన్నీ మీరే చూసుకోవాలి!' అని రాసే వారు. ఇప్పుడు ఆయన ఈ ఇరవై వేలతో తన బాధ్యత నుండి విడుదలైపోయారు. ఇక నీ లెఖ్ఖలు నువ్వే చూసుకోవాలిగా వసుధా!"

వసుధ దిగ్భ్రాంతి చెందింది.

"అంటే ఏంటి సిస్టర్!" అని అడిగింది అయోమయంగా.

"నిన్న చెప్పాను కదమ్మా! మిస్టర్ మోహన్ విదేశాలకు వెళ్ళి పోయారు. బహుశా ఆయన ఇక ఇండియా రారు. నీ భవిష్యత్తుకోసం ఆయన ఈ డబ్బు పంపారు"

'మోహన్ ఇక ఇండియా రారు, ఇక ఇండియా రారు' అని సిస్టర్ వెయ్యి గొంతు కలతో చెప్పినట్టు తోచింది వసుధకి. అది కాలేజీ అని చుట్టూ మనుషులున్నారని స్పృహ లేకపోయింది. అక్కడే నేలమీద కూలబడి ఏడవసాగింది. ఎప్పటికయినా అన్నయ్య వస్తాడనే ఆశ పుటుక్కున తెగిపో యింది. తను పెద్దదయ్యాక వెళ్ళి అన్న య్యను వెతుక్కోగలననే ఆశ అడుగంటిపో యింది.

"ఊరుకో, ఊరుకో" అని సిస్టర్ ఆమెను ఎంత ఓదార్చినా లాభంలేకపోయింది. రెండురోజులపాటు అన్నమూ, నిద్రా మానేసి కళ్ళు ఉబ్బిపోయేలా ఏడ్చింది వసుధ. ఆమె జీవితంలో ఇంత విషాదాన్ని ఆమె ఎన్నడూ ఎరుగదు. కనీసం ఆమె ఊహ తెలిసేక. ఆ నిరాశలో 'నేను ఎందుకు బతకాలి? చచ్చిపోతాను' అనుకుంది. 'డబ్బి చ్చేసి, నన్ను వదిలించుకున్నాడు' అని మోహన్‌ని తిట్టుకుంది. 'అన్నయ్యను ఎంత ప్రేమించాను? ఒక్కసారి వెళ్ళిపోయే ముందు నన్ను చూడాలని అన్పించలేదా?' అని బాధపడింది. దుఃఖానికీ, బాధకూ అన్నింటికీ కాలమే మందు. వసుధ తన దుఃఖాన్ని అధిగమించి, చదువులో మునిగి పోయింది.



వసుధ సీనియర్ ఇంటర్ చివరకు వచ్చే సరికి సిస్టర్ మోడెస్టీనా ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. ఆమెకు బ్రెస్ట్ క్యాన్సర్ అని తెలి సినపుడు వసుధ విలవిలలాడిపోయింది. నన్ను ప్రేమించేవాళ్ళందరికీ ఎప్పుడూ చెడే జరుగుతుంది అనే నిరాశావాదాన్ని పెంచు కుంది. ఒకరోజు ఆమె క్లాసులో వుండగా అటెండరు వచ్చి చెప్పేడు. సిస్టర్‌కి చాలా సీరియస్‌గా వుందనీ, ఆమెను రాయవెల్లూరు ఆసుపత్రికి తరలిస్తున్నారని, వెళ్లేముందు వసుధను చూడాలంటున్నారని కబురు తీసుకువచ్చేడు. వసుధ అయిదు సంవత్సరా లక్రితం మోహన్‌తో వచ్చినపుడు మొదటిసా

రిగా ఆమెను చూసింది అప్పుడామె ఆరోగ్యంతో మిసమిసలాడుతుండేది. తన చిన్న చిన్న పాదాలతో చకచకా అడుగులు వేసుకుంటూ క్యాంపస్ అంతా కలియతిరిగేది.

గత రెండేళ్ళుగా ఆమె వృద్ధురాలైపోతున్నట్టు వసుధకు అన్పించేది. సిస్టర్ పెద్దయిపోతున్నారు అనుకునేది. అనారోగ్యం ఆమెలో మొదలయిందని ఎవరూ అప్పుడు గ్రహించలేకపోయారు. ఇప్పుడామె చిక్కిశల్యమయిన శరీరంతో మంచానికి అంటుకుపోయి వుంది. ఆమెను అంత నిస్సహాయంగా వసుధ ఎప్పుడూ చూడలేదు. ఆమెకు తెలియకుండానే కనులవెంట ధారాపాతంగా నీరు కారసాగింది.

సిస్టర్ మోడెస్టీనా బలహీనంగా నవ్వింది వసుధను చూసి. దగ్గరగా పిలిచి మంచం మీద కూర్చోపెట్టుకున్నది. ఆ క్యాంపస్‌లోని పిల్లలంతా ఆమెకు సమానమే. అందరినీ ప్రభువు బిడ్డలాగానే సమానంగా ప్రేమించిందామె. అయినా వసుధపట్ల ఆమెకు ఒక పిసరు ఎక్కువగా వుండేది. ఇంతమంది అనాథల్లో ఈ వసుధ ఒకతె అని సిస్టర్ అనుకోలేకపోయింది. మోహన్ అనే ఆ యువకుడు తన దగ్గర దాచుకున్న సంపద ఈ వసుధ అని ఆమె నమ్మింది. వసుధలానే ఆమెకు కూడా మోహన్ ఎప్పుడో ఒకప్పుడు వస్తాడని అభిప్రాయం వుండేది. 'చూడండి మిస్టర్ మోహన్! మీరు నాకు అప్పగించిన బాధ్యతను నేను సక్రమంగా నిర్వర్తించేను. మీ బిడ్డను మీకు పదిలంగా అప్పగిస్తున్నాను' అని చెప్పాలనుకునేది. కానీ మోహన్ రాలేదు. వస్తాడనే ఆశాలేదు. తాను మాత్రం ఇక్కడి నుండి వెళ్లిపోతున్నది. బహుశా కొన్ని రోజులకు ఈ ప్రపంచం నుండే వెళ్లిపోతుంది.

సిస్టర్ పుల్లల్లాంటి తన చేతులతో వసుధ కంటినీరు తుడిచింది. వసుధ కూడా సిగ్గుపడి ఓణీతో ముఖం తుడుచుకుంది.

"వసుధా! నేను వైద్యం కోసం రాయవెల్లూరు వెళుతున్నాను. బహుశా తిరిగి రాను"

వసుధ కళ్లు మళ్లీ నీటి చెలమలయ్యాయి.

"పిచ్చిదానా! ఏడిస్తే ఏమవుతుంది? ఏడవకు. నీ పాసుబుక్కు, చెక్కుబుక్కు సిస్టర్ గ్రేషియానాకు ఇచ్చాను. ఆమె దగ్గర వున్నాయి. తీసుకో. ఈ సంవత్సరం ఇంటర్ అయిపోతుందికదూ!"

వసుధ తల వూపింది.

"ఇక్కడ ఇంటర్ అయిపోగానే పట్నం వెళ్లి డిగ్రీ కాలేజీలో చేరు. తర్వాత ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకో. నీవంటి వారికి ఉద్యోగం చాలా అవసరం. ప్రభువు నీకు మేలు చేస్తాడు" ఈ అప్పగింతలు విని వసుధ మరింత దుఃఖించసాగింది.

"వసుధా! ఈ జీవితం పెద్ద ప్రవాహం. ఎవరి కోసమూ ఆగదు. ఇలా సాగిపోతూనే వుంటుంది. ప్రతి మలుపు దగ్గరా నిలబడి సంతాపం పాటించటానికి సమయం వుండదు. దానితోపాటు మనమూ సాగిపోవలసిందే. వెళ్లిపోయిన వాళ్ల జ్ఞాపకం మనని బాధించకూడదు. బాధించినా దాని ప్రభావం మన జీవితాల మీద పడకూడదు. వాళ్ల స్మృతులు మనకు స్ఫూర్తినివ్వాలి. ధైర్యంగా జీవితాన్ని గడపగల సాహసాన్ని ఇవ్వాలి. జీవితం ఎవరికోసమో కాదు. మై చైల్డ్! జీవితం జీవించటానికే. ఇదే నేను నీకివ్వగలిగిన కానుక"

ఆమె వంగి దిండు కింద నుండి క్రాస్ వున్న రోజరీనొకదాన్ని తీసి వసుధ చేతిలో పెట్టింది.

"వెళ్లిరా వసుధా! గుడ్‌లక్"

వసుధ కాళ్లీడ్చుకుంటూ గది గుమ్మం వరకూ వచ్చింది. ఏదో స్ఫురించిన దానిలా వెనక్కి సిస్టర్ దగ్గరకు పరుగెత్తింది. ఆ అడుగుల సవ్వడికి కళ్లు మూసుకున్న సిస్టర్ మోడెస్టీనా కళ్లు తెరిచి చూసింది. ఆమె శారీరక బాధను ఆ కళ్లు ప్రతిఫలిస్తున్నాయి.

"సిస్టర్! మీకు మా మోహనన్నయ్య... అదే మా ఫాదర్ అడ్రెసు తెలుసా? "





ఆవిడ తల అడ్డంగా వూపింది. "వాళ్ల వూరు పేరు చేబ్రోలు. అది మాత్రమే తెలుసు" తిరిగి ఆవిడ కళ్లు మూసుకుంది. వసుధ చాలా అడగాలనుకుంది. ఆ ఊరి పేరు చేబ్రోలని తనకీ తెలుసు. అన్నయ్యా ఖచ్చితమయిన చిరునామా కావాలి తనకు. సిస్టర్‌తో ఇంకొంచెంసేపు మాట్లాడితే తెలిసే అవకాశం వుంది. కానీ ఆమెను మళ్లీ లేపే సాహసం వసుధ చేయలేకపోయింది.

సిస్టర్ గ్రేషియానా వసుధకు పాస్‌బుక్కు, చెక్కు బుక్కు అందజేసింది.

"ఇంకేమీ లేవా సిస్టర్?" అనడిగింది. ఆమె ఉద్దేశ్యం మోహన్ అన్నయ్య సిస్టర్ మోడెస్టీనాకు రాసిన ఉత్తరాలు ఏమయినా వుంటే వాటిల్లో అతని చిరునామా తెలిపే క్లూ ఏమయినా దొరుకుతుందని. సిస్టర్ గ్రేషియానా కనుబొమలు చిట్లించి,

"ఇంకేం ఉంటాయ్? పూలిష్‌గర్ల్! గో ఎవే" అంది కఠినంగా.

వసుధ చిన్నబుచ్చుకుని వచ్చేసింది. తర్వాత తన రూమ్‌మేటు దగ్గర గొడవ పెట్టింది.

"సిస్టర్ మోడెస్టీనా సామానులు నాకిస్తే బాగుండును! అందులో అన్నయ్య అడ్రెసు దొరుకుతుందేమో!"

ఆ రూమ్మేటు నవ్వేసింది.

"ఫూల్! సన్యాసినులకు సామానులేం వుంటాయే? వున్నకొద్దో గొప్పో ఆమెతో పాటే వెళ్లిపోయుంటాయి. మిగిలినవి చర్చికి అప్పగించేస్తారు"

"మరి ఆ చిరునామా నాకు ఎట్లా తెలుస్తుంది?"

"ఏముంది? ఇక్కడికి వచ్చేటప్పటికి నీకు వూహ తెలుసుకదా! చేబ్రోలు వెళితే ఆ ఇల్లు గుర్తుపట్టలేవూ?"

'ఎందుకు పట్టలేను? నా బాల్యమంతా అందులో నిక్షిప్తమై వుంది' అనుకుంది వసుధ.



తర్వాత రెండు మూడు నెలలకి వసుధ ఇంటర్ పూర్తయ్యింది. పరీక్షలు అయిన రోజునే ఆమె హాస్టలు ఖాళీ చెయ్యవలసి వుంది. ఇదివరలో అయితే సిస్టర్ మోడెస్టీనా వుండేవారు. హాస్టల్ మూసెయ్యగానే వసుధ ఆవిడ అనుమతితో అనాథశరణాలయానికి మారిపోయేది. మళ్లీ హాస్టలు తెరిచిన రోజున వెనక్కి వచ్చి హాస్టల్లో చేరేది. ఇప్పుడు సిస్టర్ మోడెస్టీనా లేనందు వలన, వసుధ నేరుగా మదర్ సుపీరియర్ వద్దకు వెళ్లి మనవి చేసుకుంది.

"మదర్! నాకు ఎవరూ లేరు. రిజల్ట్స్ వచ్చేవరకు నేను ఆర్ఫనేజిలో వుంటాను. దయచేసి అనుమతి ఇవ్వండి"

ఆ సమయంలో సిస్టర్ గ్రేషియానా అక్కడే వుంది.

"అలా వుండటానికి వీల్లేదు వసుధా! నువ్వు అనాథవుకాదుగదా! నీకు తండ్రి వున్నారు. ఆయన నీకు కొంత డబ్బు కూడా వదలివెళ్లారుకదా!" అంది మదర్.

వసుధ నిస్సహాయంగా చూసింది.

"పోనీ డబ్బు కట్టి వుంటాను మదర్!"

"అనాథ శరణాలయం డబ్బు కట్టగలిగిన వాళ్లకు కాదు"

ఈ వాదనను ఎదుర్కోగలిగిన శక్తి వసుధకు లేకపోయింది. డబ్బు కట్టి వుందామంటే హాస్టలు మూసేశారు. అనాథశరణాలయంలో వుందామంటే వాళ్ల రికార్డు ప్రకారం తాను అనాథ కాదు. మరిప్పుడు ఎక్కడ వుండాలి?

సిస్టర్ గ్రేషియానా కల్పించుకుని

"మదర్! వసుధ అయిదు సంవత్సరాలుగా మన సంస్థలో చదువుకుంటోంది. బుద్ధిమంతురాలు. ఆ ధర్మాత్ముడెవరో ఆమెకు డబ్బు పంపేవారు కానీ ఆమె నిజంగా అనాథే! ఆడపిల్ల! రిజల్ట్ వచ్చేవరకూ ఎక్కడకు వెళ్లగలదు? దయచేసి ఆమె కేసును పునఃపరిశీలించండి. ఇది నా వ్యక్తిగతమైన అభ్యర్థన"అంది.

వసుధ ఆశ్చర్యపోయింది. పైకి ఎంతో కఠినంగా కనపడే ఆ క్రైస్తవ సన్యాసినిలో తన పట్ల ఇంత ఆర్ద్రత వుంటుందని ఆమె కలలో కూడా అనుకోలేదు.

"ఓకే ఓన్లీఫర్ టూ మంత్స్" అంది మదర్ సుపీరియర్.

వసుధ ఆవిడకు నమస్కరించి బయటకు వచ్చేసింది. ఆ వెనుకనే సిస్టర్ గ్రేషియానా కూడా వచ్చింది.

"థ్యాంక్స్ సిస్టర్!" అంది వసుధ.

"ఇట్సాల్ రైట్!" అంది ఆవిడ కఠినంగానే.

ఆ శలవుల్లోనే సిస్టర్ మోడెస్టీనా రాయవెల్లూరు ఆసుపత్రిలో మరణించారని విన్నది వసుధ. నా జీవితంలో నుండి వెళ్లిపోయిన వాళ్లలో ఈవిడ ఒక్కదాని ముగింపే నాకు తెలిసింది. మిగిలిన వాళ్లు ఏమయ్యారో ఎక్కడున్నారో నాకు తెలీదు అనుకుంది వసుధ. ఆ సాయంత్రం చర్చికి వెళ్లి ఆవిడ ఆత్మ శాంతి కోసం ప్రార్థించింది.

రెండు నెలలు ఇట్టే గడిచిపోయాయి. ఇంటర్ ఫలితాలు తెలిసాయి. వసుధ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలయ్యింది. తర్వాత వారంలో బోర్డు నుండి అన్ని స్కూళ్లకు మార్కుల లిస్టులు వచ్చాయి. మార్కులు, ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్టు, కాండక్ట్ సర్టిఫికెట్టు తీసుకుని స్నేహితుల దగ్గర, సిస్టర్స్ దగ్గర శలవు పుచ్చుకుని ఆ క్యాంపస్ వదిలేసింది వసుధ. బాల్యంవీడి కౌమారం సంతరించుకుంటున్న కొత్తలో అక్కడ అడుగుపెట్టిన ఆమె ఇంటర్ పూర్తి చేసుకుని నవయువతిగా బయటకు వచ్చింది.

బస్టాండుకు వచ్చి గుంటూరుకు టికెట్టు తీసుకుంది. ఈ వూరికి నేను ఏమార్గం గుండా వచ్చేను! చేబ్రోలు అనే వూరు ఈ వూరికి ఏ దిశలో వుంది? వసుధకు ఎంత కష్టపడ్డా గుర్తుకు రాలేదు. తాను ఎన్ని గంటల ప్రయాణం తరువాత ఈ వూరు చేరిందో కూడా అంతుపట్టలేదు. దారి పొడుగునా ఏడవటం, మోహన్ అన్నయ్య భుజం మీద పడి నిద్రపోవడం గుర్తుకొచ్చింది. ఆయన కౌగలించుకుంటే నేను ఎవరినీ తాకకూడదన్నావుగా అని దబాయించటం జ్ఞప్తికి వచ్చింది. అన్నయ్య ఫొటో అయినా లేదు. ఇప్పుడెక్కడున్నాడో? ఎలా వున్నాడో? రజనీ, నళినీ పెద్దవాళ్లయిపోయి వుంటారు? తను వాళ్లకి గుర్తుందో లేదో? ఈ జనారణ్యంలో ఎక్కడో వుండే వుంటారు. కన్పించినా తాము ఒకరిని ఒకరు గుర్తించుకోలేరు. నిస్పృహగా వెనక్కి తలవాల్చి కళ్లు మూసుకుంది.

★ ★ ★

గుంటూరు వంటి మహాపట్టణాన్ని చూడటం వసుధకు అదే ప్రథమం. రోడ్లు, బస్సులు, బండ్లు, షాపులు అన్నీ క్రిక్కిరిసిపోయినట్టుగా తోచిందామెకు. గుండెల్లో దడ ప్రారంభం అయింది. ఈ వూరే ఇలా వుంటే ఇక హైద్రాబాదు ఎలా వుంటుందో అని వూహించటానికి ప్రయత్నించింది. ఇంత పెద్ద ఊరిలో ఒంటరిదాన్ని, ఆడపిల్లని, ఎక్కడ వుండగలను? ఎలా బతకాలి? నేను తప్పు చేశాను. మదర్ సుపీరియర్‌ని అడిగి నన్‌గా మారి అక్కడే జీవితం గడిపి వుండవలసింది అని పశ్చాత్తాప పడింది కొంతసేపు. నాకు పాచిపని చెయ్యటం వచ్చుకదా! పనిమనిషిగా అక్కడ ఉన్నా సరిపోయేది. ఏం బావుకుందామని ఇంత దూరం పరుగెత్తుకు వచ్చాను అని తననుతాను తిట్టుకుంది.

మోహన్ 'వసుధా! నువ్వు బాగా చదువుకుని ఉద్యోగం చెయ్యాలి. నేను ముసలివాడినయ్యాక నీ దగ్గరకు వచ్చి వుంటాను' అనటం గుర్తుకు వచ్చింది. సిస్టర్ మోడెస్టీనా 'ధైర్యంగా వుండు వసుధా! జీవితం జీవించటానికే' అని చెప్పినట్టు తోచింది. ఆమె పోయాక, తన సహాధ్యాయినులు ఆమె గురించి అన్న మాటలు గుర్తుకొచ్చాయి, "ఈ జీవితం నుండి పారిపోవటా




నికి నేను మోహన్ అన్నయ్యలా పిరికిదాన్ని కాదు, సిస్టర్ మోడెస్టీనాలా సన్యాసినిని కాదు. నేను వసుధను. జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొంటాను" అని తనలోతాను శపథం చేసుకుంది. తర్వాత వసుధ మనసు కుదుటపడింది. వెయిటింగ్ హాల్లో స్నానం చేసి సర్టిఫికెట్లు, డబ్బు తీసుకుని సూట్‌కేసు క్లోక్‌రూంలో వుంచింది. ఒకళ్లిద్దరు ఈ ఒంటరి ఆడపిల్లను విచిత్రంగా చూశారు. వసుధ నిర్లక్ష్యం నటిస్తూ కేఫెటేరియాలోకి వెళ్లి టిఫిను తిని, కాఫీ తాగింది. స్టేషను బయటకు వచ్చి ఒక నడివయస్కుడిని,

"కాలేజీకి దారి ఎటు? " అనడిగింది.

"ఏ కాలేజీ? హిందూ కాలేజా? క్రిస్టియన్ కాలేజా? " అని ఆయన ఎదురు ప్రశ్నించాడు.

'ముస్లిమ్ కాలేజీ' అందామనుకుంది. కానీ పెద్దాయనతో హాస్యం ఎందుకని నిగ్రహించుకుంది. తాను చదువుకున్న సంస్థను గుర్తు పెట్టుకుని,

"క్రిస్టియన్ కాలేజీకి దారి చెప్పండి" అని అడిగింది.

క్రిస్టియన్ కాలేజీకి వెళ్లాక అక్కడి ఫీజు వివరాలు తెలుసుకున్నాక హిందూ కాలేజీకి వెళ్లింది. అలా ఒకదాని వెంట ఒకటి వూళ్లో కాలేజీలన్నీ తిరిగేక వసుధకు ప్రభుత్వ కాలేజీ అయితే ఫీజు తక్కువ వుండవచ్చని స్ఫురించింది. తన దగ్గర పధ్నాలుగు వేల చిల్లర వుంది. దీనితో మూడు సంవత్సరాలు గడవాలి. తర్వాత ఉద్యోగం రాక పోతే ఇంకొంత కాలం గడవాలి. కాబట్టి గవర్నమెంటు కాలేజీయే ఉత్తమం. ఏం చదవాలి అనేది వసుధకు పెద్ద సమస్యకాలేదు. ఇంటర్‌లో ఆర్ట్సు గ్రూపు చదవటం వల్ల బియ్యెస్సీ చదివే అవకాశం లేదు. ఇక మిగిలినది బియ్యే, బికాం. చాలామంది బికాం చదివితే బ్యాంకుల్లో ఉద్యోగాలొస్తాయి అనటం వింది. అందువల్ల బికాంలో చేరి ఫీజు కట్టేసింది. చీకటిపడుతోండగా రైల్వే స్టేషనుకు చేరింది.

స్టేషను జనసందోహంతో కోలాహలంగా వుంది. ఈ స్థలమే తనకు సురక్షితమైందని వసుధ భావించింది. వెయిటింగ్ హాలులో ఖాళీ బెంచీ ఒకటి కన్పిస్తే దానిమీద పడి నిద్రపోయింది. ఊహ తెలిసినది మొదలు చంద్రమ్మత్తా, నిర్మలక్క, మోహన్ అన్నయ్య, సిస్టర్ మోడెస్టీనా ఎవరో ఒకరు నన్ను కాపాడుతూ వచ్చారు. ఇక వాళ్లెవరూ లేరు. నన్ను నేనే కాపాడుకోవాలి. నాకు నేనే తోడు అనుకుంది వసుధ.

వసుధ ఉదయం లేచి స్నానపానాదులు ముగించి కాలేజీకి బయలుదేరింది. వెయిటింగ్ హాలులో వున్న మనిషి వచ్చి గద్దించింది.

"ఏమమ్మా! ఇదేమైనా నీ బాబుగారి ఇల్లనుకున్నావా? ఇక్కడ వుండకూడదు"

వసుధ పట్టణానికి వచ్చి ఒకరోజే అయినా స్టేషన్‌లోనూ, కాలేజీలోనూ చూసి గ్రహించింది, ఇక్కడ డబ్బు మాట్లాడుతుందని. అందుకని తానేమీ మాట్లాడకుండా రెండు రూపాయలు తీసి ఆ మనిషి చేతిలో పెట్టింది. ఇవాళ హాస్టలు వ్యవహారం తేల్చుకోవాలి అనుకుంది బయటకు వస్తూ.

★ ★ ★

ఆ కాలేజీకి హాస్టలు లేదు. లేదు అంటే లేదని కాదు. ఒకటి వుంది. అది సోషలు వెల్ఫేర్ వాళ్లతో నిర్వహించబడుతోన్న హాస్టలు. అక్కడ వసతి, భోజనం కూడా ఉచితం. 'నా అదృష్టం బాగానే వుంది' అనుకుని వుత్సాహంగా వెళ్లింది వసుధ.

సాయంత్రం వెళ్లి క్లోక్‌రూం నుండి సూట్‌కేసు తెచ్చేసుకోవాలి అనుకుంది. ఇక తన సమస్య పరిష్కారం అయిందని సంతోషపడుతున్నంతలో బాంబులాంటి మాటన్నాడు హాస్టలు గుమాస్తా.

"భలే వాళ్లండీ, మీరు బీసీ కాదుగా!"

"అంటే? " అంది వసుధ తెల్లముఖం వేసి.

"మీరు ఫార్వర్డ్‌కేస్ట్. అంటే ఓసీ. మీకు హాస్టల్‌లో సీటివ్వరు"

డబ్బు కట్టి వుండటానికి హాస్టలు లేదు. డబ్బు కట్టకుండా వుండే హాస్టలులో తనకు సీటు లేదు. ఏం చెయ్యాలో వసుధకు పాలుపోలేదు. నీరసంగా కాళ్లీడ్చుకుంటూ కాలేజీకి వస్తే అక్కడ సీనియర్ ఒకమ్మాయి పరిచయం అయింది.

"ఎక్కడుంటున్నావు? " అనడిగింది చనువుగా.

"ఇంకా ఎక్కడా లేదు" అంటూ వసుధ తన సమస్యను వివరించింది.

"పోనీ నీకు రూం దొరికేదాకా నా రూంలో వుండు. మా రూమ్మేటు వూరు వెళ్లింది" అంది సరస్వతి. వసుధ తేలిగ్గా గాలి పీల్చుకుంది. వెయిటింగ్ హాల్ మనిషి రెండు రూపాయలిచ్చినా వుండనివ్వదేమోననే భయం వసుధను ఉదయం నుండి తొలిచేస్తోంది.

ప్రస్తుతం సరస్వతి రూంలో వుండి నేను కూడా రూం వెతుక్కుంటాను. అది బెటర్ అనుకుంది. సరస్వతి వసుధకు తోడుగా స్టేషన్‌కి వచ్చింది. ఇద్దరూ క్లోకు రూం నుండి సూట్‌కేసు తీసుకుని సరస్వతి గదికి వచ్చారు. గది ఫర్వాలేదు. బాగానే వుంది.

వసుధ చేతిలో వంద రూపాయలున్నాయి. 'రేపు బ్యాంకుకు వెళ్లి ఎకౌంట్ ట్రాన్స్‌ఫర్ చేయించుకోవాలి' అనుకుంది. ఆమె బాత్‌రూంకు వెళ్లి స్నానం ముగించి వచ్చేసరికి ఒక చిన్నపిల్ల హోటల్‌నుండి క్యారియర్ తెచ్చి ఇచ్చింది. వసుధ పర్సు తెరిచి ఆ అమ్మాయికి డబ్బులివ్వబోతే సరస్వతి వారించింది.

"అఖ్ఖర్లేదు బేబీ! ఆ హోటల్లో మనకు ఖాతా వుంది"

"నా పేరు బేబీ కాదు, వసుధ"

"గుడ్‌నేమ్! కానీ నేను బేబీ అనే పిలుస్తాను. నువ్వు నాకు నచ్చేవు"

వసుధకు తన పేరంటే ఇష్టం. తనను మరే పేరుతో పిలిచినా ఇష్టం లేదు. కానీ రైల్వే స్టేషను వెయిటింగ్ హాలులో పడి వుండవలసిన తనని గదిలోకి తెచ్చి ఆదరించిన ఈ క్రొత్త స్నేహితురాలిని నొప్పించటం ఆ క్షణాన ఆమెకు ఇష్టంలేకపోయింది.

★ ★ ★

వారం పది రోజులు గడిచినా వసుధకు గది దొరకలేదు. వెతగ్గా వెతగ్గా చివరికి అరండల్‌పేటలో ఒక గది దొరికింది. గదంటే గదికాదు. అది కారు షెడ్డు. ఆ ఇల్లు నరసింహారావుగారు అనే లాయరుగారిది. కానీ అందరూ ఆయనని భవానమ్మ మొగుడనే అంటారు. ఆ విషయమై ఆయనక్కాడా పెద్ద అభ్యంతరం వున్నట్టు తోచదు. ఆయన లాయరుగా ఎన్ని అబద్ధాలాడేడో తెలియదు కానీ ఆ దంపతులకు అయిదుగురూ ఆడపిల్లలే. మగపిల్లవాడి కోసం ఇంకా ఎదురు చూడాలని ఆవిడ ఉత్సాహపడింది. కానీ ఆయన పడనివ్వలేదు. వాళ్లను కూడా అందరూ భవానమ్మ గారి పిల్లలనే అంటారు. ఆ ఇంటిని కూడా భవానమ్మగారి మేడ అంటారు. ఇల్లు కట్టిన కొత్తలో కారు షెడ్డులోనే వుండేది. తర్వాత ఆ మేడకి ముందు రెండు కార్లు పట్టేంత పోర్టికో కట్టించేక ఆ షెడ్డును వాడటం మానేశారు. కనీసం ఇంటివాళ్ళు అలా అనుకున్నారు. ఎందుకంటే పనివాళ్లు దానిని బాగానే వాడేవాళ్లు పేకాటకి. ఆ విషయం తెలిసి ఆ అరాచకాన్ని అరికట్టేందుకు ఆవిడ దాన్ని అద్దెకు ఇవ్వాలని నిర్ణయించుకుంది.

కానీ ఆ కారు షెడ్డు నిజంగా కారు షెడ్డే. కారు వుండటానికే తప్ప మనుషులు వుండటానికి కట్టనందువల్ల దానికి వెంటిలేటర్లు గానీ కిటికీలుకానీ లేవు. ఆ కారణంగా దానిని చూసిన మనుషులెవరూ అందులో వుండటానికి ఇష్టపడలేదు. వసుధ కొన్ని ఇళ్లల్లో కుక్కల్నీ, కొన్ని ఇళ్లల్లో మగవాళ్లనీ చూసి భయపడి వున్నందువల్ల ఈ ఇంట్లో అందరూ ఆడపిల్లలే కన్పిస్తోంటే షెడ్డుని





చూసి భయపడినా మిగిలిన అపాయాలను గుర్తుకు తెచ్చుకుని ధైర్యంగా షెడ్డుకి అడ్వాన్సు ఇచ్చేసింది.

"అన్నట్టు చెప్పటం మరిచిపోయానమ్మాయ్! నువ్వు శలవులకు వెళ్లినపుడు కూడా అద్దె చెల్లించాల్సి వుంటుంది. అప్పుడే రూం నీకింద వుంచటానికి వీలవుతుంది" అంది భవానమ్మగారు.

వసుధ నవ్వుకుంది. ఆ షెడ్డులో ఇప్పటి వరకూ ఎవరూ లేరు. ఇక ముందు వుండరు కూడా. దానిని తన కింద వుంచటం తప్ప ఆవిడకు గత్యంతరం లేదు. అయినా తను శలవుల్లో ఎక్కడికి వెళుతుంది? చావయినా బతుకయినా చదువు పూర్తయ్యి ఉద్యోగం దొరికే వరకు ఇక్కడే అనుకుంది వసుధ. పైకి మాత్రం ఆవిడతో "అలాగేనండీ" అంది నమ్రతగా.

★ ★ ★

వసుధ జీవితం కారు షెడ్డులో ప్రారంభం అయింది. మంచి అభివృద్ధే! గుడిసెలో పుట్టి షెడ్డులోకి వచ్చిపడ్డాను అనుకుంది వసుధ. వెంటిలేటర్లు, కిటికీలు ఏమీ లేనందువల్ల దానిలోకి గాలీ, వెలుతురూ వచ్చే మార్గంకానీ పోయే మార్గం కానీ ఏమీలేవు. దానికున్న పెద్ద రేకు తలుపుల్ని బార్లా తెరిస్తే ఎదురింటి వాళ్లంతా కనపడతారు. ఆరుబయట వున్నట్టే వుంటుంది. మూస్తే సజీవసమాధి అయిపోతున్నట్టుగా వుంటుంది. దానిలోనే రెండు రాళ్లు పేర్చి తన సూటుకేసు పెట్టుకుంది వసుధ. బజారుకెళ్లి ఒక చాప, కూజా, గ్లాసు, పళ్లెం వంటి కనీస అవసరాలకు ఉపయోగపడే సామాగ్రి కొనుక్కుంది. ఆ మూల నుండి ఈ మూలకు ఒక తాడు కట్టింది. బట్టలు వేసుకోవటానికి బాగానే వుంది. బాగానే ఏమిటి? బ్రహ్మాండంగా వుంది అనుకుంది, వసుధ ఒకసారి కలయ చూసి.

సరస్వతి లేకపోవటం ఒకవిధంగా లోటే. ఆ అమ్మాయి వసుధ తిండి విషయంలో చాలా జాగ్రత్త తీసుకునేది. ఉదయమే టిఫినూ, కాఫీ తెప్పించేది. గది కాలేజీకి దగ్గరే. అందువల్ల ఇద్దరూ గదికి వచ్చి పనిపిల్ల తెచ్చిన క్యారియర్‌లో భోజనం చేసేవాళ్లు. సాయంత్రం కాలేజీ క్యాంటీన్‌లో కాఫీ తాగేవాళ్లు. రాత్రికి పనిపిల్ల మళ్లీ క్యారియర్ తెచ్చేది. ఎన్నడూ తిండికోసం తడుముకోవలసిన అవసరం వసుధకు కలగలేదు.

ఈ ఉదయం ఈ షెడ్డులో కళ్లు తెరవగానే కాఫీ తాగాలన్పించింది. కానీ ఎట్లా? బాత్‌రూం, లావెటరీ కాంపౌండులో ఆ చివరన ఉన్నాయి. అది ఆ మేడలోని పనివాళ్లకూ, వసుధకూ కామన్. ఆమె వెళ్లి స్నానం చేసి ఇంకా కాలేజీ టైం కాకపోయినా కాలేజీకి వెళ్లిపోయింది. అదృష్టవశాత్తు క్యాంటీన్ తెరిచే వుంది. గబగబ టిఫిన్ తిని, కాఫీ తాగింది. మధ్యాహ్నం భోజనం కూడా క్యాంటీన్‌లోనే చేసింది. రాత్రికి మాత్రం టిఫిన్ ప్యాక్ చేయించుకుని ఒక అరడజను అరటిపళ్లు కొనుక్కుని తెచ్చుకుంది. ఇట్లా అయితే కష్టం. దగ్గరలోనే ఏదయినా హోటల్ పట్టుకోవాలి అనుకుంది వసుధ. కానీ ఆడపిల్ల హోటల్‌కి వెళ్లి తినటం ఎబ్బెట్టుగా వుంటుందేమో అని సందేహించింది. సరస్వతిలా ఒక పనిపిల్లను పెట్టుకుంటే ఆ పిల్లే క్యారియర్ తెచ్చి పెడుతుందికదా! ఈ ఆలోచనను ఆచరణలో పెట్టలేకపోయింది. ఉదయం లేచి కాలేజీకి పరిగెత్తడం, సాయంత్రం చీకటిపడే వరకూ లైబ్రరీలో గడపటం, షెడ్డుకొచ్చి టిఫిను తిని, అలసటతో నిద్రపోవటం, ఇవాళా, రేపు అనుకుంటూనే రోజులు గడిపేయ సాగింది.

ఒకరోజు ఉదయం నిద్రలేచేసరికి ఒళ్లంతా నొప్పులుగా అన్పించాయి. తల కూడా నొప్పిగా వుంది. శరీరం నుండి ఆవిర్లు వస్తున్నట్టు తోచింది. 'కొంపదీసి జ్వరంగానీ రాలేదుకదా' అని భయపడింది.



అలాగే చాపమీద నుండి లేవాలని ప్రయత్నించింది. ఆమె శరీరం ఆమె వశంలో లేకపోయింది. అలా ఎంతసేపు పడుకుందో తెలీదు. రేకు తలుపుల మీద దబదబ శబ్దం అవుతోంటే మెలకువ వచ్చింది. చాలా కష్టంమీద ఓపిక కూడగట్టుకుని గడియతీసింది. తలుపులు బార్లా తెరుచుకుని భవానమ్మ ప్రత్యక్షం అయింది.

"ఏమమ్మా? ఒంట్లో బాగోలేదా? "

ఆమె ఆ ప్రశ్న అడిగే సమయానికి వసుధ మళ్లీ చాప మీద పడుకుని వుంది. ఆమె దగ్గరకు వచ్చి నుదుటి మీద చెయ్యి వేసి చూసింది.

"అయ్యో జ్వరం వచ్చిందిగా!"

వసుధ మాట్లాడలేదు. మాట్లాడ్డానికి ఓపికలేదు.

"మాత్ర ఏమయినా వేసుకున్నావా? "

లేదు అన్నట్టు తల తిప్పాను అనుకుంది వసుధ. ఆమెకు అదేమీ కన్పించలేదు కానీ ఈ పిల్ల జ్వరంలో స్పృహ లేకుండా పడివుంది అని మాత్రం అర్థం అయింది.

"రాధీ! రాధీ" అని పెద్ద కూతురిని పిలిచింది.

ఆ పిల్ల సహాయంతో వసుధను తన ఇంటిలోకి తన గదిలోకి తెచ్చి పడుకోబెట్టింది.

"ఒసేయ్! మామయ్యకు ఫోను చేసి నేను రమ్మన్నానని చెప్పు" అని ఆజ్ఞ జారీ చేసింది. ఆ అమ్మాయి అయిదు నిమిషాల్లో వెనక్కు వచ్చింది.

"మామయ్యకు పేషెంట్లు చాలామంది ఉన్నారటమ్మా! అర్జెంటా కనుక్కోమంటున్నాడు"

"అర్జెంటేమిటే నీ ముఖం. యమర్జెంటు. వుండు నేను మాట్లాడతాను" అని ఆవిడ స్వయంగా లేచి వెళ్లింది.

తర్వాత ఇరవై నిమిషాలకి డాక్టర్ రవీంద్రప్రసాద్ ఆవిడ గది గుమ్మం ముందు ప్రత్యక్షమయ్యాడు.

ఆసరికి ఆవిడ వసుధ ఒళ్లంతా నీళ్లతో తుడిచి గ్లూకోజు నీళ్లు తాగించింది. డాక్టరు మామయ్య వచ్చేడని పిల్లలంతా అరుస్తోంటే వసుధ కళ్లు తెరిచి చూసింది.

"ఎవరూ పేషంటు? ఈ అమ్మాయేనా? "

అతని గొంతు కంచుగంటలా వుంది.

'డాక్టర్లు గుసగుసగా రహస్యం మాట్లాడినట్టు మాట్లాడతారనే నా అభిప్రాయం మార్చుకోవాలి నేను' అనుకుంది వసుధ.

అతని ప్రశ్నకు భవానమ్మగారు సమాధానం చెప్పింది.

"అవును రవీ! ఈ అమ్మాయి మన షెడ్డులో అద్దెకు వుంటోంది. పాపం! ఎప్పటినుండి జ్వరంతో పడివుందో తెలీదు. రోజూ ఉదయం పంపు దగ్గర నీళ్లు పట్టుకోవడానికి కూజా తీసుకుని వచ్చేది. ఇవాళ రాలేదేమా? అనుకున్నాను. సాయంత్రం ఓబులయ్య గేదెకు పాలు తీయటానికి వెళుతూ, అమ్మగారూ! షెడ్డులో నుండి మూలుగు వినిపిస్తోందంటే వెళ్ళిచూద్దును గదా, ఈ పిల్ల ఒళ్ళెరక్కుండా పడివుంది"

"ఆ షెడ్డులో కార్లుంటేనే తుప్పు పట్టిపోతున్నాయని బావ పోర్టికో దింపించేడుకదా! మరి మనుష్యులుంటే స్పృహ తప్పిపోరూ? " అన్నాడతను.

"మంచోడివే!"

అతను వసుధ కళ్లు, నాలుక పరీక్షించేడు. నాడి చూశాడు. నుదుటిమీద చెయ్యి వేసి చూశాడు.

థర్మామీటరుతో టెంపరేచరు చూశాడు. ఒక పురుషుడు ఆవిధంగా తనను తాకటం వసుధకు ఇబ్బందిగా వుంది. కానీ, నిస్సహాయంగా వూరుకుంది. పరీక్షలన్నీ అయ్యాక,

"జ్వరంగా వుంది" అని డిక్లేర్ చేశాడతను.

"భలేవాడివి మామయ్యా! ఆ మాత్రం తెలుసుకోవటానికి యంబీబియ్యస్ చదివిన నువ్వు కావాలా? అమ్మ ఎప్పుడో చెప్పిందిగా" అంది సుమ, రాధ తర్వాతిది. చెల్లెలి





మాటలకు రాధ నవ్వింది.

"నీకెందుకు నవ్వొచ్చింది మధ్యలో? ఈ సిరెంజి తీసుకుని, వుడికించి తీసుకురా. ఫో. నీ స్నేహితురాలికి ఇంజెక్షను చేద్దాం"

వసుధ తలెత్తి ఆ స్నేహితురాలిని చూసింది. తన వయసే వుంటుంది. తెల్లగా, సన్నగా, పొడవుగా సినిమా తారలా వుంది. ఇంటినిండా ఆడపిల్లలున్నారని వసుధకు తెలుసు. అంతకుమించి వాళ్ళను గురించిన వివరాలేమీ తెలియవు. అతను ఇంజెక్షను చేద్దామని జాకెట్టు జరిపేసరికి, పిగిలిపోయి వున్న ఆ జాకెట్టు కాస్తా చిరిగిపోయింది.

"అయామ్ సారీ!!" అంటూనే అతను తన పని పూర్తిచేసేశాడు.

మాత్రలు రాసిచ్చి "ఇవి ఆరుగంటలకు ఒకసారి వెయ్యవలసి వుంటుంది. ఈ డ్యూటీ ఎవరు చేస్తారు? " అనడిగాడు.

"స్నేహితురాలు అని బిరుదిచ్చేవుగా. నేను వేస్తాలే మామయ్యా!"

ఇంతలో భవానమ్మ పనిమనిషితో కాఫీలు పట్టించుకువచ్చింది.

"ఈ అమ్మాయికి ఇవ్వొచ్చా? " అనడిగింది తమ్ముడిని.

"నిక్షేపంగా ఇవ్వొచ్చు. తింటానంటే భోజనం కూడా పెట్టొచ్చు"

"మంచోడివే!" అందావిడ.

ఆ కాఫీ తాగితే వసుధకు నిర్మలక్క గుర్తుకు వచ్చింది. నిర్మల వెళ్ళిపోయాక, అంత మరచి కాఫీ తాగటం మళ్ళీ ఇప్పుడే!

'సెలవులలో కూడా అద్దె ఇవ్వాలి' అని నిబంధన పెట్టిన వ్యక్తి ఈవిడేనా అని ఆశ్చర్యపోయింది వసుధ, భవానమ్మ తనకు చేస్తోన్న సేవ చూసి.

రవీంద్రప్రసాద్ ఏ క్షణాన రాధను వసుధ స్నేహితురాలు అన్నాడో కానీ, ఆ అమ్మాయి నిజంగానే వసుధకు స్నేహితురాలయిపోయింది. భవానమ్మ వంటమనిషితో బ్రెడ్ కాల్పించి పంపిస్తే, రాధ బలవంతం చేసి దాన్ని తినిపించింది. రవీంద్ర సూచనల ప్రకారం శ్రద్ధగా మాత్రలు వేసింది. వసుధ నిద్రపోయేవరకు కబుర్లు చెప్పింది.

రవీంద్ర క్లినిక్‌కి వెళ్ళాడు. కానీ అతనికి ప్రతి పేషెంటు ముఖంలోనూ వసుధే కన్పించింది. 'క్లినిక్ వదిలేసి వెళ్ళి ఆ నల్ల పిల్ల ముందు కూర్చుందామా? ' అనే కోరికను అతను బలవంతాన నిగ్రహించుకోవలసివచ్చింది. తొమ్మిది గంటలకు ఇంటికి వెళుతూ, ఇక ఆగలేక అతను మళ్ళీ వసుధను చూసేందుకు వచ్చాడు. అతను వచ్చేసరికి వసుధ నిద్రపోతున్నది. భుజాలు దాటీదాటని జుట్టు విరబోసి వుంది. ఆ జుట్టు మధ్యలోనుండి నీరసించిన ఆమె ముఖం అతనికి వాడిపోయిన నల్లకలువలా తోచింది.

"నీ ఫ్రెండ్ ముఖంలో గొప్ప 'సెరినిటీ' వుందే రాధీ!" అన్నాడతను అప్రయత్నంగా.

"అంటే ఏమిటి మామయ్యా? " మెడికల్ స్టూడెంటు అయిన రాధ ఇంగ్లీషులో కొంచెం పూర్!

"పవిత్రత!" అన్నాడతను. రాధకు మనసు చివుక్కుమంది.

మరురోజు ఉదయం వసుధ నిద్ర లేచేసరికి ఆమె జ్వరం చేత్తో తీసేసినట్టు మాయమయింది.

"నేనింక వెళతానండీ. కాలేజీకి వెళ్ళాలి" అంది వసుధ భవానమ్మ అనుమతిని అర్థిస్తూ.

"మంచిదానివే! పథ్యం తినకుండా ఎక్కడికి వెళతావు? " అందావిడ.

రాధ వసుధను బాత్‌రూమ్‌కి తీసుకువెళ్ళి వేడి నీళ్ళతో పళ్ళూ, ముఖం కడిగించి తీసుకువచ్చి పడుకోబెట్టింది. ఇంతలో భవానమ్మ పళ్ళరసం పట్టుకువచ్చింది. ఇలా పడుకుని, ఇంతమందితో అదీ తనకంటే చాలా పైఅంతస్థులో వున్న వాళ్ళతో సేవ చేయించుకోవటం వసుధకు చాలా బిడియంగా వుంది. అది గ్రహించిన దానిలా

భవానమ్మ,

"మీ వాళ్ళకి ఎవరికయినా ఉత్తరం రాస్తావా? పోనీ, మీ ఊరు వెళతానంటే చెప్పు. డ్రైవరు దిగవిడిచి వస్తాడు" అనడిగింది.

వసుధ రెండు నిమిషాలు మౌనంగా వూరుకుని.

"నాకెవరూ లేరండి" అంది నెమ్మదిగా.

"మంచిదానివే" అందావిడ.

'ఈ మంచి అనేది ఈ మంచావిడ ఊత పదం కాబోలు అనుకుంది' వసుధ.

పదిగంటల ప్రాంతంలో రవీంద్ర వచ్చాడు. పిల్లలంతా కాలేజీలకు, స్కూళ్లకు వెళ్ళిపోయారు.

"ఎట్లా వుంది వంట్లో? " అనడిగాడు వస్తూనే వసుధ చెయ్యి పట్టుకుని.

"బాగుందండి. జ్వరం తగ్గిపోయింది. నేను నా రూముకు వెళ్ళిపోతాను"

"ఎక్కడికి? ఆ షెడ్డులోకా? దాంట్లో వుండబట్టేకదా జ్వరం వచ్చింది"

"మంచోడివే. ఆ షెడ్డులో వుండబట్టే ఓబులయ్య ఈ అమ్మాయి మూలుగు విన్నాడు" అంది భవానమ్మ.

"అక్కా! ఈ అమ్మాయి ఇవాళ భోజనం చెయ్యొచ్చు. రెండు రోజులపాటు నీరసం వుంటుంది. పాలు ఇవ్వండి. అవునూ మీరు నాన్ వెజిటేరియనా? వెజిటేరియనా? " వసుధనడిగాడు.

"నాన్‌వెజ్ తింటానండి"

"వెరీగుడ్! కైమాలాంటివి వేసుకుని భోజనం చెయ్యండి. త్వరగా కోలుకుంటారు"

మధ్యాహ్నం భోజనంలోకి భవానమ్మ నిజంగానే కైమా, చారు చేయించింది.

"అయ్యో! మీకెందుకండీ శ్రమ!" అని వసుధ నొచ్చుకుంది.

"మంచిదానివే. నాకేం శ్రమ అమ్మాయ్! పని కుర్రవాడు తెస్తాడు. వంటమనిషి వండుతుంది" అందావిడ. అందులో ఏమయినా అతిశయం వుందేమోనని ఆవిడ ముఖంలోకి చూసింది వసుధ. అటువంటిదేమీ లేదు. భోజనం పూర్తిచేయగానే వసుధకు కళ్లు మూతలు పడ్డాయి. ఆవిడ కుదిపి లేపేసింది.

"అమ్మో! నిద్రపోతున్నావా? మంచిదానివే! జ్వరం తిరగబెట్టదూ? " అని కాపలాగా తానే కూర్చుంది.

"మీదే ఊరమ్మాయ్! అసలు ముందు నీ పేరేమిటో చెప్పు" అంటూ వసుధను మాటల్లో పెట్టింది.

"వసుధండీ"

"అదేం పేరు? ఏదైనా దేవుడి పేరా? "

"అవునండీ. భూదేవి పేరు"

"నీ పేరు సంగతి సరే. మీ ఊరేదీ? మీ అమ్మా నాన్న ఎక్కడుంటారు? "

వసుధ తలవంచుకుని చెప్పింది.

"నాకు అమ్మానాన్న లేరండి. నేను అనాధశరణాలయంలో పెరిగేన్ను"

"మంచిదా...

"నిజమేనండి"

ఆవిడ నమ్మశక్యం కానట్టు చూసింది. వసుధ బీదపిల్ల. ఇది ఊహించటానికి ఏమంత ఊహాశక్తి అక్ఖర్లేదు. ఆమె ధరించే అతిసాధారణమైన దుస్తులే ఆమె ఆర్థిక స్థితిని చాటిచెబుతాయి. హాస్టలు ఫీజులు కూడా కట్టుకోలేని నిర్ధనురాలు కావటంవల్లనే తమ షెడ్‌లో వుంటోంది. కానీ అమ్మా నాన్నా లేని అనాథ అంటే ఆమె ఆశ్చర్యపోయింది. వసుధను జాలిగా చూసింది. వెంటనే తలెగరేసి నవ్వింది.

"పోనీలే మేమంతా లేమూ? నువ్వదేమీ మనసులో పెట్టుకోకు" అంది.

వసుధకు నవ్వొచ్చింది. ఆ విషయమై తాను కొత్తగా బాధపడేదేముంది?

★ ★ ★

నీరసం తగ్గాక, తన షెడ్డులోకి తాను వెళ్ళటానికి వసుధ భవానమ్మగారితోనూ, ఆమె పిల్లలతోనూ హోరాహోరీ పోరాడవలసివచ్చింది.

"సరే వెళ్లు. కానీ భోజనం మాత్రం బయట తినటానికి వీల్లేదు. మా ఇంట్లో చెయ్యాల్సిందే" అని ఇంకొక మడతపేచీ పెట్టింది భవానమ్మ.

వసుధ "అట్లాకాదు. అన్నం నేను వండు కుంటాను. కొన్నాళ్ళు మీరు కూర ఇవ్వండి" అని మధ్యేమార్గం సూచించింది.

ఆవిధంగా జ్వరం పుణ్యమా అని వసుధ షెడ్డులో వంట ప్రారంభించవలసివచ్చింది. ఒక కిరోసిన్ స్టవ్వు. నాలుగు జర్మన్ సిల్వర్ గిన్నెలు కొని, అన్నం, కాఫీ, వగైరాలు చేసుకోవటం మొదలుపెట్టింది వసుధ. స్వయంపాకం సౌకర్యమూ, చవుక అని త్వరలోనే గ్రహించింది.



మొదటి చూపులో 'ప్రేమ' పట్ల డాక్టర్ రవీంద్రప్రసాద్‌కి నమ్మకంలేదు. అసలు ప్రేమపట్లే నమ్మకంలేదు. అతను నవలలు చదవడు. పుస్తకాలకీ, అతనికీ ఆమడ దూరం. రాధ పుట్టిన క్షణంనుండీ 'ఇదు గోరా రవీ! నీ భార్య' అన్నారు. అవును కాబోలు అనుకున్నాడతను. అతని చదువు పూర్తయిన వెంటనే ఇద్దరికీ పెళ్ళి చేయాలని కూడా అనుకున్నారు. అతను అభ్యంతర పెట్టలేదు కూడా. ఇంటర్ పూర్తిచేసిన రాధ, తన స్నేహితులందరూ మెడికల్ ఎంట్రన్స్ రాస్తున్నారని ఉత్సాహపడి తానూ రాసింది. అందరూ నవ్వారు కూడా. నవ్విన నాప చేను పండుతుందన్నట్టుగా ఆ అమ్మాయి మంచి ర్యాంకులో ప్యాసయింది.

"మరిప్పుడేం చేద్దాంరా?" అంది భవానమ్మ.

"ఏం చేసేదేమిటి అక్కా? చదువుకో నివ్వు. ఎంతోమంది కోచింగ్‌లు తీసుకున్నా రాని సీటు నీ కూతురికి వచ్చింది" అన్నాడు రవీంద్రప్రసాద్.

"మరి పెళ్ళిమాటేమిటోయ్?" ప్రశ్నించాడు నర్సింహారావు.

"పెళ్ళికి కంగారేముందండి?" అని ఎదురు ప్రశ్నించాడు అతను.

"అలా కాదులే. పెళ్ళి చేసేసుకో. రాధ పెళ్ళి అయ్యాక చదువుకుంటుందిలే. నీ చదువయిపోయింది. నువ్వు మాత్రం ఎంత కాలమని ఆగుతావు?"

"అయితే ఒకపని చెయ్యండి. రాధని ఎనాటమీ, ఫిజియోలజీ పూర్తి చెయ్యనివ్వండి. తర్వాత చూసుకోవచ్చు"

రవీంద్ర ఇచ్చిన ఈ సలహా అందరికీ నచ్చింది. రాధ ఇంకా మొదటి సంవత్సరంలోనే వుంది. మరుసటి సంవత్సరం కానీ ఎనాటమీ ప్రారంభం కాదు. కానీ రవీంద్రప్రసాద్‌లోనే మార్పు ప్రారంభం అయింది. అదీ వసుధను చూసిన క్షణాన. జ్వరంతో పడివున్న ఆ నల్లపిల్లలో అతనిని ఆకర్షించినదేమిటో అతనికి అప్పుడే కాదు- ఎప్పుడూ అర్థం కాలేదు. బిగించి వున్న 'సారిణి'ని మీటిన చందాన ఆ ముఖం చూసిన క్షణాన అతని హృదయం ఝుమ్మని నాదం చేసింది. అది సంగీత ప్రవాహమై అతన్ని ముంచెత్తుతోంది.

'ఇందులోపడి నేను కొట్టుకుని పోవటం ఖాయం' అనుకున్నాడతను. భవానమ్మ

ఇంటికి అతని రాకపోకలు ఎక్కువైనాయి.

★ ★ ★

భవానమ్మ, నరసింహారావు, పిల్లలు కాకినాడ అతని స్వంత ఊరు వెళ్ళారు దసరా సెలవులకు. ఇరవైనాలుగు గంటలూ కోలాహలంగా వుండే ఆ మేడ ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయింది. కాలేజీతోనూ, లైబ్రరీ పనితోనూ నిరంతరమూ బిజీగా వుండే వసుధకు ఒక్కసారిగా ఇంత ఖాళీ సమయాన్ని ఏంచేసుకోవాలో తెలియలేదు. పుస్తకాల షాపుకి వెళ్ళి చలంగారి పుస్తకాలన్నీ 'మ్యూజింగ్స్' నుండి ఉత్తరాలవరకూ కొనుక్కుని తెచ్చుకుంది. వివేకానంద కంప్లీట్ వర్క్స్ కొనుక్కుంది. భోజనానికీ, బట్టలకు ఎంతో పొదుపుగా ఖర్చుచేసే వసుధ పుస్తకాలకు విపరీతంగా ఖర్చుపెడుతుంది. 'అమ్మో! జాగ్రత్తగా వుండాలి. డబ్బు చాలొద్దూ! చదువు పూర్తి కావాలి. ఉద్యోగం రావాలి. అంతవరకూ ఇదే డబ్బు' అని భయపడుతూనే వుంటుంది. కానీ మంచి పుస్తకం కనపడితే నిగ్రహించుకోలేదు.

ఒక మధ్యాహ్నం షెడ్‌లో పడుకుని 'మ్యూజింగ్స్' చదువుతోంటే రేకు తలుపు మీద మృదంగ ధ్వనిలా రిథమిక్‌గా ఎవరో కొట్టినట్టు అన్పించింది. పనివాళ్ళు అయితే దబదబా బాదుతారు. 'ఎవరైవుంటారా?' అని ఆశ్చర్యపోతూ, తలుపు తెరిస్తే ఎదురుగా డాక్టర్ రవీంద్రప్రసాద్.

"మీరా! మీ అక్కా, బావగారూ, పిల్లలూ అంతా కాకినాడ వెళ్ళారండి"

"తెలుసు" అన్నాడతను.

ఇంకేమనాలో వసుధకు తెలియలేదు.

అతనే చొరవగా, "ఏంటి లోపలకు ఆహ్వానించలేదు నన్ను. నేను లోపలకి రాకూడదా?" అంటూ వచ్చేశాడు. వచ్చాడే కానీ, చాప తప్ప మరేమీ లేని ఆ గదిలో ఎక్కడ కూర్చోవాలో అతనికి అర్థంకాలేదు. వసుధకు జీవితంలో మొదటిసారిగా తన బీదతనంపట్ల అవమానం కలిగింది. భవానమ్మగారి బాత్‌రూమ్ కూడా తనగదికంటే 'రిచ్'గా వుంటుంది. అటువంటి ఇంటివాళ్ళకి కాబోయే అల్లుడు తన బీదగదిని చూసి ఏమనుకుంటాడో అని బిడియపడింది. అతను చాపమీద కూర్చుని, "రండి కూర్చోండి" అని వసుధను కూడా ఆహ్వానించాడు. అంతేకాకుండా ఆమెకు స్థలం కేటాయించే ఉద్దేశంతో చాపమీదనే ఒకపక్కకి జరిగి కూర్చున్నాడు. వసుధ, 'నేను ఇక్కడ కూర్చుంటాను లెండి' అని ఎదురుగా నేల మీద కూర్చుంది. అతను ఆ గదిని పరిశీలించడం మొదలుపెట్టాడు. రెండు ఇటుక రాళ్ళమీద ఒక పాత సూట్‌కేస్, దానికి ఎదురుగా కిరోసిన్ స్టవ్వు, పక్కనే నాలుగు సత్తుగిన్నెలు, ఇంకోవేపు మట్టి కూజా, ఒక స్టెయిన్‌లెస్‌స్టీలు గ్లాసు, దానిపక్కనే సంతల్లో అమ్మే చిన్నపాటి చౌకబారు చిన్న అలమార- దానినిండా తెలుగు సాహిత్యం.

"అబ్బో! మీ దగ్గర చాలా పుస్తకాలున్నాయే" అన్నాడతను.

వసుధ నవ్వింది.

"అన్నీ మీ స్వంతమేనా?"

"అవునండి. నేను కొనుక్కున్నవి"

"మీరు బట్టల దగ్గర చాలా పిసినారిలా వుంటారు. పుస్తకాలకి ఎంత డబ్బు తగలేశారో"

"పుస్తకాలకి తగలేశానని నన్ను ఎవరయినా అంటే నాకు చాలా కోపం వస్తుందండి. బట్టలకు డబ్బు తగలెయ్యటంలేదని నాకు గర్వం కూడా"

'నువ్వు మాట్లాడేది తెలుగేనా' అన్నట్టు చూశాడు రవీంద్రప్రసాద్.

"అసలు ప్రపంచంలో పిసినారులు ఎవరూ వుండరని నా ఉద్దేశం. 'ఓన్లీ ప్రియారిటీస్ డిఫర్', మీకు చాలా ముఖ్యం అన్పించింది నాకు చాలా వృథా అన్పించవచ్చు మీ అక్కగారు చూడండి. ఎలుకలు కూడా వుండటానికి ఇష్టపడని ఈ షెడ్డును





ఎనభైరూపాయలకు తక్కువకు అద్దెకివ్వన న్నారు. నేను వున్నా వుండకపోయినా, సెల వుల్లో కూడా అద్దె ఇవ్వాలన్నారు. కానీ నాకు జ్వరం వస్తే నామీద అంతకు నాలు గురెట్లు ఖర్చు పెట్టారు. అది వృథాఖర్చు అని ఆవిడకు అన్పించలేదు"

తీరా అనేశాక కొంచెం అతిగా మాట్లా డానా అన్పించింది వసుధకు.

"ఆమెతో ఇవన్నీ అనకండి. బాగుండదు" అంది.

"అయితే సెలవుల్లో ఎలాగూ అద్దె ఇస్తు న్నానుకదా అని వుండిపోయారా ఏమిటి కొంపదీసి? "

"అదేం కాదులెండి"

"మరి ఇంటికి వెళ్ళలేదేం? మీ ఊరు చాలా దూరమా? "

'చచ్చానురా భగవంతుడా! వీళ్ళ అక్క ముందు పెట్టిన రికార్డు మళ్ళీ ఈయన ముందు పెట్టాలి కాబోలు' అనుకుంది వసుధ.

"ఏంవసుధా? ఒక్కరే వుండిపోయారు. మీకు బోరుగా లేదూ? "

వసుధ తల అడ్డంగా వూపింది. "లేదండీ. అలవాటయిపోయింది"

'ఏమిటి అలవాటయిపోయింది? ఒంట రిగా వుండటమా? బోరుగా ఫీలవ్వడమా? ' అనుకున్నాడతను. పైకి మాత్రం ఏమీ అన లేదు.

తర్వాత ఆమె పుస్తకాల్ని తీసి పరిశీలిం చాడు.

"చలంగారి పుస్తకాల్ని ఇప్పుడు ఇంత బాహాటంగా ప్రదర్శించుకోవటం మంచి అభిరుచికి తార్కాణం అనుకుంటా. కానీ నా చిన్నప్పుడు ఒకసారి మా అక్క ఈయన నవల చదువుతోంటే మా నాన్నగారు చూసి పేము బెత్తంతో వీపు చిట్లగొట్టారు"

"నాకు ఆయన రచనలన్నీ ఇష్టమే"

"మీకు తెలుసా ఆయన? పరిచయం వుందా? "

"లేదండీ. వ్యక్తిగతంగా పరిచయంలేదు. కానీ ఆయనకున్న చాలా మంచి అలవా ట్లలో ఒకటి ఎవరు ఉత్తరం రాసినా, దానికి సమాధానం ఇవ్వడం. రాసినవాళ్ళు అగ్రగ ణ్యులైనా, అనామకులైనా సరే ఆయన జవా బిస్తారు. నాక్కూడా ఆయన ఉత్తరాల ద్వారా పరిచయం"

"ఆయన రచనలు అర్థంకాని చాలామంది ఆయనకు మనుష్యులంటే కోపం, ద్వేషం అనుకుంటారు. కానీ ఆయనకు మనుష్యు లంటే ప్రేమ. చాలా కన్సర్న్. అందుకనే తన మాట వినక చెడిపోతున్నారని ఉక్రోషం. తల్లికి పిల్లలమీద కలిగే విసుగు లాంటిది. ఎంత చెప్పినా విని చావరేం? " అని.

"నాకూ సాహిత్యానికి చాలాదూరం వసుధా!"

"అయాంసారీ! విసిగించినట్టున్నాను"

"లేదు వసుధా! నువ్వు... సారీ మీకు అబ్బ! పోనిద్దూ నాకంటే చాలా చిన్నదానివి నువ్వనే అంటాను మాట్లాడుతోంటే వినటా నికి బాగుంది. ఇప్పుడు నాకు ఆసుపత్రికి టైమయింది. ఇంకోసారి వస్తాను" అని అతను లేచి నిలబడ్డాడు.

'అయ్యో! కాఫీ అయినా ఇచ్చి వుండవల సింది' అనుకుంది వసుధ.

★ ★ ★

రెండు రోజుల తర్వాత రవీంద్రప్రసాద్ మళ్ళీ వసుధ షెడ్డుకి వచ్చాడు.

ఈసారి ఆశ్చర్యపోలేదు. కొంచెం అను మానించింది. అతను రావటం అది రెండో సారే అని మరిచిపోయి ఎందుకీయన నా గదికి పదేపదే వస్తున్నాడు? అనుకుంది. అతనికి కూడా మొహమాటంగానే వుంది ఇలా ఒంటరి ఆడపిల్ల దగ్గరకు రావటం. కానీ మనసు శరీరాన్ని నిలవనివ్వటంలేదు. 'ఇది పద్ధతి కాదు. ఈ అమ్మాయిని నా కళ్ళముందే నిలుపుకోగల మార్గం మరేదైనా అన్వేషించాలి' అనుకున్నాడతను. ఒక

మార్గం స్ఫురించింది కూడా. దాన్ని ఆచరణలో పెట్టడానికే మళ్ళీ వచ్చాడు.

"ఇటుగా వెళుతూ, ఒంటరిగా వున్నావు. నిన్ను ఒకసారి పలకరించిపోదామని వచ్చాను" అన్నాడు సంజాయిషీ ఇస్తోన్న ధోరణిలో.

"రండి. లోపలకు వచ్చి కూర్చోండి" అంది వసుధ. తను ఆహ్వానించకపోయినా అతను ఎలాగూ వచ్చి కూర్చుంటాడని తెలుసు.

చాపమీద రెన్ అండ్ మార్టిన్ గ్రామర్ పుస్తకం వుంది. దాని పక్కనే నోటుపుస్తకంలో కొన్ని ఎక్సర్‌సైజులు చేసివున్నాయి. తను వచ్చేముందు వసుధ ఆ పనిలోనే వుందని అర్థమయింది అతనికి.

"టైంపాస్ అవటంలేదేమోకదూ వసుధా! ఇంటికి వెళ్లివుండవలసింది"

"ఎవరింటికి? " అని ప్రశ్నించింది వసుధ, నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"ఎవరింటికయినా వెళ్ళడానికి ఇంకా టైముందిలే. ప్రస్తుతం మీ ఇంటికే వెళ్ళాల్సింది"

"నాకు ఇల్లు లేదండీ..."

"అంటే? "

"అంటే నాకు తల్లీ తండ్రీ లేరు. తోబుట్టువులూ లేరు. నేను అనాథని. నాకు ఎవరూ లేరు" అంది గబగబా.

అతను ఆశ్చర్యపోయాడు. ఆమె హాస్యానికి అంటున్నదా అని కళ్లల్లోకి గుచ్చిగుచ్చి చూశాడు. ఆమె కళ్లల్లో హాస్యం ఏమీలేదు. నిజమే చెప్తునట్టుంది.

"మరి ఇక్కడికి రాకముందు ఎక్కడ ఉండేదానివి వసుధా? "

"ఇక్కడికి రాకముందు ఇంటర్‌వరకూ కైలాస్‌పురం మిషనరీలో చదువుకున్నాను"

ఈ సమాధానం అతని ఆశ్చర్యాన్ని రెట్టింపు చేసింది. అది బీదవాళ్లు చదవగలిగిన స్కూలు కాదని అతను ఎరుగును.

"మరి అక్కడికే వెళ్లలేకపోయేవా? "

"........"

"ప్రశ్నలతో నిన్ను విసిగిస్తున్నాను కదూ!"

"లేదండీ! అక్కడ కూడా నాకు ఎవ్వరూ లేరు. ఒక ధర్మాత్ముడు ఫీజు కట్టడంవల్ల అక్కడ చదువుకోగలిగాను"

"పోనీ ఒకపని చేస్తావా? "

అతను ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండానే ఆ పనేమిటో చెప్పాడు.

"నాతోపాటు ఆస్పత్రికి రా. నర్సింగ్ నేర్చుకో నాకు సహాయం చెయ్యి. నేను నీకు జీతం కూడా ఇస్తాను. ఇష్టమేనా? "

"నర్సింగ్ నాకేం వచ్చునండీ? " అనడిగింది వసుధ విస్మయంతో.

"నాకు ఇంకో నర్సు ఉంది వసుధా. ఆవిడ పేరు విజయలక్ష్మి. చాలా మంచి మనిషి. నీకు పని నేర్పిస్తుంది. ఇదేమైనా బ్రహ్మవిద్యా రాకపోవడానికి? నీకూ కాలక్షేపం అవుతుంది. నాకూ.... నాకూ నమ్మకమయిన మనిషి దొరికిందని నిశ్చింతగా ఉంటుంది"

వసుధ మాట్లాడలేదు. ఆమె ఆలోచన గమనించి అతనికి భయం వేసింది- ఒప్పుకోదేమోనని.

"ఏం వసుధా? నేనంటే భయంగా ఉందా? "

"ఛ! లేదండీ" అంది వసుధ మనస్ఫూర్తిగానే.

★ ★ ★

త్వరలోనే ఆమె ఆ ఆసుపత్రి సిబ్బందిలో ఒకతి అయిపోయింది. అనాథ శరణాలయంలో తప్ప మిగిలిన అన్నిచోట్లా ఆమె ఎప్పుడూ తనకంటే పైఅంతస్తులో వున్న వాళ్ళతోనే మసలింది. కానీ ఆసుపత్రి సిబ్బంది వసుధలాగే బడుగువర్గానికి చెందినవాళ్ళు. సీనియర్ నర్సు విజయలక్ష్మి నలుగురు పిల్లల తల్లి. భర్త పొగాకు కంపెనీలో గుమాస్తా. ఆమె కూడా ఉద్యోగం చెయ్యకపోతే ఇల్లు గడవనిస్థితి. మేల్ నర్సు ఆనందరావుకి పిల్లలు ఇద్దరే. కానీ




ఇద్దరు పెళ్లికాని చెల్లెళ్ల బాధ్యత, తల్లిదండ్రుల బాధ్యత వుంది. వీళ్ళిద్దరూ కాక, నలుగురయిదుగురు పనివాళ్లు వున్నారు. దాన్ని ఆసుపత్రి అంటారు కానీ అది నిజానికి ఇరవై బెడ్సు వరకూ వున్న నర్సింగ్‌హోం. రోజూ వచ్చిపోయే రోగులుకాక ఎప్పుడూ పది పదిహేనుమంది ఇన్‌పేషెంట్లు వుంటూనే వుంటారు.

★ ★ ★

"నువ్వు సాయంత్రాలు ఆలస్యంగా ఇంటికి వస్తున్నావా వసుధా?" అని అడిగింది భవానమ్మ.

వసుధ పంపు దగ్గర కూజా కడిగి నీళ్ళు పట్టుకుంటున్నది. ఆమె ప్రశ్నకు నవ్వింది.

సాయంత్రాలు ఆలస్యంగా రావటం వసుధకు ఎప్పుడూ అలవాటే. కాలేజీ అయిపోయాక, లైబ్రరీకి వెళ్ళి ఒక గంటయినా చదువుకుని కానీ ఇంటికి రాదు. ఇప్పుడు క్లినిక్‌లో పనిలో చేరాక తాను సాయంత్రాలు కాదు, రాత్రుళ్ళు ఇంటికి వస్తోంది. అక్కడికీ విజయలక్ష్మి ఎనిమిది గంటలు దాటితే వసుధను కంగారుపెట్టి ఇంటికి పంపించివేస్తుంది.

"నేను పెద్దదాన్ని. ఫర్వాలేదు. చీకటి పడిపోయింది. నువ్వు వెళ్ళిపో" అంటూ తరిమి పంపేస్తుంది. అలా రాత్రుళ్లు ఇంటికి వచ్చే తనని పట్టుకుని 'సాయంత్రాలు అసలు వస్తున్నావా' అంటే ఏమిటర్థం? ఆవిడ గడుసుతనానికి నవ్వు రాదూ!

"మంచిదానివే! నవ్వుతావేం?" అంది ఆవిడ.

"నేను ఉద్యోగం చేస్తున్నానండీ. మీ తమ్ముడిగారి దగ్గర నర్సు ఉద్యోగం. డ్యూటీ చూసుకుని రోజూ ఎనిమిది దాటాక ఇంటికి వస్తున్నాను" నిండిన కూజా తీసుకుని వసుధ తన షెడ్డులోకి వెళ్ళిపోయింది.

తమ్ముడి దగ్గర వసుధకు ఉద్యోగం అనే మాట ఆవిడకెందుకో నచ్చలేదు. దీనిలో ఏమయినా తిరకాసుందా అని ఆవిడ బుర్ర బద్దలు కొట్టుకుని ఆలోచించింది. 'నిజంగా అటువంటిదేమయినా వుంటే వసుధ అంత నిర్భయంగా వాడి దగ్గర పనిచేస్తున్నానని చెప్తుందా? అయినా వసుధ అటువంటి పిల్ల కాదు. మంచిది. ముఖం చూస్తే తెలియటంలేదూ? కాకపోయినా, అందంలో వసుధకూ, రాధకూ సామ్యమే లేదు. తెల్లగా, బొమ్మలా వుండే నా కూతురి ముందు ఈ నల్లపిల్ల సూర్యుడి ముందు దివిటీ కాదా? వాడికేదో పనివాళ్లు అవసరమైవుంటారు. ఈ పిల్లని పెట్టుకున్నాడు. బీదపిల్లకి ఆ మాత్రం సాయం చెయ్యటంలో తప్పులేదు' అనుకుంది ఆవిడ.

ఓ సంవత్సరం గడిచిపోయింది. వసుధ రెండవ సంవత్సరం బికాంలోకి, రాధ ఎనాటమీలోకి వచ్చారు. రవీంద్ర ఇచ్చే జీతంవల్ల బతుకు వసుధను ఇదివరకటిలా భయపెట్టడంలేదు.

★ ★ ★

"ఎనిమిదయిపోయింది వసుధా! ఇంక నువ్వు ఇంటికి వెళ్ళరాదూ? డాక్టరుగారికి నేను 'ఎసిస్ట్' చేస్తాను" అంది విజయలక్ష్మి.

"అది కాదు. డాక్టరుగారిని రేపు సెలవు అడగాలి. ఆయన పని అయ్యేవరకూ వుంటాను" అంది వసుధ.

"పిచ్చిదానా! సెలవు అడగడానికి ఆయన పనయ్యేవరకూ ఎందుకు? లోపల వున్నారు. వెళ్ళి అడుగు. ఈ పేషెంటును పదినిమిషాలు ఆగి పంపుతాలే లోపలకు"

వసుధ బిడియంగానే లోపలకు వెళ్ళింది. క్లినిక్‌లో చేరేక ఆమె ఎప్పుడూ సెలవు అడగలేదు. అవసరంలేదు కూడా. రవీంద్ర తల ఎత్తి చూడకుండానే పేషంటు అనుకుని "కూర్చోండి" అన్నాడు.

"నేను డాక్టరుగారూ!" అంది వసుధ.

క్లినిక్‌లో పనిచెయ్యటం మొదలుపెట్టాక, జీతం వస్తోందికదా అనే ధైర్యంతో నాలుగు మంచి చీరెలు కొనుక్కుంది. నొక్కు



నొక్కుల జుట్టు. పెద్ద పెద్ద కళ్లు, బుల్లి నోరు, లేత గులాబీ చీరెలో ముగ్ధంగా, మనోహరంగా వుంది. అభద్రతా భావం వల్ల కాబోలు సౌమ్యంగా, నెమ్మదిగా వుంటుంది. అతనికి కుర్చీ తోసేసి, లేచి వెళ్ళి అమాంతం ఆమెను కౌగలించుకోవా లనే బలీయమయిన కోరిక కలిగింది.

'అబ్బ! ఇంత దగ్గరగా అన్పిస్తోంది. ఎంత దూరమో!' అనుకున్నాడతను నిట్టూర్చి.

"డాక్టరుగారూ! నాకు రేపు సెలవు కావా లండి"

అతన్ని 'డాక్టరుగారూ' అని పిలవాలని విజయలక్ష్మి నేర్పించింది.

'అలా పిలవద్దు వసుధా! ఆ పిలుపులో మనిద్దరి మధ్యా ఎంతో దూరం వున్నట్టు వుంటుంది నాకు' అనాలనుకుంటాడతను. వసుధ బెదిరి 'అసలు క్లినిక్‌కే రాను పొమ్మం'టుందేమో అని భయపడి ఊరు కుంటాడు.

"నేను రేపు ఊరు వెళ్ళాలి"

గత ఏడాదిన్నరగా ఎక్కడకూ కదలని వసుధ వూరు వెళతాననటం అతనికి విస్మయం కలిగించింది.

"ఏ ఊరు వసుధా!"

"చేబ్రోలు" అంది వసుధ.

ఇవాళ కాలేజీలో వసుధ క్లాసులో ఒక కొత్త అమ్మాయి చేరింది. అసిస్టెంటు ఇంజ నీరుగారి అమ్మాయి. హిందూ కాలేజీ లోనూ, ఏసీ కాలేజీల్లోనూ, మిగిలిన పేరున్న అన్ని కాలేజీలోనూ సీటు కోసం ప్రయత్నించారట. కానీ సంవత్సరం మధ్యలో అవటంవల్ల ఎక్కడా సీటు దొరక లేదు. వసుధ చదివేది ప్రభుత్వ కళాశాల కావటం వల్లనూ, ఆ అమ్మాయి ప్రభుత్వో ద్యోగి కూతురు కావటంవల్లనూ సీటు ఇచ్చి తీరాలి.

ఆ విధంగా వసుధ క్లాసులో చేరిన ఆ అమ్మాయిని ఏ వూరునుండి వచ్చావు అంటే చేబ్రోలు నుండి అని సమాధానం చెప్పింది. ఆ పేరు వినగానే వసుధకు శరీరం పులకిం చిపోయింది. చేబ్రోలు... చేబ్రోలు. తన మోహన్ అన్నయ్యా, నిర్మలక్క నివసించిన వూరు. సిస్టర్ మోడెస్టీనా చెప్పిందికదా 'మీ ఫాదర్ చేబ్రోలునుండి డబ్బు పంపేవారని'. అక్కడికి వెళితే, తాను ఆ ఇంటిని గుర్తుప ట్టగలదు. అసలు ఇన్నాళ్ళూ ఈ ఆలోచన తనకు ఎందుకు కలగలేదా అని వసుధ ఆశ్చర్యపోయింది. తన చిన్ననాటి స్మృతులు ఆమెను చుట్టుముట్టాయి. నిర్మ లక్క తాను వుండగానే వెళ్ళిపోయింది. ఇక ఆమె కనపడుతుందని ఆశలేదు. విదేశాలకు వెళ్ళిన మోహన్ అన్నయ్య స్వదేశానికి తిరి గివచ్చివుంటాడా? ఇప్పుడు సూర్యారావంటే తనకేం భయంలేదు. రజనీ, తనకు అక్షరా భ్యాసం చేసిన నళినీ పెద్దవాళ్ళయివుం టారు. వాళ్ళు అక్కడే వుండివుంటారు. ఒక్కసారి వెళతాను. ఆ ఊరు ఇక్కడికి చాలా దగ్గరట. వెళ్ళి చూసి వస్తే ఏంపో తుంది?

జీవితంలో ఏ మార్పూ లేదు. ఈ నిస్సా రమయిన జీవితంలో ఈ చిన్న 'థ్రిల్'ని ఆమె కోరుకుంది. అక్కడికి వెళ్ళాలనే ఆలో చన కలిగాక ఆమె మనసుకు విశ్రాంతి లేదు.

వసుధ 'చేబ్రోలు' వెళతానంటే రవీంద్ర ఆశ్చర్యం రెట్టింపయింది. సహాధ్యాయులతో కలిసి ఏ మైసూరో వెళుతుందంటే అదో విషయంగానీ, చేబ్రోలులో ఏముంది?

"చేబ్రోలు వెళతావా? ఎందుకు? అక్కడ ఎవరున్నారు? "

అతని ప్రశ్నలకు ఒక్క వాక్యంలో ఆమె దగ్గర సమాధానం లేదు.

"నేను వెళతాను. ఒక్కసారి వెళ్ళొస్తాను"

"సరే! నాకూ అక్కడ స్నేహితులున్నారు. రేపు ఉదయం నా కార్లో వెడదాం సరేనా? "

ఈ ఆఫర్‌కి ఏమని సమాధానం చెప్పాలో వసుధకు తెలియలేదు.

"నేను రేపు ఉదయం కాలేజీకి వెళ్ళాలి.





చేబ్రోలు రేపు సాయంత్రం వెళ్ళాలనుకుంటు న్నాను. మీరు ఉదయం వెళ్ళిపోండి"

"నేను ఎప్పుడు వెళ్ళాలో నాకు తెలుసులే. నీకు రెండవ శనివారం కాలేజీ ఎవరు పెడుతున్నారటా? పొద్దుపోయి పట్నమూ, పల్లెకాని ఆ వూరు వెళ్ళి ఎక్కడుంటావు? సూటిగా చెప్పు. డొంకతిరుగుడుగా మాట్లా డకు"

'నేనేనా వసుధతో ఇలా మాట్లాడింది?' అని ఆశ్చర్యపోయాడతను. వసుధ తప్పు చేసిన దానిలా తలవంచుకుంది.

"సరే ఉదయం మీతోనే వస్తాను".

"బలవంతం ఏంలేదు సుమా!"

"కాదులెండి. మీతోనే వస్తాను"

"దట్స్ రైట్! గుడ్ గర్ల్!"

వసుధ గుమ్మంవరకూ వెళ్ళాక, అతను వెనక్కు పిలిచాడు.

"చూడూ! ఇంట్లో అక్కా వాళ్ళెవరికీ ఈ విషయం చెప్పకు"

వసుధకు మొదటిసారిగా అతనంటే భయం కలిగింది. ఎందుకు ఎవరికీ చెప్పొ ద్దన్నాడు? కానీ ఒకటిన్నర సంవత్సరాలుగా తాను అతన్ని ఎరుగును. డాక్టర్‌గారు ఈజ్ ఎ పెర్‌ఫెక్ట్ జంటిల్‌మేన్. ఆయన ఎన్నడూ, ఎవరితోనూ అసభ్యంగా ప్రవర్తిం చగా తాను చూళ్ళేదు. విజయలక్ష్మి కూడా అంటుంది. 'నీకు తెలీదు వసుధా! హౌస్ సర్జన్లు అయినప్పటినుండీ ఒక్కొక్కడూ యఫ్‌ఆర్‌సియస్‌లా ఫోజు కొడతారు. నర్సుల్ని ఎంత చులకనగా చూస్తారనుకు న్నావు. కామంతో చేతులు పట్టుకునేవాళ్ళు కొందరు. మోహం పేరు చెప్పి ముంచేసే వాళ్ళు కొందరు. వాళ్ళతో మన డాక్టరుగా రికి పోలికా? శ్రీరామచంద్రుడు కదూ ఈయన'

ఏమయినా, రవీంద్రప్రసాద్ చేబ్రోలు వెళ్తోన్న సంగతి ఇంట్లో ఎందుకు చెప్పొద్ద న్నాడో వసుధకు అంతుచిక్కలేదు. తర్వాత వసుధ ఆ విషయం మరిచిపోయింది. 'రేపు చేబ్రోలులో మోహన్ అన్నయ్య కుటుంబం కనిపిస్తుంది' ఆ ఉద్విగ్నతలో ఆమెకు మిగిలిన రాత్రంతా నిద్రపట్టలేదు.

★ ★ ★

ఆ రాత్రి రవీంద్రకు కూడా నిద్రపట్టలేదు. అతనికి పూర్తిగా అర్థం అయింది. తాను వసుధతో తలమునకలుగా ప్రేమలో పడ్డా నని. అందరితోపాటు తాను కూడా రాధే తన భార్య అని నమ్మినమాట నిజమే! రాధ అందమయింది కూడా! వివాహాన్ని వ్యాపా రంగా భావిస్తే రాధను చేసుకోవటం తనకు చాలా లాభదాయకం. మరో మూడు సంవ త్సరాలలో మెడిసిన్ పూర్తిచేసుకుని, ఆమె తనతోపాటు ప్రాక్టీసు చేస్తుంది. తన ఆస్తికి రెండింతలు కట్నంగా తెస్తుంది. చిన్నప్పటి నుండి పెంచుకున్న పెద్దవాళ్ల ఆశలు నెరవే రుతాయి. చుట్టాలు, సమాజమూ తనని గౌరవిస్తారు. కానీ ఆ మనసుందే, ఇదొక పెద్ద కోతి. వసుధను చూసిన క్షణాన వెళ్ళి ఆమె ముంగిట వాలింది. రాధ తనలో ఎన్నడూ కలిగించని అలజడి వసుధ కలి గించింది. ఎప్పుడూ ఆమె సమక్షంలో వుండాలనీ, ఆమెతో మాట్లాడాలనీ, ఆమెను స్పృశించాలనీ వుంటుంది. కానీ, వసుధ నుండి ఎటువంటి ప్రతిస్పందనా లేదు. చొరవ తీసుకుని 'వసుధా! నువ్వంటే నాకిష్టం పెళ్ళి చేసుకుందామా?' అని అడ గాలని చాలాసార్లు అనుకున్నాడు. వసుధ బెదిరిపోతుందేమో! ఇష్టంలేదని చెబుతుం దేమో! అక్కగారి షెడ్డు, తన దగ్గర ఉద్యో గమూ వదిలేస్తుందేమోనని సవాలక్ష సందే హాలు. అక్కా, ఆమె కుటుంబం వసుధను తప్పుపట్టి నిందిస్తారేమో! షెడ్‌లోనుండి వెళ్ళగొడితే, ఆమె మళ్ళీ ఇంటికోసం వెతు క్కోవాలంటే ఈ పట్టణంలో ఎంత కష్టం! వసుధకు ఉద్యోగం దొరికేవరకూ నిరీక్షిం చటం మంచిదేమో! అసలు ఆమెకు తనంటే ఎటువంటి అభిప్రాయం వుందో! 'కలలనైన నిన్ను కనుల చూతమన్న, నిదురరాని నాకు

కలలు కూడా రావే!' అని ఎన్నిమార్లు పాడుకున్నాడో, అంత ప్రాక్టికల్ మనిషీ ఎంతో భావుకంగా.

★ ★ ★

ఉదయం స్నానం చేసి తెల్లప్యాంటులో, లేత నీలంరంగు చొక్కా టక్ చేసుకున్నాడు. దువ్విన జుట్టునే పదేపదే దువ్వుకున్నాడు. 'ఎంత బావున్నానో! వసుధ-యు ఆర్ లుకింగ్ వెరీ హ్యాండ్‌సమ్ రవీ! ఐలవ్ యూ అనకూడదూ' అనుకుని నవ్వుకున్నాడు. వసుధ ఎనిమిది గంటలకల్లా క్లినిక్‌కి వచ్చేసింది. అదృష్టవశాత్తూ, భవానమ్మ గారి కుటుంబసభ్యులెవ్వరూ ఎదురుపడలేదు. అందువల్ల వసుధకు అబద్ధం ఆడవలసిన అవసరం కలగలేదు. ఆమె వచ్చేసరికి రవీంద్ర క్లినిక్ బయట కారులో కూర్చుని ఎదురుచూస్తున్నాడు.

ఆమె తడబడుతూ కారు వెనుక తలుపు తీయబోయింది.

అతను వంగి ముందు తలుపుతీసి, "కమాన్! ఎక్కు" అన్నాడు.

వసుధ కారెక్కి ధడాల్న తలుపు వేసింది.

"అబ్బ! చెవులు పగిలిపోయాయి" అన్నాడతను.

వసుధ ఒదిగి ఒదిగి తలుపుకు ఆనుకుని కూర్చుంది. అతనికి ఎడమచేయి సాచి, ఆ చేతివంపులో వసుధ తలపెట్టుకుంటే 'డ్రైవ్' చేయాలని వుంది. చేయి చాస్తే, వసుధ కారు దిగి వెళ్ళిపోతుందని తెలుసు. కారు ఊరి పొలిమేర దాటేవరకు అతను ఏమీ మాట్లాడలేదు. దాటాక అన్నాడు.

"వసుధా! నీవైపు తలుపు లాక్ చేసుకోలేదు"

వసుధ అర్థం కానట్టు చూసింది.

"ఆ హ్యాండిల్‌ని కిందకి నొక్కు. డోర్ లాక్ అవుతుంది"

వసుధకు జీవితంలో కారు ఎక్కటం అది మొదటిసారి. అందువల్ల అతను చెప్పింది అర్థంకాక హ్యాండిల్‌ని పైకి తిప్పింది. వెంటనే కారు తలుపు తెరుచుకుంది.

"మైగాడ్!" అంటూ కారు ఆపేశాడు. ఆమె బిక్కముఖం పెట్టింది. అతను నవ్వి, "నువ్వు కూర్చో వసుధా! నేను వేస్తాను" అని ఆమె కూర్చున్నాక చుట్టు తిరిగి వచ్చి తలుపు లాక్ చేశాడు.

"నా సీటులో కూర్చుని కూడా వంగి నీ తలుపు లాక్ చెయ్యొచ్చు కానీ నువ్వు నన్ను రాక్షసుడిని చూసినట్టు చూస్తావేమోనని భయం"

వసుధ తల వంచుకుంది.

"అవును వసుధా! ఆడపిల్లలకు, ముఖ్యంగా నీ పరిస్థితిలో వున్న ఆడపిల్లలకు జాగ్రత్త చాలా అవసరం. కానీ కనిపించిన ప్రతి మగవాడినీ కీచకుడిని చూసినట్టు చూడనవసరంలేదు. నువ్వు వెనకసీటులో కూర్చోబోతే, నేను ముందు సీటులో కూర్చోబెట్టేనని నామీద అనుమానంగా వుంది కదూ!"

'కాదు' అన్నట్టు వసుధ గబగబా తలతిప్పింది.

"అబద్ధం ఆడొద్దు. అనుమానం వచ్చింది. కానీ యజమాని కారు నడుపుతున్నప్పుడు ముందుసీట్లో కూర్చోవటం మర్యాద. డ్రైవర్ కారు నడుపుతోంటే యజమానులు, లేదా వారి అతిథులు వెనక సీట్లో కూర్చోవచ్చు. కానీ నేను నీ డ్రైవర్‌ని కాదుగదా, అందువల్ల ముందుకొచ్చి కూర్చోమన్నాను" వసుధ సిగ్గుతో చితికిపోయింది.

"నేను బీదదాన్నండీ. ఎప్పుడూ కారు ఎక్కలేదు. అందువల్ల. నాకు తెలియదు. క్షమించండి" అంది నిజమయిన పశ్చాత్తాపంతో.

"చూడు. ఆ కారు తలుపుని ఆనుకుని ఎట్లా కూర్చున్నావో. ఎవరయినా చూస్తే నేను నిన్ను కిడ్నాప్ చేసుకుపోతున్నానను కుంటారు. అవునా?"

వసుధ కొంచెం అతనివైపుకి జరిగి కూర్చుంది.




'భగవంతుడా! నాకు నిగ్రహాన్ని ఇవ్వు. ఈ అమ్మాయికి నామీద వున్న మంచి అభిప్రాయాన్ని పోగొట్టకు' అని ప్రార్థించాడు రవీంద్ర.

కారు చేబ్రోలు వచ్చాక అంది వసుధ.

"మీరు మీ స్నేహితుల ఇంటికి వెళ్ళండి. నేను వెళ్ళవలసినచోటుకు వెళ్ళి వచ్చేస్తాను"

రవీంద్ర నవ్వేశాడు.

"ఎక్కడికి వచ్చేస్తావు వసుధా! ఇక్కడ, ఈ ఊళ్లో నాకెవరూ స్నేహితులూ, చుట్టాలూ లేరు. నిన్ను తీసుకురావటం కోసమే నేను వచ్చాను"

'ఊహించాను సుమా!' అన్నట్టు చూసింది వసుధ.

"మీకొక రహస్యం చెప్పనా? నాకు ఎవరూ లేరు"

"మరెందుకు వచ్చినట్టు?"

"ఇక్కడ నేను ఒక ఇల్లు వెతకాలి"

అతను ఎందుకు? అని అడగలేదు.

"వెతుకు. అడ్రెస్సు ఉందా?"

"లేదండీ. నా దగ్గర అడ్రెసు లేదు. ఊరంతా తిరిగి ఆ ఇంటిని నేను వెతకాలి"

"పోనీ, ఆ ఇల్లు ఏ ప్రాంతంలో ఉందో తెలుసా?"

"ఊహూ! తెలియదు. ఆ ఇంటిముందు ఒక చర్చి ఉంటుంది. ఆ ఇంటికి నాలుగయిదు వీధుల తర్వాత రాముడి కోవెల ఉంటుంది. ఆ కోవెల వెనక సందులో ఒక చిన్న పిల్లల ఆసుపత్రి...."

ఇంకా ఏం చెప్పేదో కానీ వసుధ అతని ముఖం చూసి ఆగిపోయింది.

"ఇవేనా గుర్తులు?"

"అందుకే నేను ఒంటరిగా వస్తానన్నాను"

"ఇప్పుడు నేనేం అన్నాను వసుధా? ఈ గుర్తులతో ఆ ఇల్లు దొరుకుతుందని నేను అనుకోను. ఎలాగూ వచ్చేంకదా! ఇద్దరం కలిసి వెదుకుదాం" అతను కారును ఒక బ్యాంకుముందు ఆపి లాక్ చేశాడు. ఇద్దరూ కలిసి నడక మొదలు పెట్టేరు. ఎవరు ఎవరిని చప్పట్లు కొట్టి పిలిచినా, తనను ఎవరయినా గుర్తుపట్టి పిలుస్తున్నారేమోనని భ్రమతో వసుధ తిరిగి తిరిగి చూసింది.

చేబ్రోలు వదిలేసరికి తాను బాలికననీ, ఇప్పుడు యువతిగా పరిణితి చెందానని, ఎదురుగా వచ్చినా తనను గుర్తు పట్టడం కష్టమనీ, అటువంటిది వెనుకనుండి చూసి ఎవరో గుర్తుపట్టి చప్పట్లు కొట్టడం అసంభవం అనీ ఆమెకు స్ఫురించలేదు. రవీంద్ర కనిపించిన వాడినల్లా చర్చికోసం అడిగాడు.

'ఏ చర్చి? పెంతెకోస్తులదా? కేథలిక్కులదా?' అనడిగేవాళ్ళు. దీనికి నీ సమాధానం ఏమిటన్నట్టు అతను వసుధకేసి చూశాడు. ఆమె నిరుత్తరురాలై తలవంచుకుంది. రామమందిరం అయితే ఎవరికీ తెలియనే లేదు. వసుధ పుణ్యమా అని ఊరంతా తిరుగుతుంటే ఒక కొలను మధ్యలో అందమయిన గుడి ఒకటి కనిపించింది. ఆ అందానికి ముగ్ధుడైపోయి రవీంద్ర,

"ఇదేం గుడి వసుధా" అనడిగాడు అదేదో వసుధ స్వంత ఊరయినట్టు, అందులోని విశేషాలన్నీ ఆమెకు తెలిసినట్టు.

"తెలీదండీ!" అంది వసుధ.

దారినపోయే దానయ్యను ఎవరినో అడిగితే, 'బ్రహ్మగుడి. మా ఊళ్లో తప్ప దేశంలో మరెక్కడా లేదు తెలుసా!' అని సమాధానం చెప్పాడు. రోడ్డుమీదనుండి మెట్లగుండా కిందకు దిగితే ఎదురుగా అద్భుతమయిన గుడి. చుట్టూ నీరు.

"ఫెంటాస్టిక్! అద్భుతం వసుధా! దీనికి నువ్వు చెప్పే ఇల్లు ఎంత దూరంలో వుండి వుంటుంది?"

తన ఆదుర్దాలో తానుండి ఆ గుడి అందాన్ని అతనిలా ఆమె ఆనందించలేకపోతోంది. అతని ప్రశ్నకు వసుధ అయోమయంగా చూసింది.

"నేనెప్పుడూ ఈ గుడిని చూడలేదు" అంది.

అతను ఆశ్చర్యపోయాడు. రామమందిరం, చర్చి, ఆసుపత్రి ఇన్ని గుర్తున్న వసుధకు అసాధారణమయిన ఈ గుడి గుర్తు లేకపోవడం విచిత్రమే!

"సరే వసుధా! మన పరిశోధనను ఒక అరగంట వాయిదా వేద్దాం. ఆకలి వేస్తోంది. భోజనం చేద్దాం పద"

ఇద్దరూ హోటలుకు వెళ్లారు. వసుధ ఏమీ తినలేకపోయింది. ఆమె మనసులోని బాధ ఏమిటో, ఆమెకు ఆ ఇల్లు ఎందుకు కావాలో అతనికి తెలియలేదు.

"మీరు కారులో కాసేపు పడుకోండి. నేను వెతికి వస్తాను" అంది వసుధ నాలుగయిదుసార్లు.

"డోంట్ బీ ఫూలిష్ వసుధా" అన్నాడతను.

ఇద్దరూ మళ్ళీ రోడ్లు సర్వే చేయటం మొదలుపెట్టేరు. వసుధలోని వుత్సాహమంతా నీరు కారిపోయింది.

మధ్యాహ్నం భోజనం చెయ్యని కారణంగా ఆమె ముఖంలో నీరసం గోచరించింది.

"వసుధా! చూడు. చీకటిపడుతోంది. మనం ఇక వెనక్కు బయలుదేరితే మంచిది. కావాలంటే మళ్ళీ ఇంకోసారి వద్దాం. సరేనా? " అన్నాడు రవీంద్ర చిన్నపిల్లకు నచ్చచెపుతోన్న ధోరణిలో.

తల ఊపింది వసుధ. అంతకంటే ప్రస్తుతం చేయగలిగింది ఏమీలేదు. ఇద్దరూ కారెక్కారు. కారు చేబ్రోలు పొలిమేర దాటుతోండగా వంగి, వెనక్కు తిరిగి ఆ ఊరిని చూసింది వసుధ. సిస్టర్ మోడెస్టీనా చేబ్రోలులో మీ ఫాదర్ వుంటాడని చెప్పినప్పుడు ఆ ఊరిలో ఆ ఇంటిని గుర్తుపట్టలేనా? నా బాల్యమంతా అక్కడే గడిచిందికదా! అనుకుంది. కానీ, ఎక్కడుంది ఆ ఇల్లు? ఎక్కడున్నారు నా మనుష్యులు? వసుధ దుఃఖంతో వివశురాలయిపోయింది. రవీంద్ర కారు ఆపేశాడు. ఆమెను దగ్గరకు తీసుకుని ఓదార్చాలని చాలా బలంగా అనిపించింది. కానీ అప్పటివరకూ వున్న అతని నిగ్రహంమీద అతనికి నమ్మకం పోయింది. ఆమెను స్పృశించటం జరిగితే, తాను అక్కడితో ఆగగలడో లేదో అని తన మీద తనకే అనుమానం కలిగింది. అలా జరిగిన పక్షంలో వసుధ తన పరిస్థితిని డాక్టర్ 'అన్‌డ్యూ ఎడ్వాంటేజిగా' తీసుకున్నాడనుకుంటుందేమో, తనపట్ల ఆమెకేమైనా మంచి అభిప్రాయం వుంటే ఈ సంఘటనతో తుడిచిపెట్టుకు పోతుందని భయం వేసింది. ఆమె ఏడుస్తున్నంతసేపూ అతను కళ్లు మూసుకుని, కళ్ళాలు తెంపుకుని పరుగెత్తుతున్న గుర్రంలాంటి తన మనసుని అదుపులోకి తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ వున్నాడు. చాలాసేపటికి వసుధ తనను తాను సంభాళించుకుంది.

"వెళదాం డాక్టరుగారూ" అంది ముక్కు చీది, కళ్ళు తుడుచుకుంటూ. అతను కారు స్టార్ట్ చేశాడు. అప్పుడు అడిగేడు.

"వసుధా! నీచుట్టూ ఎందుకింత మిస్టరీ? నువ్వు ఎవరి కోసం వచ్చేవో నేను తెలుసుకోకూడదా? "

"అయ్యో! ఇందులో మిస్టరీ ఏంలేదు డాక్టర్‌గారూ! ఇటీజ్ ఎ డిస్‌గస్టింగ్ స్టోరీ. మీకు విసుగ్గా వుంటుంది"

"అది చెప్పాల్సింది నేను. నువ్వు కాదు"

"నాకూ నా బాధ ఎవరితోనయినా పంచుకోవాలనే వుంటుంది"

"ఓహో! నీక్కూడా అలా ఉంటుందన్న మాట"

చీకట్లో ఆమె తనకేసి తీవ్రంగా చూసిందని అతను గమనించలేదు.

"నీకు అభ్యంతరం లేకపోతే నాకు చెప్పు వసుధా! నేనేమైనా సహాయం చెయ్యగలనేమో!" అతను మనస్ఫూర్తిగా అన్నాడు.

"ఇందులో ఎవ్వరూ నాకు సహాయం చెయ్యగలిగిందేమీ లేదు. ఊరికే నా మనసులో దిగులు మరిచిపోవటానికి ఇదంతా చెపుతున్నాను"





"పోనీ అలాగే అనుకుని చెప్పు"

"........."

"ఏమాలోచిస్తున్నావు వసుధా?"

"ఎక్కడ మొదలుపెట్టి చెప్పటమా అని ఆలోచిస్తున్నాను. సరే మొదటినుండీ చెప్తాను. మీకు ఎప్పుడు విసుగనిపిస్తే అప్పుడు మొహమాటపడకుండా చెప్పేయ్యాలి"

"అలాగేలే. నువ్వు మొదలుపెట్టు"

"నాకు ఎవరూ లేరు"

ఇదివరకు కూడా ఈమాట చెప్పావు అనుకున్నాడతను.

"మా అమ్మా నాన్నా ఎవరో, నన్ను వాళ్లు ఎందుకు వదిలేశారో, లేక నన్ను ఎవరయినా ఎత్తుకెళ్లారో, ఏమో! మొత్తానికి నాకు ఊహ తెలిసేనాటికి నన్ను చంద్రమ్మ అనే ఆవిడ పెంచుతుండేది"

"ఆవిడే మీ అమ్మేమో!"

"ఊహూ! కాదు. ఆవిడను నేను అత్తా అని పిలిచేదానిని అని నాకు బాగా గుర్తు. ఏమయినా ఆవిడకూ, నాకూ రక్తసంబంధం ఉందని నేను అనుకోను. మొత్తానికి ఆవిడ నన్ను నా పది సంవత్సరాల వయసప్పుడనుకుంటా- ఈ చేబ్రోలో, మరే వూరో తెచ్చి ఒక ఇంటిలో పనిపిల్లగా కుదిర్చింది. ఆ ఇంటి యజమాని- అంత మంచివాడు కాదు. ఆయనకు ముగ్గురు మగపిల్లలు. అందులో ఆఖరివాళ్లు ఇద్దరూ కవలపిల్లలు. రజనీకాంత్, నళినీకాంత్ వాళ్ల పేర్లు. వీళ్లల్లో నళిని నాకు చదువు చెప్పటం మొదలు పెట్టాడు. అతను ఆనాడు నా చదువుకు బీజం వేశాడు. అతని దయవల్లనే నేను ఇప్పుడు బీకాం చదువుతున్నానని నా నమ్మకం. ఆ కవలలు ఇద్దరూ కూడా నాకంటే నాలుగయిదు సంవత్సరాలు పెద్దవాళ్లయి ఉండొచ్చు. విసుగ్గా ఉందా డాక్టరు గారూ!"

బయట చీకటిగా ఉంది. ఇవాళంతా కలిసి తిరగటంవల్ల వసుధ అతనికి దగ్గరదానిలా తోచింది. ఆమె కూడా తనని ఆత్మీయంగా భావిస్తూ ఉండివుండవచ్చు. అందువల్లనే ఈ రాత్రి తన కథను విన్పిస్తోంది. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని,

"వసుధా! నా పేరు రవీంద్రప్రసాద్. నువ్వు నన్ను రవీంద్ర అని పిలవచ్చు. కొందరు ప్రసాద్ అంటారు. అలాగూ పిలవచ్చు" అన్నాడు.

వసుధ నవ్వింది.

"సరే. సరే. చెప్పు"

"ఈ అన్నదమ్ముల్లో పెద్దవాడు మోహన్ అన్నయ్య. ఆయన పేరే రికార్డుల్లో నా తండ్రిగా నమోదయివుంది"

"అదేమిటి?" అని ఆశ్చర్యపోయాడు.

అది తర్వాత చెప్తాను. కవలలిద్దరినీ నేను ఒక్కొక్కసారి పేరుతో పిలిచేదాన్ని. ఒక్కొక్కసారి అన్నయ్య అని పిలిచేదాన్ని. కానీ మోహన్ అన్నయ్య నాకంటే చాలా పెద్ద కావడంచేత ఆయన్ని మాత్రం ఎప్పుడూ అన్నయ్య అని పిలిచేదాన్ని. ఆ ఇంటిలో నన్ను చంద్రమ్మత్త వదిలేనాటికి నేను ఒక అగ్లీ డక్‌లింగ్‌ని"

ఈ వర్ణనకు రవీంద్ర పెద్దగా నవ్వేశాడు.

"ఎందుకు డా... రవీంద్రగారూ? నవ్వుతున్నారు? ఇప్పటికీ అగ్లీ డక్‌నే అని కదూ!" అంది కొంచెం అలకగా.

"ఛ! కాదు వసుధా! పార్వతీదేవిలా నలుపే కానీ నీ ముఖంలో గొప్ప పవిత్రత వుంది. ఇది పొగడ్త కాదు. నిన్ను చూసిన వెంటనే నేను రాధతో అన్నాను. కావాలంటే చెక్ చేసుకో"

"నేను తలనిండా పేలతో, చాలా మురికిగా వుండేదాన్ని. గుడిసెల్లో పెరిగి, పరిగ ఏరుకునేదాన్ని. మరి ఎలా వుంటాను? ఆ ఇంటి మేడమీద నిర్మలక్క అని ఒక దేవత వుండేది. అప్పుడు నేను చాలా చిన్నదాన్ని. నాకు ఏమీ తెలియదు. ఆమె, మోహన్ అన్నయ్య ఒకరినొకరు కోరుకున్నారేమోనని ఇప్పుడనుకుంటున్నాను"

"ఓసి పిచ్చిదానా! ఇప్పుడు నువ్వు చాలా పెద్దదానివి అనుకుంటున్నావా! గత ఏడాది న్నరగా నేను నిన్ను కోరుకుంటున్నాను. నీకేమైనా తెలిసిందా? " అనుకున్నాడు రవీంద్ర స్వగతంలో.

"అయితే ఆమెకూ, ఆయనకు పెళ్లి జరగలేదు. ఆ వివరాలన్నీ నాకు చాలా అస్పష్టంగా గుర్తున్నాయి. ఖచ్చితంగా ఏం జరిగిందో ఇప్పుడు నేను చెప్పలేను. ఉన్నట్టుండి, ఒకరోజు ఆమె వెళ్ళిపోయింది. తర్వాత కొద్దిరోజులకు మోహనన్నయ్యా పెళ్లి జరిగింది. ఆ పెళ్లికూతురి పేరు నాకు గుర్తులేదు. కానీ చాలా అందమయినది. మోహనన్నయ్యా, ఆమె ప్రేమగా వున్నట్టు నాకు గుర్తులేదు. ఈమెతోకంటే నిర్మలక్కతోనే ఆయన సంతోషంగా గడిపారు. ఏమయినా ఆవిడ కూడా చాలా త్వరలోనే వెళ్ళిపోయింది. ఆ ఇంట్లో ఒక వంటమనిషి, ఆ ఇంటి యజమాని కొంత అసభ్యంగా ప్రవర్తించేవాళ్ళు. నాతో కాళ్ళు పిసికించుకోవటం, ఒళ్ళు పట్టించుకోవటంలాంటి చెత్త చెత్త పనులన్నీ చేయించేవాళ్లు. మోహన్ అన్నయ్యా అందుకనో, మరెందుకనో తెలియదు నన్ను అక్కడినుండి తీసుకువచ్చేసి కైలాసపురం మిషనరీలో చేర్పించాడు. నాకు తల్లీ తండ్రీ లేనిలోటు ఆ ఇంట్లో వుండగా కలగలేదు. నిర్మలక్క తల్లిలా ఆదరించింది. మోహనన్నయ్య నన్ను కైలాసపురంలో చేర్చే ముందు ఎన్ని బుద్ధులు చెప్పారని. మీరు నమ్మరు రవీంద్రా. సారీ! రవీంద్రగారూ! ఒక తండ్రి... తండ్రేమిటి తల్లి కూడా కూతురికి అన్ని విషయాలు అంత వివరంగా బోధించదు. నా మట్టిబుర్రకి అప్పుడు అది పూర్తిగా ఎక్కలేదు. అది వేరే విషయం. కైలాసపురం మిషనరీలో చేర్చిన అన్నయ్య అనాథశరణాలయంలో చేర్చలేదు నన్ను. నేనేదో పెద్ద రాజకుమారిలాగ హాస్టల్లో చేర్చాడు. అయిదు సంవత్సరాల పాటు ఫీజులు, నా ఖర్చులకు డబ్బులు పంపాడట. తర్వాత విదేశాలకు వెళ్ళిపోతున్నాను. వసుధకు ఇవ్వండి అని నా పేర కొంత డబ్బు పంపాడు. అదే నేను ఆఖరుగా ఆయన గురించి వినడం"

"మరి ఆయన పేరు నీ తండ్రిగా ఎలా రికార్డుచేశారు? " రవీంద్ర సందేహం వెలిబుచ్చాడు.

"అప్పుడు ఈ బర్త్ సర్టిఫికెట్లు అవీ ఇంత స్ట్రిక్ట్‌గా వున్నట్టులేవు. మిషనరీలో ఒక ఫారం ఇచ్చారు. దానిలో ఆయన నా వయసు కొంత తగ్గించి వేశారు ఎందుకయినా మంచిదని. తండ్రి ఉన్నచోట తన పేరు రాసి, సంతకం చేశారు. సిస్టర్ మోడెస్టీనా అని, నా వ్యవహారాలన్నీ చూసేవారు. ఆమె అన్నారట కూడా అన్నయ్యతో, మాకు అనాథ శరణాలయం వుంది. వసుధను అందులో వేద్దాం అని. దానికి అన్నయ్యా 'వసుధ తాను అనాథగా భావించుకోవడం నాకిష్టంలేదు. నేనే దానికి తండ్రిని' అన్నాడట. ఇవన్నీ నాకు తెలియవు. ఆమె చెప్పారు"

"అయితే వసుధా! మనం కైలాసపురం వెళ్ళి మీ అన్నయ్యా అడ్రస్ ఆమెనెందుకు అడగకూడదూ? "

"అయ్యో! నాకు అంత అదృష్టం కూడానా? నేను ఇంటర్‌లో వుండగానే ఆమె చనిపోయింది. పోయేముందు మోహన్ అన్నయ్యది చేబ్రోలని ఆమే చెప్పింది"

"భలేదానివి వసుధా! ఆంధ్రదేశంలో ఇదొక్కటేనా చేబ్రోలు. నాలుగో, అయిదో వుండివుంటాయి. నాకు తెలిసి ఇది కాక తూర్పుగోదావరి జిల్లాలో ఒకటి, పశ్చిమగోదావరిలో ఒకటీ వుంది" వసుధ నిరాశగా పెదవి విరిచింది.

"నా వయసు అప్పుడు పదీ, పదకొండు సంవత్సరాలకంటే ఎక్కువ వుండదు రవీంద్రగారూ! తెలిసీ తెలియని వయసు. దానికితోడు మోహన్ అన్నయ్యను విడిచివెళ్ళ




న్నాను అనే దిగులుతో దారిపొడవునా ఏడుస్తూనే వున్నాను. కొంతసేపు నిద్రపోయాను. ఎన్నిమైళ్ళు ప్రయాణంచేసిందీ లేక ఎంతసేపు ప్రయాణం చేసిందీ ఏమీ గుర్తు లేదు. ఇక జన్మలో ఆయన్ని చూడలేను" వసుధ మళ్ళీ ఏడవడం మొదలుపెట్టింది.

అతనికి వసుధను ఓదార్చాలని గాఢంగా అన్పించింది. 'అయ్యో! ఇంత చిన్న వయసులో ఎన్నికష్టాలు పడింది అని జాలికలిగింది. దగ్గరకు జరిగి ఆమెను తాకేందుకు కూడా అతను సాహసించలేకపోయాడు.

వాళ్ళు గుంటూరు చేరేసరికి రాత్రి పది గంటలయింది. కారు క్లినిక్ మీదుగా వస్తోంటే రవీంద్ర గమనించాడు. ఆసుపత్రి వరండాలో చాలామంది మనుష్యులు అటూ ఇటూ తిరుగుతున్నారు. క్లినిక్‌నిండా లైట్లు వెలుగుతున్నాయి. 'ఏమయివుంటుందో' అతనికి అర్థంకాలేదు. 'ఇన్ పేషెంట్లు ఎవరికయినా సీరియస్ అయిందా? లేక బయటినుండి ఏమయినా ఎమర్జెన్సీ కేసు వచ్చిందా?' అనుకుని అతను కారు ఆపేశాడు.

"ఎక్స్క్యూజ్‌మీ వసుధా! ఒక్క నిమిషం. ఏమిటో చూసి వస్తాను. నువ్వు కారులోనే వుండు" కారు ఆసుపత్రికి కొంచెం దూరంలో వదిలి అతను ఆసుపత్రిలోకి వెళ్ళాడు. పదిహేను నిమిషాలయింది. ఇరవై నిమిషాలయింది. అరగంటయింది. ఒక్క నిమిషంలో వస్తానన్న రవీంద్ర జాడ లేదు. సందేహిస్తూనే కారు దిగి, తానూ ఆసుపత్రిలోకి వెళ్ళింది వసుధ.

నర్సు విజయలక్ష్మి, మేల్ నర్సు ఆనందరావూ ఇద్దరూ వసుధను ఆ సమయంలో అక్కడ చూసి ఆశ్చర్యపోయారు.

"నీకెలా తెలిసింది? " అంది విజయలక్ష్మి.

"ఏమిటి తెలిసింది? " అని ఎదురు ప్రశ్న వేసింది వసుధ.

"ఏమీ తెలియకుండా ఆసుపత్రికి ఎలా వచ్చావు? "

ఈ ప్రశ్నకు వసుధ తడబడింది. ఉదయంనుండీ ఇప్పటివరకూ డాక్టరుగారూ, నేనూ పొరుగూరిలో తిరుగుతున్నాం అని చెప్పటానికి ఇష్టం లేకపోయింది.

"అదా? నేను స్నేహితురాలితో సినిమాకు వెళ్ళొస్తున్నాను. ఆసుపత్రి అంతా లైట్లు వెలుగుతున్నాయి. వరండా అంతా మనుష్యులు. ఏమిటో చూద్దామని వచ్చాను"

తర్వాత వసుధ తనను తాను గట్టిగా విమర్శించుకుంది. 'నేను చేసింది తప్పు అని నేను నమ్ముతున్నాను కాబట్టే విజయలక్ష్మి వంటి మంచిమనిషి దగ్గర కూడా అబద్ధం చెప్పాను. తప్పు కాకపోతే నిజం చెప్పడానికి నాకు భయం దేనికీ? ఏమయినా డాక్టరు గారితో నేను చనువు తగ్గించుకోవాలి' అనుకుంది. కానీ నిజానికి వసుధ చనువు తగ్గించుకోవాల్సింది డాక్టరుగారితోకాదు. ఆయన ఆ క్షణాన 'ఎటెండ్' అవుతున్న పేషంటుతో అనే విషయం అప్పుడు ఆమెకు తెలియదు.

విజయలక్ష్మి చెప్పింది.

"ఏదో పోలీసు కేసనుకుంటా. ఒళ్ళంతా తుపాకీ గాయాలు. ఆ కమ్యూనిస్టు భాస్కరంలేడూ. అతను తీసుకొచ్చి ఇక్కడ పడేశాడు. డాక్టరుగారు లేరు, గవర్నమెంటు ఆసుపత్రికి తీసుకుపోరా నాయనా! అంటే వింటాడా ఏమన్నానా? ఇంకో పదిమందిని వేసుకొచ్చి పేచీ అదుగో ఇంకా అక్కడే వున్నారు మాయదారి ముఠా అంతా ఇంతలో డాక్టరుగారు ఇటుగా కారులోవెళుతూ, ఈ లైట్లేమిటి, ఈ హడావిడి ఏమిటీ అని వచ్చారు. తీరావస్తే ఇదీ గొడవ. అదుగో ఆపరేషను థియేటర్‌లో వున్నారు. ఇప్పటివరకూ నేనూ అక్కడే వున్నాను. ఎలాగూ వచ్చావుగా వుండు. ఏమయినా అవసరం ఉంటుందేమో"

"అమ్మో! పది దాటింది. ఇప్పటికే భవానమ్మగారు గేట్లు వేసేసి వుంటారు. అదేదో నువ్వే చూసుకో. నేను వెళ్తాను"

"సరే వెళ్ళు. నువ్వుండి చేసేది మాత్రం ఏముందిలే. అదెలాగూ బతికే కేసుకాదు" అని నిట్టూర్చింది విజయలక్ష్మి.



ఉదయం ఆరయినా అయ్యిందో లేదో రవీంద్రప్రసాద్ భవానమ్మ ఇంట్లో ప్రత్యక్షం అయ్యాడు. రాత్రి వసుధను కారులో వదిలేశాక ఆమె ఏమయిందో అతనికి తెలియ లేదు. కమ్యూనిస్టు భాస్కరం ఒళ్ళంతా తుపాకీ గాయాలతో తెచ్చిపడేసింది ఎవరినో కాదు తన ప్రాణ స్నేహితుడు కృష్ణమోహన్‌ని.

వాడిని ఆ స్థితిలో చూశాక తనకి మతి పోయింది. బయట వసుధ ఉందన్న స్పృహలేదు. వాడికి ఆపరేషన్ పూర్తయి తను బయటకు వచ్చేసరికి తెల్లవారు ఝాము మూడుగంటలయింది. తన క్లినిక్‌లో విజయలక్ష్మికాక భాస్కరంవాళ్ళ సింపథైజర్స్ నలుగురయిదుగురు నర్సుల్ని ఎరేంజ్ చేశాడు. వాళ్లయినా ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు వంతులవారీగా తనకు 'ఎసిస్ట్' చేశారు కానీ తాను మరే డాక్టరు సహాయమూ అర్థించడానికి వీల్లేని పరిస్థితి.

మధ్యమధ్య ఆక్సిజన్, బ్లడ్ అంటూ అరవడం తప్ప రాత్రిపూట... ఆడపిల్ల ఒంటరిగా కారులో ఉండిపోయిందన్న జ్ఞాపకమే లేదు. మూడుగంటలకి బయటకు వచ్చి కారు చూశాక కానీ వసుధ గుర్తుకురాలేదు. గబగబా వెళ్ళి కారు తీసి చూశాడు. వసుధ లేదు. ఉంటుందని కూడా తను అనుకోలేదు. ఎంత భయం వేసిందంటే అప్పటికప్పుడు అక్కగారి ఇంటికివెళ్ళి వసుధ క్షేమంగా చేరిందో లేదో చెక్ చేసుకోవాలని ఆరాటపడ్డాడు. కానీ ఆ అర్థరాత్రి సమయంలో అక్కగారి క్రాస్ ఎగ్జామినేషన్ తట్టుకునే శక్తిలేక అయిష్టంగానే ఇంటికి వెళ్ళిపోయాడు.

అతను విజయలక్ష్మిని అడిగివుంటే ఆమె వసుధ వచ్చి వెళ్ళిందని చెప్పి ఉండేది. కానీ ఆమెను అడగాలని ఆలోచన ఎందుకు వస్తుందసలు? అక్కడికీ అతని కంగారు చూసి విజయలక్ష్మి 'ఎనీథింగ్ రాంగ్ డాక్టర్' అని అడిగింది. అతను తేలుకుట్టిన దొంగ చందాన 'నథింగ్' అంటే ఆమెదా తప్పు? ఇంటికి వచ్చి పడుకున్నాడన్న మాటేకానీ నిద్రపట్టలేదు. ఒక పక్క కృష్ణ బతుకుతాడో లేదో దిగులు, రెండవపక్క వసుధ క్షేమంగా చేరిందోలేదో అని బెంగ. నిమిషాలు లెక్క పెడుతూ కూర్చుని ఆరుగంటలు కాగానే పరుగెత్తుకొచ్చి ఇక్కడ వాలాడు.

రవీంద్ర డ్రాయింగ్ రూంలో కూర్చుని బావగారితో మాట్లాడుతున్నాడన్నమాటేకానీ అతని కళ్లన్నీ దొడ్లోని పంపువైపే వున్నాయి. అతని నిరీక్షణ అరగంట తర్వాత ఫలించింది. వసుధ కూజా తీసుకుని నీళ్ళకోసం వచ్చింది.

'బతికానురా దేవుడా! షి ఈజ్ సేఫ్' అనుకున్నాడు విశ్రాంతిగా సోఫాలో వెనక్కువాలి. నరసింహారావు బావమరిది అనిశ్చిత స్థితిని, ఇప్పటి రిలీఫ్‌నీ అన్నింటినీ గమనిస్తూనే వున్నాడు. బావమరిది దృష్టి సారించినవైపే తానూ దృష్టి మరల్చి వసుధను




చూశాడు. 'రాధకు త్వరగా పెళ్ళి చేసేస్తే మంచిది' అనుకున్నాడు.

★ ★ ★

హాస్పిటల్‌కి వెళ్ళి రవీంద్ర స్నేహితుడిని చూసుకున్నాడు. రక్తం చాలా పోయింది. కానీ గండం గడిచింది. విజయలక్ష్మి నిజంగా చాలా బాధ్యతగల నర్సు. అప్పటికే ఆసుపత్రికి వచ్చివుంది. ఆమె వస్తే అతనికి నిశ్చింత.

"విజయలక్ష్మీ! నాకు రాత్రంతా నిద్ర లేదు. ఇంటికి వెళ్ళి పడుకుంటాను. అర్జెంటయితే ఇంటికి ఫోను చెయ్యండి" అని చెప్పి ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ పడుకోవడం పడుకోవడం సాయంత్రం అయిదు గంటలకు గానీ అతనికి మెలకువరాలేదు.

ఆ సాయంత్రం కాలేజీనుండి వసుధ డ్యూటీకి రాగానే అతను క్షమాపణ చెప్పుకున్నాడు.

"సారీ వసుధా! నిన్న నీ సంగతి మరిచి పోయాను"

"ఫర్వాలేదు డాక్టర్‌గారూ!"

"అదుగో మళ్ళీ డాక్టరుగారూ..."

"హాస్పిటల్‌లో మాత్రం డాక్టరుగారే. బయట మీ ఇష్టప్రకారమే రవీంద్రగారూ అని పిలుస్తాను"

"గారేలేదూ, బూరేలేదు. రా... నీకు నా స్నేహితుడిని పరిచయం చేస్తాను"

రవీంద్ర వసుధను నిన్న గాయపడ్డ వీరుడి గదిలోకి తీసుకువెళ్ళాడు.

"వసుధా! వీడు కృష్ణమోహన్. నా చిన్ననాటి స్నేహితుడు. నాకు చాలా ప్రియమయినవాడు. వీడు డిశ్చార్జి అయి వెళ్ళేవరకూ నీ డ్యూటీ వీడిదగ్గరే"

'మోహన్ అన్నయ్యపేరు' అనుకుంది వసుధ ఎంతో అభిమానంగా. అతనికి తల మీద కట్టుని గడ్డం కిందుగా తీసుకొచ్చి కట్టారు. ముక్కుదూలం విరిగిందని బ్యాండేజీ వేశారు. ఛాతీకి అడ్డంగా ఒక కట్టుకట్టారు.

'ఓరి నాయనో! ఈ మనిషి పావుభాగమే కన్పిస్తున్నాడు. మిగిలినదంతా బ్యాండేజీ క్లాతే' అనుకుంది వసుధ.

రవీంద్రతో భయపడుతూ భయపడుతూ చెప్పింది.

"నాకు సాయంత్రం చిన్మయానంద లెక్చర్స్ ఉన్నాయి ఒక వారంరోజులపాటు"

'హా! ఈ మనిషా నా నర్సు' అన్నట్టు చూశాడు కృష్ణమోహన్ రవీంద్రవంక.

"ఏంటి వసుధా! నీకు ఈ పిచ్చికూడా వుందా?" అని ఆశ్చర్యపోయాడు రవీంద్ర. అతని ప్రశ్నకు ఆమె నొచ్చుకుంది.

"ఇది పిచ్చి అయితే, ఎవరి పిచ్చి వారికి ఆనందం. పోనివ్వరాదూ?"

"అయాం సారీ వసుధా! ఒక పనిచేద్దాం. మీ స్వామివారి ఉపన్యాసం ఏడుగంటలకు ప్రారంభం అవుతుందనుకుంటా. అప్పటివరకూ సాయంచెయ్యి. ఏడుగంటలనుండి విజయలక్ష్మి వుంటుంది. పది తర్వాత ఎవరి సహాయమూ అక్కర్లేదు. నేనే వుంటాను వాడిదగ్గర"

"నేను చేసేది సహాయం కాదండీ. డ్యూటీ"

"ఓ.కే. ఓ.కే. ఏడుగంటల తర్వాత డ్యూటీచెయ్యొద్దు. సరేనా?"

"ఒక్కవారం రోజులు. చిన్మయ లెక్చర్స్ అయ్యేవరకు. తర్వాత నేనే చేస్తాను డ్యూటీ" అని ఆఖరిపదం నొక్కి పలికి బయటకు వెళ్ళిపోయింది.

"ఈ బ్లాక్ డెవిల్‌ని ఎక్కడ సంపాదించావురా బాబూ?" అనడిగాడు కృష్ణ రవీంద్రని.

"అట్లా అనొద్దురా. నలుపు నాణ్యం అన్నారు మన పెద్దలు. నువ్వు కమ్యూనిస్టువి. ఒంటిరంగు చూసి మనుష్యుల్ని అంచనా వెయ్యడానికి సిగ్గులేదురా నీకు?"

"నేనా? ఆ అమ్మాయి రంగుచూసి అంచనా వేశానా? ఉద్యోగధర్మం కంటే సన్నాసి మీటింగ్‌లు ముఖ్యం అంటూ వాగుతుంటే

చాచి లెంపకాయ వేద్దామనుకున్నాను. ఇవ తల మనిషి ఛస్తోంటే... మనిషి మిథ్య, బాధ మిథ్య, నువ్వు మిథ్య, నేను మిథ్య... మీటింగులకి వెళతానంటుందేమిరా నీ నర్సు. బుద్ధుందా ఈ పిల్లకి? "

అంతకంటే ఎక్కువ మాట్లాడదామంటే దవడమీద కూడా బ్యాండేజీ వుండడంవల్ల నొప్పి కలిగి నోరు మూసుకున్నాడు.

"అమ్మయ్య! మూసేవా నోరు. ఇందాకటి నుండి అదే చెపుదామనుకుంటున్నాను. నీతో వాదించలేక నోరు ముయ్యమంటున్నానని ఉద్రేకపడతావని వూరుకున్నాను. చూడు తండ్రీ! ఒక నాలుగురోజులపాటు విశ్రాంతి తీసుకో. అప్పుడుకానీ, నీకు గంటల తరబడి ఉపన్యాసాలు ఇచ్చే శక్తి రాదు. అర్థమయిందా? వసుధ మంచిపిల్ల. మంచి నర్సు. కొంచెం తక్కువ మాట్లాడుతుంది. నీ ఉపన్యాసాలతో ఆమెను భయపెట్టి తరిమెయ్యకు. వుంటామరి. కొంచెం కాఫీ పంపుతా"

కొంచెంసేపటికి వసుధ పొగలు కక్కే కాఫీ తీసుకువచ్చింది. అతను ఎడమచేత్తో కప్పు అందుకోబోతుంటే, "మీరు ఉండండి. నేను తాగిస్తాను" అంది. అతను కాఫీ తాగుతున్నంతసేపూ ఆమెను పరీక్షిస్తూనే వున్నాడు. ఈ నల్లపిల్లలో అద్భుతమయిన ఆకర్షణ వుందని అతను గమనించాడు. వసుధ నిర్వికారంగా తన విధిని నిర్వర్తించి ఖాళీ కప్పుని తీసుకుని వెళ్ళిపోయింది.

★ ★ ★

"వసుధా! పద, కృష్ణదగ్గరకు వెళదాం. వాడికి దవడమీద బ్యాండేజీ విప్పెయ్యొచ్చు" రవీంద్ర లేచి స్టెత్ మెడలో వేసుకున్నాడు.

వసుధ కొంచెం సందేహిస్తూ, "విజయలక్ష్మిని పిలుస్తాను" అంది.

"నాన్సెన్స్! నేను నిన్ను రమ్మంటోంటే నువ్వు విజయలక్ష్మి అంటావేమిటి? "

"ఆయన విషయం మీతో కొంచెం మాట్లాడాలి"

రవీంద్ర కనుబొమలు ముడిపడ్డాయ్. వసుధ మాట్లాడింది తాను సరిగ్గానే విన్నాడా? కృష్ణ విషయం మాట్లాడుతుందా? వాడేమైనా అసభ్యంగా ప్రవర్తించాడా వసుధతో? అసంభవం. కృష్ణ మనసా, వాచా, కర్మణా నిజమైన మార్క్సిస్ట్. స్త్రీని గౌరవించడం అతని వద్ద నేర్చుకోవలసిందే ఎవరయినా.

"నేను మీ స్నేహితుడి దగ్గర డ్యూటీ చెయ్యను" అంది వసుధ సందేహిస్తూనే.

"ఎందుకని వసుధా? వాడేమైనా అసభ్యంగా ప్రవర్తించాడా? "

"ఛ... అదేంలేదండీ. ఆయన చాలా మర్యాదస్తుడు"

"మరింకేమిటి? బాగా విసిగిస్తున్నాడా? "

"అదీకాదు. నాకు బాగాలేదు"

"ఏం బాగాలేదు.? " కొంచెం కఠినంగానే అడిగాడు.

"... ..."

"నువ్వు అట్లా మౌనంగా వుండద్దు వసుధా! నా ఆసుపత్రి వ్యవహారం నాకు తెలియవద్దా? వాడిదగ్గర డ్యూటీ చెయ్యడానికి నీకు ఏమిటి అభ్యంతరం? నిజంగానే వాడు నర్సులతో సరిగ్గా ప్రవర్తించకపోతే, నేను విజయలక్ష్మిని మాత్రం వాడి దగ్గర డ్యూటీ చెయ్యమని ఎలా చెప్పగలను? నాకు తెలిసి కృష్ణ అటువంటివాడుకాదు"

"ఆయన మంచి మనిషి. నేను ఆయన విషయం చెప్పటంలేదు. నా విషయమే చెపుతున్నాను. ఆయనకు తగిలిన దెబ్బల వల్ల ఆయన తన పనులేమీ చేసుకోలేరు"

"అందువల్లనే కదా ఎవరో ఒకరు ఎప్పుడూ వాడిని కనిపెట్టుకుని వుండాలని చెపుతున్నాను"

"అలా వుండడం నాకు అభ్యంతరంలేదు. కానీ పసిపిల్లవాడిలా ఆయన అన్నింటికీ ఇతరులమీద ఆధారపడడంవల్ల, నేను ఆయనను తరచూ తాకవలసి వస్తుంది"




"ఏం తాకితే? మైలపడిపోతావా? "

"నాకు ఇష్టంలేదు" అంది వసుధ ఖచ్చితంగా. 'ఈ విషయంలో రాజీలేదు సుమా' అన్న ధోరణిలో.

"ఏమిటీ? " అతను పెద్దపెట్టున ఆశ్చర్యపోయాడు.

"నువ్వు నర్సువి. సేవచెయ్యటం నీ కర్తవ్యం. నీ ధర్మం. పైగా నువ్వు కష్టసుఖాలు తెలిసినదానివి. ఇతరుల బాధ అర్థం చేసుకోగలదానివి. ఇలాగేనా మాట్లాడడం? "

వసుధ బాగా చిన్నబుచ్చుకుంది. అయినా తల వంచుకుని నిలబడింది తప్ప సమాధానం ఇవ్వలేదు. అతను నీ సమాధానం కావాలి సుమా! అన్నట్టు ఆ ముఖంలోకే చూస్తూ కూర్చున్నాడు.

"నేను కూర్చుంటాను" అంది కుర్చీలాక్కుని.

"తప్పకుండా కూర్చో. ఏమీ దాచకుండా సమాధానం చెప్పు"

కూర్చుని ఖర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంది. లోగొంతుకతో చెప్పటం మొదలుపెట్టింది.

"నేను నర్సునని నాకు తెలుసు. మీరు చెప్పిన పనులన్నీ కూడా చేయాలని నాకు తెలుసు. చేస్తాను కూడా. నేను పనికి ఎప్పుడూ భయపడను. అసలు పనిమనిషిగానేకదా నా జీవితం ప్రారంభం అయింది"

"షటప్ వసుధా! నేను అలా అన్నానా? "

"మీరు అనలేదు. కానీ నేనే చెపుతున్నాను. మోహన్ అన్నయ్య... అదే మనం చేబ్రోలు వెళ్ళామూ..."

"గుర్తున్నారు చెప్పు"

"ఆయన నన్ను కైలాసపురంలో వదులుతూ దూడను వదిలి పులి దగ్గరకు వెళ్ళే ఆవులాగా చాలా బుద్ధులు నేర్పారు. ఎప్పుడో ఎనిమిది సంవత్సరాలనాటి సంగతి. అప్పుడేం చెప్పారో కూడా నాకు గుర్తులేదు, ఒకటి రెండు విషయాలు తప్ప. అందులో ఆయన మరీ మరీ ముఖ్యంగా చెప్పింది, 'ఎప్పుడూ ఎవరినీ నీ శరీరాన్ని తాకనివ్వద్దు' అని. అంత చిన్న వయసులో ఆయన ఎందుకు అలా చెప్పాడో తెలియదు"

"ఇప్పుడు తెలిసిందా? " అతని గొంతులోని వ్యంగ్యాన్ని వసుధ లక్ష్యపెట్టలేదు. తన మాటల్ని కొనసాగించింది.

"అన్నయ్య ఏం చెప్పినా నా మంచికే చెపుతాడు. తనమాట వినాలని మాత్రమే నాకు తెలుసు. నేను క్రిస్టియన్ సంస్థలో పెరగడంవల్లనూ, నా సహాధ్యాయులంతా నా వయసువాళ్ళూ, బాలికలూ అయినందువల్లనూ, ఆయన సలహా నాకు పెద్దగా ఉపయోగపడలేదు. కానీ ఆ వాక్యం ఎందుకో నాకు బాగా గుర్తుండిపోయింది. నేను ఆ సలహాను ఎంత మూర్ఖంగా పాటించానంటే నన్ను విడిచి వెడుతూ, నాకంటే వయసులో పదిహేను సంవత్సరాల కంటే పెద్ద అయిన ఆ మహానుభావుడు నన్ను పితృవాత్సల్యంతో కౌగలించుకుంటే నేను ఇడియెట్‌లా 'అన్నయ్యా! నన్ను ఎవరూ తాకకూడదన్నావు' అంటూ ఒక స్టుపిడ్ ప్రశ్న వేశాను. దానికి ఆయన 'నిజమేలే' అని నన్ను సమర్థించాడు. కానీ, నాకు ఊహ తెలిశాక, పెద్దదాన్ని అయ్యాక ఆయనెంత ముందుచూపుతో నాకు ఆ జాగ్రత్త చెప్పాడో అర్థం అయ్యింది.

మొత్తానికి ఆయన చెప్పిన జాగ్రత్తను నేను శ్రద్ధగా పాటిరచాలనుకుంటున్నాను. ఉద్దేశపూర్వకంగా కాదుగానీ ఆయన అసహాయతవల్ల కృష్ణమోహన్‌గారు తరచూ నన్ను తాకటం సంభవిస్తుంది. అది నాకు ఇష్టం లేదు"

వసుధ కుర్చీ జరిపి లేచి నిలబడింది. ఆమె వెళ్ళడానికి ఉద్యుక్తురాలైందని అతను గ్రహించాడు.

"చెప్పటం అయిందా వసుధా? ఇంకేమయినా వుందా? "

"నేను చెప్పవలసింది చెప్పాను. ఆపై మీ ఇష్టం"

"అమ్మయ్య! నాతోపద. నువ్వు వాడిని ముట్టుకోనక్కరలేదులే. వాడి బ్యాండేజీ విప్పుదాం. తర్వాత తీరికగా నిన్ను 'ఎన్‌లైటెన్' చేయాలి. అంటే నీకు జ్ఞానబోధ చేస్తాను"

బేసిన్, సిజర్స్, మిగిలిన అవసరమయిన సామగ్రి తీసుకుని వసుధ అతన్ని అనుసరించింది.

సాధారణంగా ఇటువంటి పనులు విజయలక్ష్మి చేస్తుంది. ఆనందరావు కూడా ఈ విషయాల్లో పూర్తి శిక్షణ పొంది వున్నాడు. అయితే కృష్ణమోహన్ విషయంలో మాత్రం రవీంద్ర వీలయినన్ని పనులు తానే చేస్తాడు. బ్రష్ చేయించడం దగ్గర్నుంచీ బట్టలు మార్చటంవరకూ, వసుధ అయినా, విజయలక్ష్మి అయినా రవీంద్ర క్లినిక్‌లో లేని సమయంలోనో, లేకపోతే అతను క్లినిక్‌లో వుండీ ఇతర పేషంట్లని 'ఎటెండ్' అవుతున్న సమయంలోనో కృష్ణ పని చేయవలసి వుంటుంది తప్ప రవీంద్ర చుట్టుపక్కల వుండగా కృష్ణకు కాఫీ కూడా ఎవరూ తాగించనవసరంలేదు. 'రెండు శరీరాలు ఒకే ఆత్మ' సినిమా తియ్యొచ్చు వీళ్ళిద్దరితో అని జోక్‌చేస్తుంది విజయలక్ష్మి.

కృష్ణమోహన్‌కి తలకట్టు, దవడమీద బ్యాండేజీ విప్పేశారు. ఛాతీకి కట్టుమార్చారు.

"అమ్మయ్య! ఇక నేను మాట్లాడొచ్చా?" అన్నాడతను రెండుచేతులూ వెనక్కి బారచాపి ఒళ్ళు విరుచుకుంటూ.

"అయ్యో! తప్పకుండా మాట్లాడు నాయనా! కమ్యూనిస్టువాడిని మాట్లాడనివ్వకపోవడం కంటే శిక్ష మరొకటి వుండదనుకుంటా" అన్నాడు రవీంద్ర నవ్వి.

"నాకోసం పోలీ..." అనబోయి వసుధవంక సందేహంగా చూసి ఆపేశాడు. అది గ్రహించి రవీంద్ర,

"ఓకే... వసుధా! నువ్వు వెళ్ళి మిగిలిన పేషెంట్లను చూసుకో. అన్నట్టు నీ చిన్మయ ఉపన్యాసం పూర్తయ్యేసరికి గీతాభవన్ ఎదురుగా నేనుంటాను. నాకోసం చూడు" అన్నాడు. మామూలుగా అయితే వసుధ నాకోసం మీరు రాకండి అనో, నేను ఒక్కదాన్నీ వెళ్ళిపోగలను అనో అని వుండేది. కానీ కృష్ణమోహన్ ఎదురుగా ఏమనడానికీ ఆమెకు మొహమాటం వేసింది. ఆమె అలా మొహమాటపడుతుందని రవీంద్ర ఊహించాడు. అందువల్లనే కృష్ణ ఎదురుగా చెప్పాడు. వసుధ వెళ్ళగానే కృష్ణ తన వాక్యం పూర్తిచేశాడు.

"పోలీసులు ఎవరయినా వచ్చారా?"

"రాలేదులే. ఈ రేంజి డిఐజి నాకు తెలిసినవాడే. మేనేజ్ చేశాను"

అతను కొంచెం రిలాక్స్‌డ్‌గా వెనక్కు వాలాడు.

"చాలా అన్యాయంరా. చాలా అన్యాయం. మా వాళ్ళను చాలామందిని..." అని తలవంచుకున్నాడు. అతని చెక్కిళ్ళమీదుగా రెండు కన్నీటి చుక్కలు జారాయి.

"ఓరినీ, కమ్యూనిస్టులు కూడా ఏడుస్తారేమిరా?" అన్నాడు రవీంద్ర వాతావరణాన్ని తేలికపరిచే యత్నంలో.

"రేయ్ ఫూల్! కమ్యూనిస్టులే ఏడుస్తార్రా. ముఖ్యంగా ఇతరులకోసం, బాధితులకోసం, పీడితులకోసం. కానీ కొన్నాళ్ళయ్యాక వాళ్ళలో చాలామంది ఇదుగో ఇలా నీలా బ్రహ్మాండమయిన పెట్టుబడితో ఆసుపత్రులు కట్టి రెండుచేతులా డబ్బు సంపాదిస్తార్రా. అప్పుడు ఏడవడం మరిచిపోయి, ఇతరులను ఏడిపిస్తారు" అన్నాడు కృష్ణ కూడా తను నమ్మిన సిద్ధాంతాన్ని హాస్యంలో మేళవించి.

"హోరి దుర్మార్గుడా! నీకు వైద్యం చేస్తే పైసా రాలుతుందిరా నాకు, ఎదురు ఖర్చు కావడం తప్ప? ప్రాణదాతను ఈ విధంగా నిందిస్తే నిన్ను భగవంతుడు కూడా క్షమించడు"





"నువ్వు భగవంతుడిని ఎందుకు కిందకు దింపుతున్నావో నాకు తెలుసులే. నన్ను మాటల్లో పెట్టాలని. ఈ సిద్ధాంత చర్చలన్నీ తర్వాత, ముందు నేను ఎప్పుడు వెళ్ళొచ్చో చెప్పు" అన్నాడు కృష్ణ సిమెంటు కట్టులో బరువుగా వున్న తన రెండుకాళ్ళను దిగులుగా చూసుకుంటూ.

"వెళ్ళటం గురించి ప్రస్తుతానికి మరిచిపో. ఇవిగో పేపర్లు. నీ ఉద్దేశంలో అన్నీ అబద్ధాలే అయినా, కొన్ని నిజాలున్నాయి. చదివి చూసుకో. శరీరాన్ని కొంచెం కోలుకోనివ్వు. నిన్ను జీవితాంతం భరించే ఓపిక నాకులేదులే. నువ్వు లేచి, 'నీ పనులు చేసుకోగలిగాక పంపించివేస్తాను. గుండెలమీద కుంపటిలా నాకెందుకురా బాబూ నువ్వు?"

అతను పెద్దగా నవ్వబోయి దవడ నొప్పి పెట్టడంతో ఆగిపోయాడు. రవీంద్ర ఆదుర్దాగా అతని మీదకు వంగి, "కృష్ణా! ఆర్ యూ ఆల్ రైట్? బాగా నొప్పిగా వుందా?" అనడిగాడు.

కృష్ణ 'లేదు' అన్నట్టుగా తల అడ్డంగా ఊపి రవీంద్ర రెండుచేతుల్నీ తన చేతులతో పట్టుకున్నాడు. తర్వాత వాళ్ళ మనసులే మాట్లాడుకున్నాయి.

★ ★ ★

"అబ్బ! చలిగా వుంది వసుధా!" అన్నాడు రవీంద్ర. చిన్మయానంద ఉపన్యాసం అయిపోవడంవల్ల బయటకు వచ్చిందామె. భవనం ఎదురుగా చెట్టుకింద సిగరెట్టు కాలుస్తూ రవీంద్ర కన్పించాడు. సమయం రాత్రి ఎనిమిది గంటలే అయినా బాగా చీకటి పడింది. నవంబరు ఆఖరిరోజులు కావడంవల్ల చలి కూడా బాగానేవుంది.

"మరెందుకు వచ్చారు? ఒక్కదాన్నీ వెళ్ళడం నాకు అలవాటే" అంది వసుధ జవాబుగా.

"నీకు తోడుకోసం రాలేదు నేను. నీ ఉదయం ఉపన్యాసానికి కౌంటర్ ఉపన్యాసం ఇద్దామని వచ్చాను"

ఆమె అర్థంకానట్టు చూసింది.

"మన హాస్పిటల్‌లో ఉపన్యాసాలు ఇచ్చే ఆయన ఒక్కరే ఉన్నారు, కృష్ణమోహన్ గారు"

"వాడి ఉపన్యాసాల సంగతి పక్కన వుంచు. ఈ చిన్మయానంద ఉపన్యాసాలు ఇంకా ఎన్నిరోజులు? "

"అయిపోయాయండీ. ఇవాళే ఆఖరిరోజు"

"నువ్వు పుస్తకాలు చాలా ఎక్కువగా చదువుతావు కదూ. ముఖ్యంగా వేదాంత సంబంధమయిన గ్రంధాలు. నీ దగ్గర వివేకానంద కంప్లీట్ వర్క్స్ చూశాను"

"అదేం లేదండి. మామూలు తెలుగు నవలలు కూడా చదువుతాను. నా దగ్గర చలంగారివి కూడా అన్ని పుస్తకాలూ వున్నాయి. చూస్తారా మీరు? "

"చూశానులే. ఆయన కూడా చివరిలో సన్యాసం తీసేసుకున్నారు కదా! సన్యాసం అంటే జీవితంనుండి పారిపోవడం అని నా ఉద్దేశ్యం"

"బాగా చెప్పారు. అది మీ ఉద్దేశ్యం"

"పోనీ నీ ఉద్దేశ్యం చెప్పరాదూ? నువ్వు ఇంతలా చదివే ఆ చలంలో ఏం గొప్పతనం వుందో. నేను కూడా ఈమధ్య ఆయన పుస్తకాలు చదువుతున్నాననుకో"

"ఆయన గొప్పతనం బహుశా స్త్రీలకు అర్థమయినట్టు పురుషులకి అర్థంకాదులెండి. అసలు నేను కూడా డిగ్రీ అయ్యాక తిరువణ్ణామలై వెళ్ళిపోదామనుకుంటున్నాను."

సంభాషణ ఎక్కడో మొదలుపెట్టి ఇంకెక్కడికో వెళ్తోందని అతను గ్రహించాడు.

"అసలు నేను ఇక్కడికి వచ్చింది నిన్ను తిరువణ్ణామలై పంపటానికి కాదు వసుధా! నీ ఉదయం ఉపన్యాసంలో నిన్ను మనుష్యులు తాకకూడదు. లేక నువ్వు మనుషుల్ని తాకకూడదు అని ఒక నీతి చెప్పావు చూడు..."

"అది నీతికాదు. జాగ్రత్త"

"బాబోయ్! కృష్ణకి నర్సింగ్ చేసీ చేసీ

నీకూ వాదించడం వచ్చేసినట్టుంది. సరే... నువ్వన్నట్టు జాగ్రత్తే. దాన్ని గురించి నేను కొద్దిగా మాట్లాడుదామనుకుంటున్నాను"

"మాట్లాడండి"

"పది పన్నెండు సంవత్సరాల బిడ్డకు... అదీ ఆ బిడ్డ ఆడపిల్ల అయినపుడు ఆయన అదే మీ మోహన్ అన్నయ్య చెప్పిన జాగ్రత్త చాలా అవసరం. ఆ వయసులో విచక్షణ తెలియదు. ఇతరులు ఆ బలహీనతను, అమాయకత్వాన్ని దుర్వినియోగం చేసే అవ కాశం వుంది. అప్పటికే నీకంటే చాలా పెద్ద వాడయిన మోహన్..."

'చాలాకాదు. మహా అయితే పదిహేను, పదహారు సంవత్సరాలు పెద్దయి వుండొచ్చు' అనబోయి 'వాదించకు...' అంటాడేమోననే భీతితో ఆగిపోయింది.

"... తన తండ్రి ప్రవర్తన వల్లనో లేక ప్రపంచంలో ఈ విధంగా జరగటం సర్వసా ధారణం కావటంవల్లనో నీకు ఆ జాగ్రత్త నేర్పేడు. ఇప్పుడు నువ్వు అమాయకురాల యిన తారుణ్యంలో వున్న బాలికవు కావు. యువతివి. విచక్షణా జ్ఞానం, చదువూ, సంస్కారం వున్నదానివి. నిన్ను నువ్వు రక్షించుకోగలగాలి. బహుశా, రక్షించుకోగ లవు కూడాను. ఆయన చెప్పిన వాక్యంలోని భావం గ్రహించకుండా దాని 'లిటరల్'గా అర్థంచేసుకోవటం ఫూలిష్‌నెస్. నా మాటలు బాధిస్తున్నాయా? కానీ నా ఉద్దే శ్యాన్ని నేను చాలా 'ఫ్రాంక్'గా చెపుతు న్నాను. ఒక మనిషికి సేవ చేసేటపుడు తాకటానికీ, కామానికీ తేడా తెలుసుకోలేక పోతే... వసుధా! ఐయామ్ వెరీ సారీ టు సే దట్ యుహేవ్ టు గ్రో ఎలాట్. దీనినే చలంగారు ఇంకోలా చెప్పేరు. 'నువ్వు ప్రేమించనివాడికి నీ శరీరాన్ని ఇవ్వొద్దు- వాడు నీ భర్తయినా సరే' అని ఆయన అంటే, ప్రతి ఆకర్షణనూ పక్క వరకూ లాక్కెళ్లి ఇదే చలం చెప్పిన స్త్రీ స్వేచ్ఛ, ప్రణయ స్వేచ్ఛ, చూసేరా పవిత్రమయిన సంఘాన్ని ఈయన ఎట్లా భ్రష్టు పట్టిస్తు న్నాడో అంటారు. ఎనీవే, నిన్నూ, నీ భావా లను దుయ్యబట్టడం నా వుద్దేశ్యం కాదు వసుధా! నువ్వు నీ మోహన్ అన్నయ్యనీ, చలంగారిని స్ఫూర్తిగా తీసుకో. వివేకానం దని చదువు. చిన్మయానందని విను. కానీ... నువ్వు కూడా స్వతంత్రంగా ఆలో చించుకో. నీకేది సరయినది అన్పిస్తే అది చెయ్యి. ఎవరో ఏదో చెప్పేరని, మరేదో రాసేరని చెయ్యకు. వుంటా!"

రవీంద్ర మాటలు ఆపేసరికి పెద్ద జడి వాన కురిసి ఆగినట్టయింది వసుధకు. అతను ఆమెను అక్కడే వదలి చకచకా నడుచుకుంటూ వెళ్ళిపోయేడు. వసుధ దిగ్భ్రమలో కొన్ని క్షణాలపాటు ఆ రోడ్డు మీదే వుండిపోయింది. తర్వాత తేరుకుని ఇంటివైపు నడిచింది.



వసుధ ఎప్పటిలాగే కాలేజీ నుండి సరా సరి క్లినిక్‌కి వచ్చేసరికి విజయలక్ష్మి పరుగె త్తుకుంటూ ఎదురు వచ్చింది. ఆ సమయా నికి రవీంద్ర క్లినిక్‌కి రాడు.

"ఇప్పుడెట్లా వసుధా! మా అమ్మాయికి నొప్పులు వస్తున్నాయంట. మా ఆయన ఫోను చేసేరు. నేను వెళ్ళాలి"

"దానికంత కంగారు పడతారెందుకండీ. నేను వచ్చేసానుగా. క్లినిక్ నేను చూసుకుంటానులెండి. మీరు వెళ్ళిరండి. డాక్టరుగారు వస్తే, నేను చెపుతానులెండి" భరోసా ఇచ్చింది వసుధ.

"అది సరే! ఈ ఆనందరావుకి ఏమయిందో తెలీదు. ఇప్పటివరకూ రాలేదు. డాక్టరుగారి స్నేహితుడు నిద్రపోతున్నారు. ఆయన లేస్తే బాత్‌రూముకి తీసుకువెళ్ళాల్సి వస్తుందేమో, బట్టలేమయినా మార్చాలేమో" విజయలక్ష్మి సందేహిస్తూ అంది.

వసుధ నవ్వింది. "ఫర్వాలేదులెండి. మిమ్మల్ని ఇన్నాళ్ళుగా చూస్తూ ఆ మాత్రం సేవాదృక్పథం నేర్చుకోలేకపోతే ఎలా? ఆ పనులన్నీ నేను చేస్తానులెండి. మీరు నిశ్చింతగా వెళ్ళిరండి" అంది.

విజయలక్ష్మి ఆనందంగానూ, ఆశ్చర్యంగానూ చూసింది.

"జాగ్రత్త వసుధా! ఆయన కూడా మంచివాడే పాపం! కొంచెం ఎక్కువగా మాట్లాడుతాడుగానీ. అందులోనూ, మనమంటే గొప్ప సానుభూతి వున్న మనిషనుకో"

విజయలక్ష్మి వెళ్ళిపోయింది. ప్రతి మనిషి నుండీ ఏదో ఒకటి నేర్చుకోవలసిన మాటయితే ఆమె నుండి సేవచెయ్యటం నేర్చుకోవాలి. పదిమంది సంతానంలో పెద్దది కావటంవల్లనో, సమిష్టి కుటుంబంలో పెద్ద కోడలు కావటం వల్లనో లేక స్వయంగా నలుగురు బిడ్డల తల్లి కావటంవల్లనో గానీ ఆమె రోగులకు ఉచ్చమూ, నీచమూ లేకుండా సేవ చేస్తుంది. వాళ్ళు డబ్బు వున్నవాళ్ళయినా, లేని వాళ్ళయినా, అంటు రోగులయినా, ఏక్సిడెంటు కేసులయినా, ఆడయినా, మగ అయినా, పసిపిల్లలయినా, ముసలి వాళ్ళయినా ఆమె సేవలో తేడా వుండదు. మళ్ళీ ఎవరయినా ఆమె సేవకు మెచ్చి డబ్బిస్తే నిరభ్యంతరంగా స్వీకరిస్తుంది. ఆమె పెద్ద సంసారానికి ఆ డబ్బు అవసరం కూడా!

కృష్ణ గురించి ఇన్ని జాగ్రత్తలు వసుధకు చెప్పి, విజయలక్ష్మి వెళ్లిన వెంటనే ఆనందరావు వచ్చేసేడు. అతను కృష్ణని బాత్‌రూముకు తీసుకువెళ్ళి, బట్టలు మారుస్తోంటే వసుధ సహాయం వెళ్ళింది. అతనికి కాఫీ కలిపి ఇచ్చింది. రవీంద్ర ఇంటినుండి వచ్చిన స్నాక్స్ ఇచ్చింది.

"మీకేమీ పనిలేకపోతే కాసేపు నా దగ్గర కూర్చోండి వసుధా!"

"మీరు కూర్చోండమ్మా! మిగిలిన పేషంట్లను నేను చూసుకుంటాన్లెండి" అన్నాడు ఆనందరావు.

వసుధ కుర్చీని అతని మంచానికి దగ్గరగా జరుపుకుని కూర్చుంది.

"పేపర్లన్నీ చదివేసారా? " అని అడిగింది, వంగి అతని పక్కన వున్న పేపర్లు అందుకుంటూ.

"చదివేను. అందులో నాకు మరే వార్తలు కన్పించవు. అన్నీ నా సహచరుల మరణవార్తలే" అన్నాడు నిస్సంకోచంగా.

ఆ వార్తలను అతడు ఎర్రసిరాతో మార్క్ చేసి వున్నాడు. వసుధ అతన్ని జాలిగా చూసింది.

"వాళ్ళంతా అక్కడ చస్తూ వున్నారు. చిన్నపిల్లలూ, యువకులూ, వృద్ధులూ-వయసుతో నిమిత్తం లేకుండా, నేనిక్కడ విశ్రాంతి తీసుకుంటున్నాను సుఖంగా, హాయిగా"

వసుధకు అతన్ని ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు. అతను కూడా మౌనం వహించేడు. ఆ మౌనంలో గొప్ప విషాదం వుంది. ఈ మౌనమూ, విషాదమూ ఆమెకు స్వయంగా అనుభవమే. దానికేమీ మందు లేదు. కాలం గడుస్తూ వుంటే బాధ కొంత మరుపుకు వస్తుంది.

"నా కాళ్ళు బాగుపడటానికి ఇంకా ఎన్ని నెలలు పడుతుంది? మీకేమయినా తెలుసా? " అనడిగేడు.

చాలాసేపటికి వసుధ లేచి బయటకు



వచ్చేస్తోంటే, ఆమెను ఆపటానికి అడిగినట్టు. వసుధ తల అడ్డంగా వూపింది.

"మీరు అంత పెద్ద నర్సు. ఇంత చిన్న విషయం తెలియదా? "

"నేను పెద్ద నర్సుని కాదండీ. చిన్న నర్సునే. అది కూడా, శిక్షణ పొందిన నర్సును కాదు. ఇక్కడ పెద్ద నర్సయినా, ట్రైన్డ్ నర్సయినా విజయలక్ష్మి. నేను నర్సింగ్ విద్యార్థినిని కూడా కాదు. కామర్సు విద్యార్థినిని"

"ఏమిటీ? మీరు చదువుకుంటున్నారా? ఇది పార్ట్‌టైమా? అందుకేనా వుదయం పూట కన్పించరు. ఇంకా నేను మీది సాయంత్రం డ్యూటీ అనుకుంటున్నాను"

ఇంతలో రవీంద్ర కారు వచ్చిన శబ్దం అయింది.

"డాక్టగారు వచ్చేరు" అంటూ వసుధ నిష్క్రమించింది. ఎనిమిది గంటలకు ఇంటికి వెళ్ళేముందు ఆమె కృష్ణమోహన్ గదిలోకి తొంగిచూసింది. అతను దిండుకు అనుకుని చదువుకుంటున్నాడు. వసుధ పద ధ్వనికి తలెత్తి చూసేడు.

"ఏమిటీ మీ డ్యూటీ అయిపోయిందా? "

"అవునండీ. మరీ ఆలస్యమయితే ఒక్క దాన్నే ఇంటికి వెళ్లలేను"

"రేపు మీ కాలేజీకి శెలవు కదా! హాస్పిటల్ కి వస్తారా? " అతను మామూలుగానే అడిగేడు. అది అభ్యర్థనగా వసుధ అర్థం చేసుకుంది.

"అలాగే ప్రయత్నిస్తాను" అని చెప్పి వచ్చేసింది.

★ ★ ★

ఉదయం వసుధ నిద్రలేచేసరికి మేడలో నుండి సందడి విన్పిస్తోంది. ఏమిటైవుంటుందా? అని ఆశ్చర్యపోయింది. కొంతసేపటికి రాధ చెల్లెలు కన్పించి చెప్పింది.

"వసుధక్కా! మేమంతా నాగార్జునసాగర్, ఎత్తిపోతల పిక్నిక్‌కి వెళుతున్నాం. నువ్వా వస్తావా? "

పసితనపు అమాయకత్వంతో ఆ అమ్మాయి ప్రతిపాదించినా వసుధ అంగీకరించలేదు.

"లేదమ్మా, నాకివాళ ఆసుపత్రిలో పని వుంది" అని చెప్పింది. ఇంట్లో అందరికీ వసుధ క్లినిక్‌లో పని చేస్తోందని తెలుసు. అందువల్ల ఆ అమ్మాయి వెంటనే,

"మామయ్య కూడా మాతో వస్తున్నాడక్కా. ఆసుపత్రికి శెలవు ఇచ్చేస్తాడేమో!" అంది.

వసుధ నవ్వేసింది.

"మాస్టారు రాకపోతే బడి మూసేసినట్లు, డాక్టరుగారు రాకపోతే ఆసుపత్రి మూసెయ్యటం కుదరదు సుమా! బోలెడు మంది పేషంట్లు వుండరూ? వాళ్ళని ఎవరు చూస్తారు మరి? "

"అవును నిజమే" అని ఆ అమ్మాయి అంగీకరించింది.

వసుధ స్నానం పూర్తిచేసి, బట్టలు వేసుకుంటోండగా మేడముందుకు రవీంద్ర కారు వచ్చి ఆగింది.

కారు దిగిన అతను మేడలోకి వెళ్ళకుండా సరాసరి షెడ్డు దగ్గరికి వచ్చేడు.

"వసుధా! మేమంతా పిక్నిక్‌కి వెళుతున్నాం"

"అవునట. ఇప్పుడే సుమ చెప్పింది"

అతను కొంచెం తటాపటాయించి అడిగేడు.

"కాలేజీ లేదుగా. నువ్వు కూడా మాతో రారాదూ! ఒంటరిగా ఏం చేస్తావు? "

"కొంచెం లైబ్రరీ పని వుంది" ఎందుకలా అందో ఆమెకే తెలియదు.

"మెడికల్ విద్యార్థుల కంటే తప్పదు. మీ కామర్సు వాళ్ళు హాయిగా జీవితాన్ని ఆనందించక ఎందుకూ పడీ పడీ చదవటం? "

"అన్యాయమండీ! మెడికల్ స్టూడెంట్సుకి మాత్రమే చదవవలసిన ఆవశ్యకత వుంది, మాకు లేదనుకోవటం మా దురదృష్టం" అంది వసుధ కొంచెం నాటకీయంగా.





"అయితే రానంటావు? " అన్నాడతను కొంచెం నిరాశగానే.

ఆమె మౌనం వహించింది. అతను వెనక్కి తిరిగి వెళ్ళిపోయేడు. మేడలోకి అడుగు పెడుతుండగా భవానమ్మ అడిగింది.

"ఇంటికి వచ్చిన వాడివి ఇటురాకుండా, అటు షెడ్డులోకి పోతావేమిట్రా? "

చాలామందిలాగే ఆవిడకు కూడా 'తెలుపుగా వుండటం' గొప్ప అందమని నమ్మకం.

ఆవిధంగా చూస్తే వసుధ రాధకు అందంలో పోటీకాదు. ఆవిడ స్టాండర్ట్ ప్రకారం కాకపోయినా, మామూలుగా కూడా రాధ అందమయినది. అందువల్ల తమ్ముడు వసుధకు క్లినిక్‌లో వుద్యోగం ఇచ్చినపుడు బీదపిల్లకు సహాయపడటం మంచిదే అనుకుంది. ఏ ప్రమాదాన్నీ శంకించలేదు. కానీ, ఈమధ్య తమ్ముడు వసుధపట్ల అనవసరపు ఆసక్తినీ, కూతురిపట్ల అనాసక్తిని చూపిస్తున్నాడనే సందేహం ఆవిడను తొలుస్తోంది. ఆ అసహనాన్ని ఆవిడ తన ప్రశ్న ద్వారా వెల్లడించింది. అక్కగారి అనుమానం అతనికి అర్ధం అయ్యిందో లేదో తెలీదు.

"రెండు రోజులు మీతో బయటకు వస్తున్నాను కదా. ఆసుపత్రి వ్యవహారాలు అప్ప చెప్పి వస్తున్నాను"

"ఆసుపత్రి విషయం నిన్నగాక మొన్న వచ్చిన ఈ పిల్లకేం తెలుసు? విజయలక్ష్మికి చెప్పకపోయేవా? ముందొచ్చిన చెవులకంటే వెనకవచ్చిన కొమ్ములు వాడి అంటే ఇదే మరి" అని ఆవిడ సాగదీసింది.

కానీ నరసింహారావు లాయరు. తెలివి కలవాడు. బావమరిదిని కార్నర్ చేస్తే ఎదురు తిరిగే ప్రమాదం వుందని అతనికి తెలుసు. ఆర్ధికంగా తమమీద ఆధారపడని వాడిమీద అధికారం చెలాయించడం మూర్ఖత్వమని అతనెరుగును. అందువల్ల అతను కల్పించుకుని,

"భవానీ! ఇక వాదనలు ఆపి బయల్దేరుదామా? " అని గద్దించేడు.

నరసింహారావు, భవాని, అయిదుగురు పిల్లలు, డ్రైవరు, రవీంద్ర, ఇద్దరు పనివాళ్ళు మొత్తం రెండు కార్లలో బయలుదేరేరు.

'ఏమిటో రవీంద్రగారు రమ్మంటారుగానీ వీళ్ళల్లో నేను ఏ కేటగిరీలోకి వస్తాను? కుటుంబ సభ్యురాలిని కాదు. పనిమనిషినీ కాదు' అనుకుంది వసుధ దుమ్మురేపుకుంటూ వెళ్ళిపోయిన రెండు కార్లనూ గమనిస్తూ.

రవీంద్రతో లైబ్రరీకి వెళ్ళాలని చెప్పిందే కానీ, నిజానికి వసుధకు లైబ్రరీ పని ఏమీ లేదు. భవానమ్మగారు తనను మునుపటిలా ఆదరించటంలేదని ఆమెకు తోచింది. అంతకు మించి లోతుగా వసుధ ఆలోచించలేదు. తన చదువు పూర్తయ్యేవరకు, సురక్షితమయిన ఈ గూటిని కాపాడుకోవాలి అని వసుధ ఉద్దేశ్యం. ఇటువంటి పరిస్థితిలో ఆ కుటుంబంతో ఎక్కువ రాసుకుపూసుకు తిరగటం మంచిది కాదని ఆమె అనుకుంది. అంతలో ఆమెకు 'రేపు శలవే కదా! ఆసుపత్రికి వస్తారా!' అని అడిగిన కృష్ణ గుర్తుకువచ్చేడు. తలదువ్వుకుని ఆసుపత్రికి బయలుదేరింది.

★ ★ ★

"రండి...రండి... నైటింగేల్!" అని కృష్ణమోహన్ మనసారా ఆహ్వానించాడు. ఆరడుగుల పొడవు, ఎండలో చాలా దూరాలు నడవటంవల్ల కొంచెం కమిలిన శరీరం, ఆలోచనలతో నిరంతరమూ ముడివడిన కనుబొమలూ, సామాన్యమయిన దుస్తులు, కార్మికుల పట్ల అతని కన్సర్న్- రవీంద్రకంటె కృష్ణమోహన్ ఎప్పుడూ ఆమెకు సన్నిహితంగా తోస్తాడు.

"నా పేరు నైటింగేల్ కాదండీ. వసుధ"

"మంచి పేరు. ఎవరు పెట్టారోగానీ!"

తనకి ఎవరు పేరు పెట్టారో వసుధకు

గుర్తుంది. తన పేరుకి ఆమె వివరించిన అర్థం కూడా గుర్తుంది.

"మన ఆంధ్రులు సామాన్యంగా పెద్ద బిడ్డకు వెంకటేశ్వరుడి పేరో, దుర్గ పేరో పెడతారు. మీ పేరు వెంకట వసుధ కాక పోతే, మీరు మీ తల్లిదండ్రులకు పెద్దబిడ్డ కాదన్నమాట"

అతని విశ్లేషణకి వసుధ నవ్వింది.

"నన్ను మెచ్చుకోరేమి? నేను చెప్పినది నిజమా కాదా?"

"కాదు... ఐ మీన్ తెలియదు. నాకు తల్లీ తండ్రి లేరు. ఈ పేరు కూడా వాళ్ళు పెట్ట లేదు"

అతను అనాలోచితంగానయినా ఆమెను కష్టపెట్టినందుకు నొచ్చుకున్నాడు.

"అయాం సారీ వసుధా! సరే గానీ, నేను ఇక్కడ ఎన్నాళ్ళు వుండవలసి వుంటుంది?"

"మీరు ఇదివరలో కూడా ఒకసారి నన్నీ ప్రశ్న అడిగారు. కానీ, నాకు సరిగ్గా తెలి యదు. బహుశా మూడు నాలుగు నెలలు వుండవలసి వుంటుందేమో!"

"అమ్మో! అంతకాలమా?"

"ఏం? ఏమయినా పని వుందా?"

"చాలా చాలా పని వుంది వసుధా! నేను యుద్ధం మధ్యలో పారిపోయి వచ్చిన భీరు వుని"

"మీరు పారిపోయి రాలేదండీ. మిమ్మల్ని స్పృహ లేని స్థితిలో తెచ్చి ఇక్కడ పడేశారు"

"ఇప్పుడు నాకు స్పృహ వచ్చింది కదా! వెళ్ళవలసిన కర్తవ్యం లేదా నాకు?"

"ఎలా వెళ్ళగలరు? స్పృహ వస్తే చాలా? మీరు కదలలేరు కదా! కాళ్ళు రెండూ విరిగి, మంచంమీద పడి వున్న మీరు రాలేరని మీ సహచరులు మాత్రం ఎలా అనుకుంటారు? వాళ్ళకు మీ పరిస్థితి మిమ్మల్ని ఇక్కడకు తెచ్చిన మిగిలిన మిత్రులు చెప్పే వుంటారు కదా!"

"వసుధా! వాళ్ళు నా గురించి అనుకుంటా రని కాదు. నాకే మనసు ఇక్కడ నిలవటం లేదు"

అతను వంగి పరుపుకిందనుండి రెండు రోజులక్రితం పేపరు తీశాడు. అండర్‌లైను చేసిన వార్తలు చూపించేడు.

"చూసేవా వసుధా!"

ఆమెను ఏకవచనంలో సంబోధిస్తున్నా నని అతను గమనించలేదు. ఆమె గమనిం చింది.

"ఈ బిడ్డని ఎన్‌కౌంటర్‌లో చంపేశారు. నిండా పద్నాలుగేళ్ళయినా లేనివాడు. ఎంతో భవిష్యత్తు వున్నవాడు. మా మాటలు విని, మా పాటలకు వుత్తేజితుడై మాతో నడిచినవాడు. ఆస్తిపాస్తులు వదిలి, చదువుసంధ్యలు విడిచి మాతో కలసి పోరాటం సాగించినవాడు. అయ్యో! ఇంత లోనే అమరుడు అయిపోయేడు. ఇదిగో చూడు వసుధా! ఈమెకు నిండా ముప్ఫయి సంవత్సరాలు లేవు. ముగ్గురు బిడ్డల తల్లి. మమ్మలందర్నీ తన బిడ్డల్లాగే ప్రేమిం చింది. వివస్త్రను చేసి, సామూహికంగా మానభంగంచేసి కాల్చిపారేశారు"

అతను దుఃఖంతోనూ వివశుడైపోతు న్నాడు. ఇదంతా నావల్లనే. నా అసమర్ధత వల్లనే. కృష్ణమోహన్ రెండు చేతులతోనూ గుండెలమీద కొట్టుకుంటుంటే అతని గాయం రేగుతుందేమో అని భయపడింది వసుధ. అప్రయత్నంగా చేతులు సాచి, అతని రెండు చేతుల్ని పట్టుకుంది. ఎలా జరిగిందో తెలియదు. అతను ఆమెను కౌగ లించుకుని, ఆమె పొట్టలో తలపెట్టుకుని తల్లిని కోల్పోయిన పసివాడిలా రోదించాడు. యవ్వనంలోకి వచ్చేక ప్రథమ పురుష స్పర్శ. ఆ రోజు... ఒళ్ళు తెలియని జ్వరంలో పడి వుంటే డాక్టరుగారు చేయి పట్టుకుంటేనే ఎంతో బిడియపడింది. ఇప్పుడేమిటి ఇలా? తుమ్మెద వాలితే పువ్వు ఒక్కొక్క రేకే విచ్చు కున్నట్టు తన శరీరమంతా వికసిస్తోంది. తన్మయత్వంలో కనులు మూతపడుతు న్నాయి. అప్రయత్నంగా తానూ అతని




జుత్తులో వేళ్ళు జొనిపింది. అలా ఇద్దరూ ఎంతసేపున్నారో తెలియదు. ఎంతసేపటికో అతను ఆమెను వదిలి నిస్త్రాణగా వెనక్కి జారిపోయేడు. ఆమె చేష్టలు దక్కిన దానిలా అతనినే చూస్తూ నిలబడింది. కొంతసేపటికి అతని శ్వాస క్రమబద్ధ తనుబట్టి నిద్రపోతున్నాడని ఊహించి, దుప్పటి కప్పి బయటకు వచ్చేసింది. ఇవత లకు వచ్చి ఇతర పేషంట్లను చూస్తూనే వుంది. కానీ అతని స్పర్శ 'హేంగోవర్'లా ఆమె శరీరంమీదా, మనసుమీదా పనిచే స్తూనే వుంది.

కొంతసేపటికి విజయలక్ష్మి మిగిలిన పేషంట్లను చూసి, మందులు ఇచ్చి వచ్చింది.

"వసుధా! నీకు కాలేజీ లేదుగా. ఆనంద రావు తోడుంటాడు. కొంచెం సాయంత్రం వరకూ క్లినిక్ చూసుకోవూ? ఇవాళ మా అమ్మాయికి పురుటి స్నానం"

వసుధ తల ఊపింది.

"డాక్టర్‌గారు సాగర్ వెళ్ళేరు. బహుశా ఇవాళా, రేపూ కృష్ణమోహన్‌గారికి వారింటి నుండి క్యారియర్ రాదు. నువ్వు చూసుకో. రాకపోతే హోటల్నుంచి క్యారియర్ తెప్పించ వలసి వుంటుంది"

"నేను తెప్పిస్తాను లెండి"

"డబ్బు క్యాష్ కౌంటర్‌నుండి తీసుకో. డాక్టర్‌గారు వచ్చేక, చెపుదాం"

"అలాగే!"

కృష్ణమోహన్ మధ్యాహ్నం రెండుగంటల వరకూ నిద్రపోతూనే వున్నాడు. వసుధ అతని గదిలోకి వెళ్ళి రెండు మూడుసార్లు చూసి వచ్చింది. కానీ, నిద్రలేపే ప్రయత్నం మాత్రం చెయ్యలేదు. అతను లేచి బెల్ కొడితే మళ్ళీ వెళ్ళింది.

"లేచారా? వుండండి. ముఖం కడిగి స్తాను"

"మీ ఆనందరావు లేడూ?"

"ఉన్నాడు. ఇప్పటివరకూ మీరు నిద్రలే స్తారని చూశాడు. ఇప్పుడే భోజనానికి వెళ్ళేడు"

"అయితే ముఖం కడగవద్దులెండి. భోజనం పెట్టెయ్యండి. అన్నట్టు రవి సాగర్ వెళ్తానన్నాడు. నాకు భోజనం ఎక్కడ 'ఎరేంజ్' చేశాడో?"

"హోటల్ నుండి తెప్పించమన్నారట. మీకూ, నాకూ కూడా తెప్పించాను. లేచి కూర్చోండి. నేను ముఖం కడుగుతాను"

అతను మొహమాటపడుతూవున్నా, బల వంతంగా ఆమె అతని ముఖం కడిగి, తువ్వాలుతో తుడిచింది.

"ఏడిచి మీ జాలిని సంపాదించుకున్నట్టు న్నాను"

అప్రయత్నంగా అంది. "ఛ! ఇది జాలి కాదు"

"మరి?"

తలెత్తి చూసింది. అతని మాటల్లో కొంటె తనం ఏమీలేదు. అతను సమాధానం ఆశిం చినట్టు కూడా లేదు. మౌనంగా ప్లేటులో భోజనం పెట్టి అందించింది. తను మరొక ప్లేటులో భోజనం వడ్డించుకుంది.

"మీరు కూడా ఇక్కడే భోజనం చేస్తు న్నారేం వసుధా! ఇంటి దగ్గర మీకోసం ఎవరూ ఎదురుచూడరా?"

తల అడ్డంగా వూపింది.

"అదేలే. తల్లీ తండ్రీ లేరని చెప్పేవు. తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ..."

అతను ఒక్కోసారి ఆమెను మీరు అంటు న్నాడు. ఒక్కోసారి నువ్వు అంటున్నాడు.

"అత్తలూ, మామలు, పిన్నిలూ, బాబా యిలు ఎవ్వరూ లేరు. నాకు కుటుంబం అంటూ లేదు"

'హాస్యమా, నిజమా?' అన్నట్టు చూస్తు న్నాడు.

"నేను అనాథశరణాలయంలో పెరిగేను" ఆమె వాక్యం పూర్తిచేసింది.

అతను తినటం ఆపి నమ్మశక్యం కానట్టు చూసేడు.

"అవును. నేను అనాథను. డాక్టరుగారి క్లినిక్‌లో పనిచేస్తున్నాను"

"ఓ! నో! నాకంటే ఘోరం"

"అదేమిటి? "

వసుధ భోజనం పూర్తిచేసి, తన ప్లేటు, అతని ప్లేటు కడిగి బోర్లించింది. టేబుల్ మీద క్యారియర్ గిన్నెలు సర్దేసింది.

"నీ పనయిపోయిందా వసుధా? ఖాళీయేనా? "

"ఏం? మీకేమయినా పని వుందా? "

"అవును. కూర్చో నా గురించి చెపుతాను నీకు"

వసుధకూ అతని గురించి వినాలని ఆసక్తిగానే వుంది. డాక్టరుగారూ, కృష్ణమోహన్ ఇద్దరూ రెండు భిన్న ధ్రువాలు. రవీంద్ర శ్రీమంతుడు. కృష్ణ బీదవాడు. రవీంద్రది ప్రశాంతమయిన ప్లాన్డ్ జీవితం. కృష్ణది గాలివాటు జీవితం. ఇద్దరి అభిప్రాయాలు కూడా చాలా విషయాల్లో చాలా భిన్నమయినవి. వాళ్ళకంటే అయిదారు సంవత్సరాలు చిన్నదయిన వసుధకు ఇద్దరూ ఏం మాట్లాడినా నిజమే సుమా అన్పిస్తుంది. ఒక్కొక్క విషయంలో ఎంత భిన్నాభిప్రాయాలంటే అందులో ఏదో ఒకటి మాత్రమే నిజం కావటానికి అవకాశం వుంటుంది. అటువంటి సందర్భాల్లో కూడా వసుధకు ఇద్దరూ కరెక్టే అన్పిస్తుంది.

ఇంత విభిన్న వ్యక్తిత్వాలు గల ఇద్దరు వ్యక్తుల మధ్య ఇంత గాఢమయిన స్నేహం ఎలా సంభవమా? అని వాళ్ళిద్దరినీ చూసినది లగాయతు ఆమెకు ఆశ్చర్యంగానే వుంది.

"నా గురించి చెప్పనా వసుధా? "

"చెప్పండి. సాయంత్రం వరకూ నా టైం మీదే. మీరేం చెప్పినా వింటాను"

అతను మొదలుపెట్టేడు.

"ఒక విషయంలో నేను నీ అంత దురదృష్టవంతుడిని కాదు. నాకు తల్లీ, తండ్రీ, కుటుంబమూ వుండేవి. కానీ నా కుటుంబం ఆర్థికంగా అట్టడుగున వుండేది. నేను ఏ ప్రాంతానికి చెందినవాడినో నీకు చెప్పను. అది భవిష్యత్తులో నాకు క్షేమం కాదు. నాకు ఊహ తెలిసేనాటికి మా నాన్న ఒక సన్నకారు రైతు. సంవత్సరం అంతా ఆ భూదేవికి సేవచేసి, వానకోసం ఆకాశంవంక చూసేవాడు. ఆ వాన పడేది కాదు. ఉన్న కాసిని గింజలు విత్తనాల రూపంలో భూమిలో నిక్షిప్తమైపోయి వుండేవి. ఆకలిని జయించటానికి మేము చాలా రకాల ఆకులు, దుంపలు తినేవాళ్ళం. జావ కాచుకు తాగేవాళ్ళం. వరి అన్నం తినటం అనేది మాకు గొప్ప లగ్జరీ. పండుగకు మాత్రమే చేసుకోగలిగిన పిండివంట. మా ఊరి దగ్గరగా డామ్ కడుతున్నారు. మా ప్రాంతమంతా మెట్ట భూములు. అవన్నీ మాగాణి అవుతాయన్నారు. వరేమిటి? బంగారం పండుతుందన్నారు. ఇంకా అదే అంటున్నారనుకో.

ఏమయినా ఆ డామ్ కట్టాలని ప్రభుత్వం నిర్ణయించటంవల్ల ప్రభుత్వానికి కొమ్ముకాసే ఎంతోమంది కాంట్రాక్టర్లు బాగుపడ్డారు. చిన్నచిన్న కాంట్రాక్టర్లంతా 'ఏ' కేటగిరీ కాంట్రాక్టర్లు అయ్యేరు. కానీ రైతులు, సన్నకారు రైతులయ్యేరు. మా నాన్నవంటి సన్నకారు రైతులు రైతు కూలీలుగా మార్చబడ్డారు. ఇంకేమవుతారు? వానాకాలం రాగానే భూమిని కుదవపెట్టడం, ఎక్కువ వడ్డీలకు అప్పు తేవటం, ఎక్కువ ఖరీదుకు గింజలు కొనటం, ఆ పత్రల్లో పారబొయ్యటం, పురుగుమందులు, ఎరువులూ కొనటం, నేలలో పొయ్యటం. వానకోసం ఎదురుచూడటం. ఆ పంట పండదు. కొద్దో గొప్పో పండితే అప్పిచ్చినవాడు కొల్లగొట్టుకుపోతాడు. మళ్ళీ సీజనుకి మళ్ళీ అప్పు కావాలంటే ఈసారి కుదువపెట్టడం కుదరదు. ఒక చెక్కో, ముక్కో విడగొట్టి భూమిని అమ్మటమే శరణ్యం. ఇప్పుడో లేక మరో పది సంవత్సరాలకో లేక అయిదు సంవత్స




రాలకో ఆ డామ్ పూర్తయితే, ఐ టెల్ యూ వసుధా! మా పొలాలు కొనుక్కున్న భూకామందులంతా బలిసిన జమీందారులవుతారు. కానీ, ఆ పొలాలు అమ్ముకున్న మానాన్న వంటి వాళ్ళు ఆకలితోనూ, జబ్బులతోనూ చస్తారు.

అటువంటి కుటుంబంలో పుట్టిన నన్ను మా నాన్న తన శక్తికి మించిన పనే అయినా, స్కూల్ ఫైనల్ వరకూ చదివించేడు. నేను చదివి చాలా పెద్ద ఉద్యోగాలు చెయ్యాలని ఆశించేడు. అక్కడ రవి వంటి వాళ్ళు ఒకరిద్దరు తప్ప నాతో ఎవరూ స్నేహం చెయ్యలేదు. నేను వేరే వర్గం వాడిని వసుధా! ఈ నిజం తెలుసుకో. ఈ ప్రపంచంలో రెండే వర్గాలున్నాయి. ధనికవర్గమూ, బీదవర్గమూ! తతిమ్మా వర్గాలన్నీ హంబగ్. డబ్బున్నవాడయితే, అధికారంలో వున్నవాడయితే హరిజనుడయినా గౌరవిస్తారు. ఈ సంఘంలో హరిజనుడిని ఎందుకు గౌరవించటంలేదూ అంటే వాళ్ళల్లో తొంభైమంది కూటికి కూడా లేని పేదలు కావటంవల్లనే! సరే! ఏమయినా నా చదువు స్కూలు ఫైనలు దాటి ముందుకు సాగలేదు. నేను ఆ పరీక్షల్లో జిల్లాకి రెండవవాడిగా ఉత్తీర్ణుడినైనాను. చదువుకుంటే చాలు మన కష్టాలన్నీ తీరిపోతాయి అని మా నాన్న అజ్ఞానం వల్ల నమ్మితే, నేను పసితనపు అమాయకత్వంతో నమ్మి, రాత్రింబగళ్ళు కష్టపడి చదివేను. ఎలా చదివేనంటే వసుధా ఈ చదువుకు నేనెంత మూల్యం చెల్లిస్తున్నానో నేను గమనించుకోలేకపోయాను. నా చదువు పూర్తయ్యేటప్పటికి మా నాన్న చచ్చిపోయాడు. మా గుడిసె, వున్న కొద్దిపాటి పొలమూ అమ్ముడయిపోయేయి. మా పెద్ద అక్క ఆకలికి తట్టుకోలేక ఒక రెండెకరాల రైతుకి మూడవ భార్యగా వెళ్ళిపోయింది. రెండవ అక్క ఎవరితోనో ఎక్కడికో లేచిపోయింది. మా తమ్ముడు అడవుల్లోకి అంతర్ధానమయ్యేడు. చెల్లెలు కామందుగారింట్లో పనికి చేరింది. మాలో అందరికంటే చిన్నవాడు, ఆఖరి తమ్ముడు ఆకలికి తట్టుకోలేకుండా వున్నాడని మా అమ్మ జొన్న సంకటి తినిపిస్తే, అది అరగక కడుపునెప్పితో చచ్చిపోయాడు. నేను మాత్రం చాలా ఎక్కువ మార్కులతో ప్యాసయి, ఆ ఆనందంలో ఇంటికి వచ్చేను. ఈ విషయాలలో ఏవీ దాచతగినవి కావు. అందువల్ల మా అమ్మ దాచాలని విఫలయత్నం చేసినప్పటికీ అన్నీ నాకు తెలిసిపోయేయి. ఆఖరుగా మరొక భయంకరమయిన విషయం కూడా తెలిసింది. అది..."

'చెప్పటమా? మానటమా?' అని అతను ఒక్కక్షణం ఆగేడు.

వసుధ తననే చూడటం గమనించి, కళ్ళు మూసుకుని చెప్పేడు.

"మా అమ్మ తన పొట్ట గడవటంకోసమూ, నా చదువు ఆగకుండా వుండటంకోసమూ వ్యభిచారం చేస్తోంది. ఆరుగురు బిడ్డల తల్లి, అనారోగ్యపు శరీరాన్ని కూడా కొనుక్కునే వారున్నారని తెలిసేక, నాకీ వ్యవస్థపట్ల ఏవగింపూ, జుగుప్సా కలిగేయి.

"వసుధా! మా అమ్మ ఎంతో బలవంతపెట్టినప్పటికీ నేను కాలేజీలో చేరలేదు. మా అమ్మనూ, నన్నూ పోషించుకోవటానికి చిన్న చిన్న పనులు చాలా చేసేను"

"డాక్టరుగారి సహాయం అర్థించవలసింది. ఆయన తప్పక సాయపడేవారు"

వసుధ మాటలకు కృష్ణ నవ్వేసి,

"పిచ్చి వసుధా! ఇప్పుడు వాడు డాక్టరు కానీ అప్పుడు నాలాగే చిన్నవాడు. తండ్రిచాటు బిడ్డ. పైగా నా ఒక్కడి బతుకు నాకు సమస్య అనిపించలేదు. నాలాంటివాళ్ళందరి సమస్యలకూ మార్గం కావాలి. దాని కోసం నేనీ మార్గం ఎన్నుకున్నాను"

"ఇదేం మార్గం కృష్ణమోహన్‌గారూ! ఇంత బాధ... ఇంత రక్తం. ఇన్ని జీవితాలు ఇలా నేల రాలిపోవటం? ఇంతకంటే ఈ



సమస్యా పరిష్కారానికి మరొక మార్గమే లేదా? "

"వసుధా! జీవితంలో విలువైనదేదీ అయా చితంగా లభించదు. దానికోసం ఎన్నో త్యాగాలు చేయవలసి వుంటుంది. రష్యా చరిత్ర, చైనా చరిత్ర ఆ నిజాన్నే చెపుతు న్నాయి. ఇప్పుడు ఆ దేశాలన్నీ స్వయం సమృద్ధమైనవి. బీదతనమూ, అనా రోగ్యమూ మచ్చుకయినా కన్పించవు. ధనిక, బీద తారతమ్యం లేదు"

ఈ కొత్త సిద్ధాంతం వసుధకు తెలియదు. ఆమెకు రాజకీయ పరిజ్ఞానంలేదు. కృష్ణమో హన్ అబద్ధం చెపుతున్నాడని ఆమె అనుకో వడంలేదు. రష్యా, చైనాలలో వర్గభేదం లేకుంటే అది నిజంగా హర్షణీయమైన సంగతే. కానీ ఆ సమసమాజ స్థాపనకు ఇన్నివేలమంది మేధావులు, శ్రామికులు రక్తం ధారపోయడం ఏం సబబు? వర్గబే ధాన్ని నిర్మూలిస్తామంటూ, ఆ వర్గపు మను ష్యులనే అంతం చేయడం ఏం న్యాయం? వసుధకు తలాతోకా లేని ఎన్నో ఆలోచనలు కలిగాయి. కానీ వాటినేమీ ఆమె వెల్లడించ లేదు. కానీ మనసంతా దిగులుతో నిండిపో యింది. కృష్ణమోహన్ జీవితం తనకంటే దుర్భరమయింది అనుకుందామె!

ఆ రాత్రి ఆమెకు ఎన్నో కలలు వచ్చాయి. ఆ కలలనిండా కృష్ణమోహనే. తనలాగే బీదవాడు. నా అంటూ ఎవరూ మిగలని వాడు. తనవంటి నిర్భాగ్యులకోసం పోరాడే వాడు. తన రక్తం ధారపోసేవాడు. అతన్ని ఎంతోమంది పోలీసులు తరుముతున్నారు. అతను పరిగెత్తుతూ వున్నాడు.

★ ★ ★

రెండురోజులు అనుకున్న భవానమ్మగారి కుటుంబపు యాత్ర నాలుగు రోజులు పట్టింది. ఈ నాలుగురోజుల్లో ఏదో అద్భుతం జరిగి, రాధ ఆకర్షణలో పడి తల మునకలై రవీంద్ర, ఎనాటమీలేదు, వంకా యాలేదు. పెళ్ళి జరిపించెయ్యండి అంటా డని భవానమ్మగారు ఆశించింది. పిల్లలు, వాళ్ళందరితోపాటు రవీంద్రా విహారయా త్రను పూర్తిగా ఆనందించారు. కనీసం పైకి అతను అలా కన్పించాడు. ఎందుకంటే అతని శరీరమే అక్కగారి కుటుంబంతో సాగర్ వచ్చింది. మనసును అతను వసుధ దగ్గరే వదిలేసి వచ్చాడు. భవానమ్మగారు తన శాయశక్తులా కృషిచేసి తమ్ముడికీ, కూతురికీ ఏకాంతాన్ని కల్పించింది. రాధ ఆ ఏకాంతాన్ని వినియోగించుకోవాలని కూడా ప్రయత్నించింది. ఆ రెండు చర్యలనూ రవీంద్ర గమనించాడు కూడా. 'అక్కా! నన్ను క్షమించు. రాధకి వేరే సంబంధం చూడండి' అని చెప్పాలని చాలాసార్లు అను కున్నాడు. అలా చెప్పకుండా వాళ్ళని ఇంకా ఆ భ్రమలో వుంచడం అన్యాయం అని కూడా అతనికి అన్పించింది. కానీ వాళ్ళు వెంటనే వసుధను అనుమానించి, అవమా నిస్తారేమో అని అతను భయపడ్డాడు. వసుధ మనసు అతనికి తెలియదు. ఆమె కూడా తనను వాంఛిస్తున్నట్టయితే అతను కుండ బద్దలు కొట్టినట్లు ఈ విషయం అక్క గారితో చెప్పి వుండేవాడు. వసుధకు రక్ష ణగా తాను నిలబడేవాడు. కానీ అతనికి వసుధ మనసులో ఏముందో తెలియదు. తెలిసేవరకు అతను ఏం చెయ్యడానికీ అస హాయుడు. అందువల్ల అతను రాధ అతిచ నువుని దుర్భరమే అయినా భరించాడు. అమ్మయ్య! తమ్ముడు ఇంకా చెప్పుచేతల్లోనే వున్నాడు అనుకుంది భవానమ్మ.

"మామయ్య పెళ్ళి గురించి ఏమన్నా అడి గాడా? " అని అడిగింది కూతుర్ని. యువతీ యువకులు, అందునా వివాహం నిశ్చ యమైపోయినవాళ్ళు ఏకాంతం లభిస్తే దాన్ని వినియోగపరుచుకుంటారనే ఆవిడ ఉద్దేశ్యం. పూర్వం 'పెళ్ళికాని తల్లులు ఎందు కులేరు? అంటే కో-ఎడ్యుకేషన్ లేదు కనుక అని నమ్మే వెర్రి ప్రజల్లో ఆవిడ ఒకతె. ఆ కారణంగా... కూతురు వ్యక్తు




# ఏరినముత్యాలు

★ ఒక్క 'రవ్వ' జ్వాలను రగిలిస్తుంది.

– లెనిన్

★ కాలమును మించిన మంచి బోధకుడు లేడు.

– పర్షియన్ సామెత

★ ఉత్సాహంలేకుండా ఇంతవరకూ ఎవరూ గొప్ప కార్యమును సాధించలేదు.

– ఎమర్సన్

★ మిగిలిన ఒక్క వంతుమాత్రం వారసత్వంగా సంక్రమించింది కావచ్చు.

– ఐ.యం. సెచెనోవ్

★ నా వద్ద ఏమైనా డబ్బు వుంటే దానితో పుస్తకాలు కొంటాను. పుస్తకాలు కొనగా డబ్బు మిగిలితే దానితో తిండి, బట్ట సమకూర్చుకుంటాను.

– ఎరాస్మస్

★ మనబాధలను మర్చిపోడానికి మార్గం ఇతరుల బాధల నివృత్తికి కృషి చేయడమే.

– ఒక సూక్తి

★ ఎవ్వరైనా పశువు కాదలచుకుంటే మానవాళి యాతనను చూడకుండా కళ్ళు మూసుకుని తనగురించి మాత్రమే చూసుకోవచ్చును.

– మార్క్స్

★ శిక్షణ పొంది ఉండకపోతే యంత్రాన్ని నడుపవద్దు.

– ఒకసూక్తి

★ కృత్రిమ సౌందర్యం వేశ్య వంటిది.

– టాల్‌స్టాయ్

★ మనిషి ఎలాంటివాడో హృదయం వల్లనే కాదు, ముఖంలోనూ తెలుస్తుంది

-జార్జ్ మాక్‌డొనాల్డ్

★ వికృతమైన మనసు కంటే వికృతమైన ముఖం మంచిది.

– జేమ్స్ ఎల్లిన్

★ సంతోషాన్ని మించిన సౌందర్య సాధనం ప్రపంచంలో మరొకటి లేదు.

– లేడీ బెస్సింగ్టర్

★ కొత్తదనం పట్ల ఆపేక్ష మానవుని స్వభావంలోనే ఉంది

– ప్లీనీ

★ నీ సంతుష్టికై విందారగించు ఇతరుల సంతుష్టికై దుస్తులు ధరించు.

– ఫ్రాంక్లిన్

సేకరణ: టి.తిప్పారెడ్డి

రాలయినప్పటినుండీ ఆమెను తమ్ముడి బారినపడకుండా తాను కాపాడానని అను కుంటూ వచ్చింది. ఇప్పుడు తమ్ముడు వసుధ వలలో పడకుండా కూతురిని ఎర వేశానని, ఆ ఎరపట్ల తమ్ముడు ఆకర్షితుడై వుంటాడని ఆమె ప్రగాఢంగా నమ్ము తోంది.

"పోమ్మా! నీకెప్పుడూ అదే గోల" అంది రాధ కొంచెం సిగ్గుపడుతూ. నిజానికి ఆమెకు కూడా అదే గోలగావుంది. స్నేహి తులంతా రాధదే అదృష్టం. సినిమా హీరో లాంటి మొగుడు నిశ్చయమైపోయి ఉన్నాడు' అని ఆటపట్టిస్తున్నారు. శరీ రమూ, మనసూ కూడా అతని సాన్ని ధ్యాన్ని కోరుకుంటూనే వున్నాయి. 'తన చదువుకోసమే పెళ్ళి వాయిదా వేశాడు పాపం!' అని మనసుకి ఎంత నచ్చచెప్పు కున్నా, ఏకాంతంలో కూడా తన చిటికెనవే లయినా తాకని మామయ్యపట్ల ఆ అమ్మా యికి పీకలవరకూ కోపంగా ఉంది. మోస్ట్ అన్ రొమాంటిక్ ఫెలో అని ప్రతిక్షణమూ తిట్టుకుంటూనే వుంది.

భవానమ్మగారు ఏ పరిణామం అయితే రాధా-రవీంద్రలపట్ల జరగాలని ఆశిం చిందో, దేనికోసమైతే విహారయాత్ర వంకన ఆ యువతీయువకులను బయలు దేరతీసిందో ఆ పరిణామం ఆ విహారయా త్రవల్ల గుంటూరులో వున్న వసుధా కృష్ణ మోహన్‌లమధ్య సంభవించింది. రవీంద్ర వుంటే ఎప్పుడూ అతనితోనే కాలక్షేపం చేసే కృష్ణమోహన్ అతను లేక, కాలం గడవక వసుధతో స్నేహం మొదలుపె ట్టాడు.

ఎన్నడూ చదువుపట్ల తప్ప మరి ఏ విష యంలోనూ దృష్టిపెట్టని వసుధ ఈ కృష్ణ మోహన్ మాయామోహంలో ఎలా ఇరు క్కుందో తెలియదు. కృష్ణకు కూడా తన సిద్ధాంతంపట్ల తప్ప మరి దేనిమీదా ఆసక్తిలేదు. ఎన్నడూ అభిమానమూ కలగ లేదు. అతను ఏ స్త్రీనీ ఈ దృష్టితో చూడ లేదు. అతను తాను యువకుడినని మరి చిపోయాడు. కేకలు, ఆర్తనాదాలు తప్ప అతనికి కోయిల కూతలు, వసంతగానాలు ఎన్నడూ వినరాలేదు. అతను ప్రేమ గు రించి ఎన్నడూ ఆలోచించలేదు.

అయినా ప్రేమంటే ఏమిటి? బలవం తంగా తన అభిప్రాయాలు ఆమెపై రుద్ద టమా? లేక ఏ మాత్రమూ పొంతనలేని ఆమె అభిప్రాయాలతో తాను ఏకీభవించ టమా? తన జీవిత విధానమూ, ఆమె జీవించే విధానమూ రెండూ సమాంతర రేఖలు. అవి ఎన్నటికీ కలవవు. నేనామె పొందును ఆశించడం పసిపిల్లవాడు ఆకా శంలో చందమామను ఆశించడం వంటిది అనుకున్నాడతను నిస్పృహగా.



"ఈ రెండుకాళ్ళకూ కట్లు విప్పెయ్. నేను వెళ్ళాలి" అన్నాడు కృష్ణమోహన్. అత నితో ఈ విధమైన పేచీ ప్రతిరోజూ రవీం ద్రకు అలవాటైపోయింది. అందువల్ల సమా ధానం ఇవ్వలేదు.

"ఏంటీ వినపడిందా? కట్లు విప్పెయ్. నేను వెళ్ళాలి. అక్కడ నావాళ్ళనందరినీ




ఊచకోత కోస్తున్నారు. నేనిక్కడ బ్రహ్మాండ మయిన నర్సింగ్‌హోంలో పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నాను. తలబద్దలు కొట్టుకొని చావాలన్పిస్తోంది"

"అది బెటర్. జీవితాంతం దేకేకంటే?"

"అంటే?"

"అంటేనా? నిన్ను ఆసుపత్రికి తీసుకు వచ్చి పడేశారుచూడు, అప్పటికి నీకు స్పృహ లేదు. గవర్నమెంటు ఆసుపత్రిలో పడేస్తే నిన్నీపాటికి పోలీసువాళ్ళు 'ఎన్‌కౌంటర్' చేసి పడేసేవాళ్ళు. నా అదృష్టమూ, నీ అదృష్టమూ బావుంది. ఆ భాస్కరం... నువ్వు ఇరవై నాలుగ్గంటలూ సీపీయం వాడని తిడతావే వాడు తెలివిగా తెచ్చి నిన్నిక్కడ పడేశాడు. నా స్నేహితుడు ఆర్థోపెడిషియన్ వుంటే అతన్ని ఇక్కడికి రహస్యంగా రప్పించి, దొంగచాటుగా ఎక్స్‌రేలు తీయించి, ఈ కట్లు కట్టించాను. ఆయనే చెప్పాడు, 'హెయిర్ స్ప్లిట్ ఫ్రాక్చర్' వుందనీ, మూడునెలల విశ్రాంతి అవసరమనీ"

కృష్ణమోహన్ అపనమ్మకంగా చూశాడు.

"నేను యస్సెల్సీగాడినని ఏవేవో మెడికల్ టర్మ్స్ చెప్పి భయపెడతావ్. నాకేమీ నొప్పి లేదే. అసలు ఆ ఎముకల డాక్టరెవర్రా? మళ్ళీ నాకు కనపడలేదు. నేను కట్టు విప్పేసి వెళ్ళిపోతే ఏమవుతుందంటా?"

"నొప్పి లేకపోవటమేమిట్రా ఫూల్! నొప్పి వుంటుంది. నీకు నొప్పి అలవాటయిపోయి ఉంటుంది. అందువల్ల తెలియడంలేదు. ఇక ఆ ఎముకల డాక్టరంటావా? నీకీ కట్టు వేసినందుకే వణికి చస్తున్నాడు, ఏ క్షణాన పోలీసులొచ్చి తనని ఇంటరాగేషన్ పేరు చెప్పి విరగబొడుస్తారోనని. అందులోనూ డాక్టరునీ, స్నేహితుడినీ నేను వుండగా తనెందుకింక దండుగ అనుకుని వుంటాడు. మైడియర్ మిస్టర్ కృష్ణమోహన్! ఇక నీ మూడవప్రశ్నకు సమాధానం విరిగిన కాళ్ళు అతుక్కోకుండానే కట్లు విప్పేస్తే జీవితాంతం వాహనయోగమే. అంటే చక్రాల కుర్చీ ప్రాప్తి అన్నమాట. నువ్వేమో వీర కమ్యూనిస్టువాయె. అది లగ్జరీ అని వాడక పోతే ఇక దేకటమే గతి. అవునంటావా? కాదంటావా?"

"షటప్! ఇడియెట్! నువ్వు నన్ను మోసం చేస్తున్నావేమోనని నాకు గట్టి అనుమానం"

"ఒట్టేసి చెపుదామంటే మీ ఎర్రవీరులకు ప్రమాణాల్లో నమ్మకం వుండదాయె. ఎట్లా చచ్చేదిరా?"

తర్వాత వసుధ కూడా రవీంద్రను అదే ప్రశ్న అడిగింది.

"ఈయనకు నిజంగానే ఇంత విశ్రాంతి అవసరమా?"

"ఏంటికథ? వాడికి సి.ఐ.డి.గా పనిచేస్తున్నావా కొంపదీసి? చిన్నప్పుడు మీ అన్నయ్య క్రిస్టియను స్కూల్లో పడేస్తే క్రిస్టియన్ కాకుండా తప్పించుకున్నావు. కిట్టిగాడి మాటల్లో పడ్డావా కమ్యూనిస్టువి అయిపోగలవు జాగ్రత్త. అది తప్పింది. ఇది తప్పదు"

"అదేంకాదు. ఆయనకు తెలియకూడదంటే తెలియనివ్వను. కానీ నిజం తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉంది"

రవీంద్ర నవ్వాడు.

"నిజంవరకూ వచ్చావు. ఇకముందు 'కమ్యూ' కూడా తగిలించేసుకో, వాడికి దగ్గరైపోదువుగాని" అన్నాడు.

'అదే అయిపోతున్నట్టున్నాను' అనుకుంది వసుధ.

తర్వాత రవీంద్ర ఆమె అడక్కుండానే చెప్పాడు.

"వాడికి కాలూ విరగలేదు, కీలూ విరగలేదు. కానీ మూర్ఖుడు. ఇప్పుడు వదిలానా? ఉద్యమం అంటూ అడవుల్లోకి పరుగెత్తుతాడు. అక్కడ మహామహా వాళ్ళనే చంపేశారు. పెద్దపెద్ద వాళ్ళని. అందులో డాక్టర్లున్నారు. ఇంజనీర్లు, టీచర్లు, సాధారణ గిరిజనులు... ఎంతోమందిని పిట్టల్ని కాల్చి

నట్టు కాల్చిపారేశారు. వాడి సిద్ధాంతం కరెక్టో, కాదో నాకు తెలియదు. కానీ వాడు ఇప్పుడు అక్కడికి వెళ్ళడం ఆత్మహత్యా సదృశం. వాడితో ఈ రేంజి డిఐజి నాకు తెలుసని అబద్ధం ఆడాను. కానీ నిజానికి నాకు తెలిసినవాడు ఇక్కడి డియస్పీ. అత నికి వీడు ఇక్కడున్నాడని తెలుసు. నేను నా పర్సనల్ రిక్వెస్ట్‌మీద వీడిని యిక్కడ వుంచగలిగాను. పైఉద్యోగులకు తెలిసిందా అతని ఉద్యోగమూ గోవిందా, నాకు శ్రీకృష్ణ జన్మస్థాన ప్రాప్తి. వీడు ఇక్కడనుండి కది లితే మాత్రం తాను అరెస్టుచేసి తీరతానని, ఆ విషయంలో తాను నిస్సహాయుణ్ణనీ చెప్పాడు.

అందుకని కాళ్ళకు దొంగ కట్లు కట్టాను. దయచేసి వాడికి ఇవేమీ తెలియనివ్వకు"

వసుధ 'తెలియనివ్వను' అన్నట్టు తల అడ్డంగా ఊపింది.

'ఇతనొక వెర్రిగాలివంటివాడు. ఇలా వచ్చాడు. గాలి బొగడపూలను రాల్చిపోయి నట్టు తన హృదయాన్ని కదిపి కుదిపేస్తు న్నాడు. తర్వాత గాలికి తెలుస్తుందా తనేం చేసిందో' అనుకుంది వసుధ కృష్ణమోహన్‌ని ఉద్దేశించి. కానీ అతను అలా అనుకోలేదు. అతను ఒకచోటే ఆగని కొండగాలి అయితే కావచ్చుకానీ, ఈ భొగడపూలమీద ప్రేమ లేకపోలేదు. అవి వసుధ స్మృతులైతే వాటిని తనతో తీసుకెళ్ళాలనే అతని ఆకాంక్ష. కానీ బొగడచెట్టుని సైతం తీసుకు వెళ్ళాలనే అత్యాశకాదతనిది. తోటలో పెరిగి, వేళ్ళూనుకున్న మానుని నరికి అడ విలో నాటడం వెర్రితనమని అతనికి తెలుసు. అందువల్ల తాను ఆమెకి ఏ ఆశలూ కల్పించలేదనే అతను అనుకు న్నాడు. కానీ కళ్ళు మనసుకు వాకిళ్ళని ఏ కవి అన్నాడో కానీ వసుధకు అతని కళ్ళల్లో తన ప్రతిరూపం స్పష్టంగా కనిపిస్తోంది. అటువంటి ప్రతిరూపమే సరిగ్గా వెతికితే ఆమెకు రవీంద్ర కళ్ళల్లోనూ కనిపించి ఉండేది. ఆమె వెతకలేదు. అందువల్ల అది కనిపించకపోవడం రవీంద్ర దురదృష్టం.

'నేను కృష్ణమోహన్ని ప్రేమించడం మూర్ఖత్వం. అతను పచ్చి మెటీరియలిస్టు. అతనికీ, నాకూ పొసగదు. అసలు రవీంద్ర నాటకాన్ని కొనసాగించలేని క్షణాన, ఇతను కట్టు విప్పుకుని అడవుల్లోకి పారిపోతాడు. కర్మసిద్ధాంతాన్ని నమ్మే నేను ఇటువంటి కర డుగట్టిన కమ్యూనిస్టుని ప్రేమించడం కేవలం నా దురదృష్టం. ఇతన్ని మరిచిపో వాలి. లేదా 'బాధే సౌఖ్యమని భావన రానీవోయ్' అని దేవదాసులా పాడుకోవాలి. అంతకుమించి దారిలేదు అనుకుంది వసుధ.

కానీ వసుధ స్త్రీ. ఆమె శరీరమూ, మనసూ యవ్వనారంభంలో వున్నాయి. అందునల్ల ఆమె పై రెండింటిలో ఏదీ చెయ్యలేకపోయింది. అతన్ని ప్రేమించ కుండా ఉండనూలేదు. బాధను సౌఖ్యమనీ భావించనూలేదు. రెండుమూడుసార్లు రవీంద్ర అడగనే అడిగాడు.

"ఆర్ యూ ఆల్‌రైట్ వసుధా? "

"అయామ్ వెరీమచ్ ఆల్‌రైట్ డాక్టరు గారూ!"

'అయ్యో! నేను ఎప్పటికీ డాక్టరుగారి నేనా? అంతకుమించి ఏమీ కానా? ' అను కున్నాడతను నిస్పృహగా.

★ ★ ★

"వసుధా! ఇవాళ ఏ బాబాగారి ఉపన్యా సాలూ లేవుకదా ఊళ్ళో? " రవీంద్ర ప్రశ్నకు వసుధ నవ్వేసింది.

"లేదండీ. మీకేమయినా పనుందా నాతో? "

"అవును. కూర్చో చెపుతాను"

"ఫర్వాలేదు. చెప్పండి? "

"కూర్చున్నాక చెపుతాలే"

ఆమె నవ్వుకుని కూర్చుంది. అతను తన స్థానంనుండి లేచి బయటకు వెళ్ళి అటూ ఇటూ చూసి వస్తూ తలుపు లోపల గడియ





వేసేశాడు. వసుధకు ఒక్కక్షణం గుండె గతుక్కుమంది. అతను అదేమీ పట్టించుకో కుండా తన కుర్చీలో కూర్చుని ముందుకు వంగి చెప్పడం మొదలుపెట్టాడు.

"ఇవాళ పేపరు చూశావా?"

ఆమెకు పేపరు చూడడం పెద్దగా అలవా టులేదు. కృష్ణవచ్చాక, అతను ఈ ఎన్‌కౌం టర్ల వార్తలు ఎర్రసిరాతో అండర్‌లైన్ చేయడం, వాటిని చూసి కుమిలిపోవడంతో ఆమెకు కూడా 'పేపరురోగం' అంటుకుంది. అదీకాక మధ్యాహ్నాలు లంచ్‌టైంలో ఆమె కృష్ణని చూడడానికి రావడం అలవాటు చేసుకుంది. ఆ సమయంలో రవీంద్ర క్లిని క్‌లో వుండడు. అతనూ భోజనానికి వెళ్ళ డంవల్ల తను మధ్యాహ్నాలు కృష్ణతో గడుపు తుందని అతనికి తెలుసోలేదో!. ఇవాళ మధ్యాహ్నం వచ్చేటప్పటికి కృష్ణమోహన్ భోజనం చెయ్యలేదు. కళ్ళు ఎర్రగా మంకెన పువ్వుల్లా వున్నాయి. పైకిచూస్తూ ఆలోచిం చుకుంటూ వున్నాడు. ఆమె సందేహిస్తూనే పక్కన పడివున్న పేపరుతీసి చూసింది. అందులో ఎవరో భార్యాభర్తల్ని పోలీసులు ఎన్‌కౌంటర్లో చంపేసినట్టు రిపోర్టు అయి వుంది.

"అయ్యో!" అంది వసుధ అప్రయత్నంగా.

"ఇలా ఎంతకాలం వసుధా! ఎంతమం దిని పొట్టన పెట్టుకుంటారు. పెట్టి ఎన్నాళ్ళు తప్పించుకుంటారు? దెబ్బకుదెబ్బ తియ్యకపోతే ఈ మారణకాండ జరుగు తూనే వుంటుంది" బిగించిన అతని చేతులు, ఆ ఉద్రేకమూ చూసి వసుధ భయపడిపోయింది. అతనితో మాట్లాడా నికే ఆమెకు జంకు కలిగింది.

తర్వాత ఆమె అక్కడ వున్న అరగంట లోనూ అతను భోజనం చెయ్యలేదు. ఆమెతో మాట్లాడనూలేదు. ఆమె అతనికి చాలా చెప్పాలనుకుంది. 'చావుకి చావు సమాధానంకాదు' అని చెపుదామా అను కుంది. 'మీరుచేసే వర్గశత్రు నిర్మూలన వల్ల వర్గాలు నిర్మూలించబడతాయా?' అని ప్రశ్నించాలనుకుంది. 'తలనొప్పి అని, దానికి మందివ్వకుండా తలనే నరుక్కోవడం ఏం భావ్యం?' అని నిలదీయాలనుకుంది. కానీ అతను ప్రసన్నంగా వున్నప్పుడే ఇటువంటి చర్చలకు తీవ్రంగా స్పందిస్తాడు. వాదించి ఆమె వాదన ఆమెకే తప్పు సుమా అనిపిం చేట్లు చేస్తాడు. అతన్ని తాను వాదనలో నెగ్గలేదు. రాజకీయ పరిజ్ఞానమూ, భాషాచా తుర్యమూ, వాదనాపటిమ ఏవీలేవు తనకి. డాక్టరుగారు జోక్ చేస్తుంటారు. 'వసుధా! వాడితో వాదించలేం. క్రిస్టియన్స్‌కి పాటలు, కమ్యూనిస్టులకు వాదన స్పెషలైజ్డ్ ఫీల్డ్. ఆ మతంలో చేరగానే నేర్చేసుకుంటారు. మనం వాళ్ళదారికి పోవాల్సిందే తప్ప వాళ్ళు మనదారికిరారు' అని. అవన్నీ గుర్తుకు వచ్చి కృష్ణమోహన్ ఆలోచనలకు అతన్నే వదలి ఆమె నిశ్శబ్దంగా నిష్క్రమించింది.

ఇప్పుడు డాక్టరుగారు పేపరు చూశావా? అని ప్రశ్నిస్తే ఏం సమాధానం చెప్పాలో తెలీక అవునుకూ, కాదుకూ మధ్యస్థంగా తల ఊపింది. తాను మధ్యాహ్నాలు క్లినిక్‌కి వస్తున్నట్లు అతనికి తెలీడం ఇష్టంలేక, కానీ రవీంద్ర ఆమెనుండి సమాధానం ఆశించిన ట్టులేదు. తను చెప్పదలుచుకున్న విష యాన్ని కొనసాగించాడు.

"ఆ పేపరులో కృష్ణగ్రూపు వాళ్ళిద్దరిని చంపేసినట్టు రిపోర్టుంది. ఈసారి గ్రూపు వాళ్ళు బాగా రియాక్టు అయ్యారు. ఆ ఎన్ కౌంటర్‌కి ప్రతీకారంగా ఇక్కడ సి.యం. కొడుక్కి తోడల్లుడు ఒకాయన ఉన్నాడు. పొగాకు వ్యాపారస్తుడు. అతన్ని చంపాలని నిర్ణయించుకున్నారు"

వింటున్న వసుధకు గొంతు తడారిపో యింది.

"మీకెట్లా తెలుసు?" అంది ఆశ్చర్యంతో.

"పోలీసులు వీళ్ళకంటే పెద్ద గూండాలు. వాళ్ళ సంగతులు వీళ్లకూ, వీళ్ళ సంగతులు వాళ్ళకూ తెలుస్తూనే వుంటాయి. నా స్నేహి



తుడు డి.యస్పీ అని చెప్పానుకదా. అతనికి 'న్యూస్' అందింది. గణపతి అని మన కృష్ణ సహచరుడు ఊళ్ళోకి వచ్చాడు. ఏ క్షణాన్న యినా వీడికోసం ఆసుపత్రికి వస్తాడని అతని అంచనా. మన ఆసుపత్రి చుట్టూ పోలీసులు మఫ్టీలో వున్నారు"

వసుధకు ఒళ్ళంతా చెమటలు పట్టాయి.

"రిలాక్స్ వసుధా! కంగారుపడకు. మనం అతను వీడిని కలవకుండా చూడాలి"

"వసుధా! నేను ఉండను. నన్ను చూస్తే మరీ రెచ్చిపోయి వాదిస్తాడు. ఒక ఇంజెక్షను యివ్వు"

"ఏ ఇంజెక్షను? "

"భయపడకు. కాంపోజేలే. రేపు కట్టు విప్పుతారు. నొప్పి తెలియకుండా వుండేందుకు అని నచ్చచెప్పి అది చేసేశావంటే నిద్రలో పడి వుంటాడు"

వసుధకు ఎందుకో భయమేసింది.

"అలా ఎందుకండీ? ఆ గణపతెవరో వస్తే ఊరుకుంటారా? బయటనే అరెస్టు చేసెయ్యరూ? "

"అయ్యో! పిచ్చిదానా! వాళ్ళు దేవాంతకులు. ఏ పల్లెటూరి బైతు వేషంలోనో దిగాడనుకో. వాళ్ళు గుర్తుపట్టలేదనుకో. అదీగాక డియస్పీ కృష్ణ నా క్లినిక్‌లో వున్నంతసేపూ వాడిజోలికి రానని మాటిచ్చాడు. కానీ బయటకు వస్తే అరెస్టు చేస్తాననే చెప్పాడు. కృష్ణని ట్రాప్ చెయ్యడానికి వాళ్ళు గణపతిని గుర్తుపట్టి కూడా హాస్పిటల్‌లోకి వస్తుంటే ఊర్కోవచ్చు"

"అతను లోపలకు వచ్చి కృష్ణని, అదే కృష్ణమోహన్‌గారిని కలుస్తానంటే ఆయనకు బాగాలేదు. ఎవరూ చూడకూడదు అని అతన్ని రానివ్వను"

"నువ్వు చాలా అమాయకురాలివి వసుధా! అతని గొంతు కిట్టిగాడు విన్నాక నువ్వు వాడిని కంట్రోల్ చెయ్యగలననే అనుకుంటున్నావా? మనందరినీ తోసిపారేసి అతనితో వెళ్ళిపోతాడు. తెల్లారేప్పటికి పోలీసులు కాల్చి మన క్లినిక్ ముందే పారేసిపోతారు"

వసుధకు ఏడుపొకటే తక్కువ.

"నా మాటవిను. వెధవకి కాంపోజ్ చేసి పడెయ్యి. నేను మళ్ళీ ఒకసారి డియస్పీతో మాట్లాడతాను. వీలయితే ఈ రాత్రికి ఇక్కడే వుండిపో"

"మీ అక్కగారు కోప్పడతారు" అంది బెరుగ్గా వసుధ భవానమ్మను ఉద్దేశించి. ఆమె తామిద్దరిమధ్యా ఏదో వుందని అనుమానిస్తోందని ఇద్దరికీ అర్థం అయింది.

వసుధ బెరుకు చూసి రవీంద్ర నవ్వేశాడు.

"కోప్పడదులే. నేను అక్కడే వుంటాను. నువ్విక్కడ పేషంటుదగ్గర వున్నావని చెపుతాను"

వసుధ తల ఊపింది.

★ ★ ★

వసుధ తన పాత్ర చక్కగా రిహార్సలు చేసుకుని కృష్ణ గదిలోకి వెళ్ళింది.

"మీకో శుభవార్త!"

"నాకా? ఏంటి? దేశంలో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారా? " అన్నాడు కఠినంగా.

బాధ. ఏమీ చెయ్యలేని నిస్సహాయత, తన శారీరక బలహీనతపై తనకే కోపం. మధ్యాహ్నం భోజనం చెయ్యకపోవడం వల్ల నీరసం, అతిగా ఆలోచించడంవల్ల తల నొప్పి, ఏం చెయ్యాలో తోచని అయోమయం. అతనినుండి మృదువైన మాటలను వసుధ ఆశించలేదు కూడా.

"ఆ! దాదాపు అలాంటిదే. రేపు మీ కాళ్ళ సిమెంటు కట్లు విప్పేస్తున్నారు. మీరు స్వేచ్ఛాజీవి. వెళ్ళి మీవాళ్ళు అధికారంలోకి రావడానికి ప్రయత్నిస్తారుకదా! మరి ఇది శుభవార్తేనా? కాదా? "

అతను చిన్నపిల్లాడిలా సంతోషపడ్డాడు.

"డాక్టరుగాడేడీ? వాడితో చాలా మాట్లాడాలి? "

"ఆయనలేరులెండి. వాళ్ళ అక్కగారింటికె ళ్ళారు"

"ఎవరూ? ఆ భవానీమాతేనా?"

"ఆవిడ కూడా మీకు తెలుసా?"

"ఎందుకు తెలీదు? మహాతల్లి నన్నెప్పుడూ పేరుపెట్టి పిలవలేదు. కులం పేరుతోనే పిలిచింది. వాళ్లకో అమ్మాయుండేది. ఒకటేమిటిలే చాలామంది ఉండేవాళ్ళు. వాళ్ళలో పెద్ద అమ్మాయి తెల్లగా, బొమ్మలా వుండేది. ఆ పిల్లని పెళ్ళిచేసుకుని ఆవిడ తిక్క కుదర్చాలనుకునేవాణ్ణి"

వసుధ నవ్వింది. "మీకు ఆ అవకాశంలేదులెండి. మీ స్నేహితుడు ఆ ఛాన్సు కొట్టేస్తారనుకుంటా. మనం భోం చేద్దామా?"

"వద్దు వసుధా! లక్ష్మక్కనీ, నాయుడినీ కాల్చిపారేశారు"

"అందుకని మీరు అన్నం తినటం మానేస్తారా?"

"కమ్యూనిస్టులు కూడా మనుషులేగా వసుధా! వాళ్ళు ఏడవరనీ, బాధపడరనీ, జీవితమంటే వాళ్ళకు లక్ష్యంలేదనీ మీ అందరి అభిప్రాయం అనుకుంటా"

"అయ్యో! నా అభిప్రాయం అదికాదండీ. మనుషులు కాబట్టే భోజనం చెయ్యమంటున్నాను. అదీకాక మీకు ఒక ఇంజెక్షను చెయ్యాలి. అది కడుపు ఖాళీగా వుంటే ఇవ్వకూడదు"

"ఇప్పుడు నాకు ఇంజెక్షన్ ఎందుకు?"

"రేపు మీకు కట్లు విప్పుతున్నారు కదా! నొప్పి చాలా ఎక్కువగా వుంటుందట. ఆ నొప్పి తెలియకుండా..."

"రేపు నొప్పి తెలియకుండా ఇవాళ ఇంజెక్షనా? వెరీ స్ట్రేంజ్" అని భుజాలు ఎగరేశాడు.

వసుధ అతనికి భోజనం కొసరి కొసరి వడ్డించింది. అతను బుద్ధిగా ఇంజెక్షను చేయించుకున్నాడు.

తలుపులు వేసి కర్టెన్లు దగ్గరకు లాగింది.

"వసుధా! ఇవాళ నువ్వు ఇంకా ఇంటికి వెళ్ళలేదేం?"

"ఇవాళ క్లినిక్‌లో కొంచెం పనివుంది. పొద్దుపోతే ఒంటరిగా ఇంటికి వెళ్ళడం క్షేమంకాదు. ఇక్కడే పడుకోమన్నారు డాక్టరుగారు" తడుముకోకుండా అబద్ధమాడింది.

"అయితే నాకు నిద్ర వచ్చేవరకు కూర్చో కబుర్లు చెప్పుకుందాం"

"కబుర్లు వద్దులెండి. కార్డ్సు ఆడదాం"

"నీ దగ్గర ఉన్నాయా?"

"డాక్టరుగారి డ్రాలో ఉన్నాయి. పట్టుకొస్తాను"

వసుధే ఇద్దరికీ పేక పంచింది.

"పందెం ఏదీలేదా వసుధా!"

"పెద్దవాళ్ళు మీరే చెప్పండి?"

అతను పరీక్షగా ఆమెను చూశాడు. రేపు తన కట్లు విప్పేస్తారు. బహుశా తాను వెంటనే వెళ్ళిపోతాడు. ఈ అమ్మాయిని... ఇంత దగ్గరగా వచ్చిన అమ్మాయిని ఇక్కడే వదిలి...

"వద్దులే"

"అదేం? చెప్పండి. పందెం లేకపోతే మజాయేలేదు"

"అయితే చెపుతున్నాను విను. మళ్ళీ కోపం తెచ్చుకోకూడదు. అదేదో సినిమాలో లాగా ఓడినవాళ్ళు గెలిచినవాళ్ళకి ముద్దివ్వాలి"

వసుధ నల్లటి చెక్కిళ్ళలో కూడా ఎర్రదనం కన్పించింది.

"అదేం పందెం? నేను ఒప్పుకోను. ఓడినా, గెలిచినా ముద్దుపెట్టుకోక తప్పదుగా"

"అదెలా వసుధా! చాలా తేడావుంది. ఓడితే ముద్దివ్వాలి. గెలిస్తే ముద్దు పుచ్చుకోవాలి. తేడా లేదంటావేం?" అని అతను హఠాత్తుగా ఒంగి ముడిచిన ఆమె పెదవులను గాఢంగా చుంబించాడు. కాంపోజ్ మత్తు అతని మీద పనిచేస్తోంది. కళ్ళు నెమ్మదిగా మూసుకుంటున్నాయి. కానీ నిద్రకాదు. వసుధ అతనిలాకాదు.

పూర్తి స్పృహలో వుంది. అతనేం చేస్తు న్నాడో తెలుస్తోంది. భయంగా మూసిన తలుపులవంకా, కిటికీ తెరలవంకా చూసింది. ఈ క్షణాన గణపతి వచ్చి ముందు నిలిచినా, వసుధ పొందుకోసం సర్వాన్నీ తిరస్కరించేలా వున్నాడు కృష్ణ. ఆ క్షణాన ఆమె మనసులో ఏముందో ఆమెకే తెలీదు. తను శృంగారపు సంకెళ్ళలో అతన్ని బంధించాలనుకుంటోందా? లేక రేపు ఉదయం అతను జరిగినదానికి పశ్చా త్తాపపడి, అడవుల్లోకి పారిపోవాలనే తన నిర్ణయాన్ని మార్చుకుంటాడని ఆశపడు తోందా? లేక అతను వెళ్ళిపోయినా అతని స్మృతి తనలో నిలిచి పోబోతోందని తృప్తిగా వుందా? ఏమయినా తొలి అను భవం... ప్రేమించిన పురుషుడు! ఆమె చేయి చాచి లైటు ఆర్పేసింది.

★ ★ ★

రవీంద్ర భవానమ్మగారి ఇంటికి వెళ్ళాడే గానీ, అతని మనసంతా కృష్ణ చుట్టూ తిరు గుతోంది. గణపతి వచ్చి వుంటాడా? వస్తే క్లినిక్‌లోకి రాగలిగివుంటాడా? పోలీసులు అతన్ని కాల్చేస్తారా? కృష్ణ పరిస్థితి ఏమిటి? వసుధ వాడిని కన్విన్స్ చేసి ఇంజె క్షన్ చేసే వుంటుంది. చెయ్యలేకపోతే... ప్రాణ స్నేహితుడిని తోడేళ్ళ గుంపులో వదిలి తానిక్కడ ఏంచేస్తున్నాడు? తన భవిష్య త్తును కాపాడుకుంటున్నాడా? లేక ప్రియస ఖిని అక్క తనతో కలిపి అనుమానించ కుండా 'ఎలిబీ' సృష్టించుకుంటున్నాడా? క్షణక్షణానికీ రవీంద్రలో అసహనం పెరిగి పోతోంది. అతను ఇక అక్కడ ఆగలేకపో యాడు. గబగబా కారు తీసుకుని క్లినిక్‌కి వచ్చాడు. వరండాలో ఆనందరావు పడుకు నివున్నాడు. అతనికి పోలీసులు... ఈ గొడ వలు ఏమీ తెలియనందువల్ల నిశ్చింతగా పడుకుని వున్నాడు.

రవీంద్రను చూసి లేచి నిలబడ్డాడు.

"ఏమయ్యా! ఇప్పుడొచ్చారు? " అనడిగాడు.

"కొంచెం పని వుండి వచ్చాను. నువ్వు పడుకో"

అతను తిరిగి పడుకోబోతుండగా అడి గాడు.

"కృష్ణ పడుకున్నాడా? వసుధేదీ? "

"ఆ అయ్యగారు తొమ్మిదింటికే పడుకు న్నారయ్యా! వసుధమ్మ ఇంటికెళ్ళిపోయిం దనుకుంటా. నేను భోజనం చేసి వచ్చేటప్ప టికే ఆయన గదిలో లైటు లేదు."

రవీంద్రకు వసుధ మీద మొదటిసారిగా చాలా కోపం వచ్చింది. చిలక్కి చెప్పినట్టు చెప్పాడు తను కృష్ణని వదిలి వెళ్ళొద్దని. అయినా వెళ్ళిపోయింది. ఇంజెక్షన్ అయినా ఇచ్చిందో లేదో అతను విసుగ్గా వెళ్ళి కృష్ణ గది తలుపులు తోశాడు. లోపల గడియ వేసివుంది. అతను నొసలు చిట్లించాడు. గడియ వేసివుందే! కొంపదీసి గణపతిగాని వచ్చేశాడా? లోపలనుండి సన్నగా శబ్దాలు వినిపిస్తున్నాయి. నిశ్శబ్దంగా, పిల్లిలా అడు గులో అడుగు వేసుకుంటూ అతను కిటికీ దగ్గరగా వచ్చి తెరను పక్కకు జరిపి లోప లకు చూశాడు. అతని గుండెల్లో అణుబాం బులు పేలాయి. శరీరంలోని శక్తి అంతా ఒక్కసారిగా హరించుకుపోయినట్లు తోచింది. ఎన్నోరకాల భావాలు కలగాపుల గంగా మదిలో కదిలాయి. అతను నిస్సత్తు వగా, సామ్రాజ్యం కోల్పోయిన చక్రవర్తిలా, కాళ్ళీడ్చుకుంటూ వచ్చి తన గదిలో కుర్చీలో కూలబడ్డాడు. ఆనందరావు వచ్చి గుమ్మం ముందు నిలబడ్డాడు.

"ఏం ఆనంద్! నువ్వింకా నిద్రపోలేదూ? " అతని గొంతు అతనికే విన్పించనంత పీలగా ధ్వనించింది.

"కాదయ్యా! మీరు ఇంటికి వెళతారేమో నని..."

"లేదు ఆనంద్! కారు తాళం వేసెయ్యి. నాకు పనివుంది. రాత్రికి క్లినిక్‌లోనే వుంటాను. నువ్వు పోయి బయట గరా




జులో పడుకో"

తనను ఎందుకు గరాజులో పడుకోమంటున్నాడో ఆనందరావుకి అర్థం కాలేదు.

రవీంద్ర అందించిన కారు తాళాలు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ చీకటిలో, ఆ నిశ్శబ్దంలో ఒంటరిగా ఎంతసేపున్నాడో రవీంద్రకు తెలియదు. ఒకరు ప్రాణస్నేహితుడు. మరొకరు జీవితంలోకి ఆహ్వానిద్దామనుకున్న వ్యక్తి. వీళ్ళిద్దరూ ఒకరికొకరు ఎప్పుడు ఇంత దగ్గరయ్యారో తాను గమనించనేలేదు. ఏడాదిన్నరగా తాను ఆ మూసిన తలుపులముందు నిలబడి ఆమె వస్తుందని ఎదురుచూస్తున్నాడు. కొద్దినెలల క్రితం వచ్చిన స్నేహితుడు ఏ మార్గంగుండా ప్రవేశించి, ఆమె మనసుని దొంగిలించాడో అతనికి అర్థం కాలేదు. ఈ వ్యవహారాన్ని హేతువాదంతో ఆలోచించడానికి అతను కృష్ణలా మార్క్సిస్ట్ కాదు. అంతా మిథ్య. ఏదీ శాశ్వతం కాదు- అనుకోవటానికి అన్నింటికీ వేదాంతాన్ని ఆశ్రయించే వసుధా కాదు. నేను మామూలు మనిషిని. చాలామంది కంటే మానవత్వం ఒక్క పిసరు ఎక్కువుందేమో! అంతకుమించి నాలో ఏ ప్రత్యేకతా లేదు. అందువల్లనే, నేనామె ప్రేమకు అర్హుణ్ణి కాలేకపోయాను' అనుకున్నాడతను.

తెల్లవారుఝామున కృష్ణ గదిలోనుండి పెద్ద శబ్దం వినవచ్చింది. ఏదో గాజుసీసా బద్దలైనట్టు. రవీంద్ర నిర్లిప్తంగా అలాగే కూర్చున్నాడు. ఆ శబ్దాలను వేరేవిధంగా అన్వయించుకుని కుంగిపోతూ. పదినిమిషాల తర్వాత అతనికి అనుమానం కలిగింది. చటుక్కున లేచి కృష్ణ గదివైపు పరుగెత్తాడు. తలుపుతోసి చూశాడు. గడియ లోపలనుండి వేసేవుంది. అటువైపు కిటికీ గాజుతలుపు బద్దలు కొట్టివుంది.

"వసుధా! వసుధా!"

గట్టిగా పిలవాలంటే గరాజులో నుండి ఆనందరావు, పక్కగదుల్లో నుండి మిగిలిన పేషంట్లు వస్తారేమోనని భయం. అతని గొంతులోని ఆదుర్దా, ఆందోళన. కలల్లో తేలిపోతున్న వసుధకు లీలగా విన్పించాయి. ఒక్కక్షణం తను ఏ లోకంలో వుందో అర్థం కాలేదు. కళ్ళువిప్పి చూసింది. కృష్ణ మంచంమీద తను వుంది. కిటికీ దగ్గర రవీంద్ర ముఖం అస్పష్టంగా కన్పిస్తోంది. ఆమె చటుక్కున లేచి తలుపు తీసింది. అతను తటాలున గదిలోకి వచ్చాడు.

"వసుధా! నువ్వు నా రూమ్‌లోకి వెళ్ళు ఊс... త్వరగా"

'ఎందుకంత అర్జెంటుగా ఆయన రూమ్‌కి వెళ్ళాలి?' వసుధ అయోమయంగా రవీంద్ర రూమ్‌లోకి వచ్చింది. ఆసుపత్రి అంతా నిశ్శబ్దంగా, ప్రశాంతంగా వుంది.

'అవునూ! కృష్ణ ఏడీ? ఆ రూమ్‌లో వున్నాడా?' గదంతా కలియచూసింది. కృష్ణ కన్పించలేదు కానీ, ఎదురుగా వున్న అద్దంలో తన ప్రతిబింబం కన్పించింది. రేగిన జుట్టు, చెదిరిన కుంకుమ, కుడిభుజం మీదుగా కన్పిస్తున్న బ్రా స్ట్రాప్, బుగ్గలమీద దంతక్షతాలు, నలిగిన బట్టలు 'ఎవరిది? నేనేనా?' ఆ క్షణాన వసుధ భయంతో వణికిపోయింది. సిగ్గుతో చితికిపోయింది. గబగబా వెళ్ళి గది తలుపు వేసేసింది. మళ్ళీ మళ్ళీ తనను అద్దంలో చూసుకుంది. రాత్రి జరిగినది మనసులో సుళ్ళు తిరుగుతోంది. 'డాక్టరుగారు నన్ను ఈవిధంగా చూశారా? ఏమనుకుని వుంటారు. అందుకే నన్ను ఈ గదిలోకి వెళ్ళమన్నారు కాబోలు. కృష్ణ ఏమయినట్టు?' అతని గురించి ఆదుర్దాపడుతూనే వసుధ ముఖం కడుక్కుంది. తల దువ్వుకుంది. చీరె విప్పి, సరిచేసుకుని మళ్ళీ కట్టుకుంది. ఈసారి అద్దంలో ప్రతిబింబం ఆమెనంతగా భయపెట్టలేదు. వెళ్ళి గది తలుపులు తీసింది. ఎదురుగా ఆనందరావు, రవీంద్ర కన్పించారు. వసుధ సిగ్గుతో తల వంచుకుంది. రవీంద్ర మాత్రం ఏమీ జరగ

నట్టే, తాను ఏమీ చూడనట్టే వున్నాడు చాలా మామూలుగా.

"రాత్రి బాగా నిద్రపట్టిందా వసుధా! రాత్రి కృష్ణకి ఇంజెక్షన్లూ, అవీ చూసుకున్నావు కదూ! థాంక్యూ ఫర్ ది కోపరేషన్. ఆనంద్, ఒక రిక్షా పిలుచుకు వచ్చి, వసుధను ఇంటి దగ్గర దింపిరా" అన్నాడు. అంటూనే అతను ఆనంద్ దగ్గర కారు తాళాలు తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు.

★ ★ ★

తన గదిలో అలా ఎంతసేపు పడుకుని వుందో వసుధకు గుర్తులేదు. 'కృష్ణ ఏమయ్యాడు? డాక్టరుగారు రాత్రికి ఆసుపత్రికి రాను అని చెప్పి ఎందుకు వచ్చారు? ఎన్ని గంటలకు వచ్చారు? తననీ కృష్ణనీ ఆ స్థితిలో చూసివుంటారా? ఈ ప్రశ్నలు వేటికీ ఖచ్చితమయిన సమాధానం తోచ లేదు. తన 'అవతారం' లోకానికి కనిపిస్తే అవమానం పాలవుతానని, తనను ఆయన రూమ్‌లోకి వెళ్ళమన్నారా? అయివుండొచ్చు అందుకే ఆనందరావుకి తాను కృష్ణకి ఇంజెక్షన్లూ, వగైరా చూసుకోవటానికి వున్నట్లు అభిప్రాయం కలిగేలా మాట్లాడారు. వసుధ ఊహ నిజమే! ఎప్పుడయినా, అత్యవసర పరిస్థితుల్లో విజయలక్ష్మి కూడా ఆసుపత్రిలో వుండిపోతుంది. అటువంటి సమయంలో, పేషెంటు మగవాడైతే, ఆమె డాక్టరుగారి రూమ్‌లోనూ, రవీంద్ర పేషెంటు రూమ్‌లో వుంటారు. ఆనందరావు కూడా వసుధను రవీంద్ర రూమ్‌లో చూసి అలాగే అనుకున్నాడు. అనుకోవాలనే రవీంద్ర అభిప్రాయం కూడా!

కొన్ని నెలల క్రితం 'మీ స్నేహితుడు మగవాడు కావటంవల్ల, అతను పేషంటే అయినప్పటికీ, నర్సుగా కూడా నేను తాకలేను అని చెప్పాను డాక్టరుగారికి. అటువంటిదాన్ని, రాత్రి ఏ స్థితిలో నేను ఆయన కంటపడ్డాను?' వసుధ పదేపదే తలుచుకుని సిగ్గుతో చితికిపోయింది. కృష్ణ గురించి ఆమెకు ఎంతో ఆదుర్దాగా వుంది. అయినా, రవీంద్ర నిబ్బరం గుర్తుకువచ్చి కృష్ణకు ఏ ఆపదా జరిగివుండదనే భావించింది. 'తన స్నేహితుడికి అపాయం సంభవిస్తే డాక్టరుగారు అంత ధైర్యంగా వుండరు. బహుశా, రాత్రి డియస్పీతో మాట్లాడివుంటారు. కృష్ణ కాళ్ళు కట్లు విప్పేసి, అతన్ని సురక్షితమయిన ప్రదేశానికి తరలించివుంటారు. ఇదేదీ తనకు తెలియనంత మైకంలో వుందా తాను? కృష్ణ తనని విడిచి వెళ్తూ ఏమనుకుని వుంటాడు? మళ్ళీ రాడా తన కోసం? ఆ గణపతితో కలిసి తన వాళ్ళ మధ్యకు తిరిగి వెళ్ళిపోయిన కృష్ణకి తాను ఎన్నడయినా గుర్తుకు వస్తుందా? తనకు ఉత్తరం రాస్తాడా? హరిజనుల కోసం, గిరిజనుల కోసం, పీడిత, తాడిత ప్రజానీకం కోసం అహర్నిశలూ ఆలోచించే అతని ఆలోచనల్లో, 'వసుధ' అనే ఈ దౌర్భాగ్య ప్రాణికి చోటు వుంటుందా? ప్రేమతో కాకున్నా, జాలితోనయినా తనను మళ్ళీ కలవటానికి ప్రయత్నం చేస్తాడా?' అన్నీ భేతాళ ప్రశ్నలే. వాటికి సమాధానమెక్కడినుండి లభిస్తుంది ఆమెకు?

మూడు, నాలుగురోజులు ఆ షెడ్డులో అలాగే పడివుంది వసుధ. ఆకలి వేసినప్పుడు లేచి ఏదో ఒకటి తినటం, మళ్ళీ చాపమీద మూడంకెవేసి పడుకోవటం. ఎంత దుఃఖమైనా తగ్గుముఖం పట్టడానికి ఆ మాత్రం సమయం చాలు. ఆమె కాలేజీకి వెళ్ళటం మొదలుపెట్టింది. కాలేజీ వదలగానే అలవాటు ప్రకారం, కాళ్లు క్లినిక్‌వైపుకు వెళుతోంటే కళ్ళాలువేసి ఆపింది. రవీంద్రను ఎదుర్కొనే శక్తి తనకు లేదనిపించింది. మనసు మార్చుకుని, జనరల్ లైబ్రరీకి వెళ్ళి ఒక గంటసేపు చదువుకుని, షెడ్డుకి తిరిగి వచ్చేసింది. ఆరోజు మొదలు ఆమె క్లినిక్‌కు వెళ్ళలేదు. భవానమ్మగారి





ఇంటిలోకి కూడా వెళ్ళలేదు. ఆవిడ చాలా సార్లు కాంపౌండ్‌లో కన్పించేది. మామూలుగానే మాట్లాడేది. 'ఏమిటి వసుధా! రోజు రోజుకీ చిక్కిపోతున్నావు? బాగా చదువుతున్నావా?' అని కుశలప్రశ్నలు వేసేది. పిల్లలు కూడా మామూలుగానే ప్రవర్తించేవారు. 'నేనే మారేను. వాళ్ళు ఎవరూ మారనూలేదు, నాలోని మార్పును పసిగట్టనూ' లేదు అనుకుంది వసుధ.

ఒకటి రెండుసార్లు రవీంద్ర కారు భవానమ్మగారి ఇంటిముందు కన్పించింది. వసుధ గుండె దడదడా కొట్టుకుంది. అతను వస్తాడేమో? షెడ్డుకి తాళంవేసి బయటకు వెళ్ళిపోదామా? అని ఆలోచించింది. వద్దు వద్దు. ఆయన వస్తే కృష్ణ విశేషాలు తెలుస్తాయి. నేను వుండాలి అనుకుంది. చాపని మళ్ళీ మళ్ళీ దులిపి వేసింది. కాఫీకి పాలు వున్నాయో, లేదో చూసుకుంది. అతని రాకకోసం ఎదురు చూస్తూ పుస్తకం పట్టుకుని కూర్చుంది. చీకటిపడ్డాక అతని కారు స్టార్ట్ అయి వెళ్ళిపోయిన శబ్దం విన్పించింది. ఆ రెండుసార్లు వసుధ తీవ్రమయిన నిరాశకు గురి అయ్యింది. దీనికంటే అతను తనను నిలబెట్టి తిట్టివుంటే తను ఎంతగానో సంతోషించేది అనుకుంది. కానీ తనను తిట్టేహక్కు అతనికి లేదని అతను అనుకుంటూ వుండి వుండొచ్చని వసుధకు స్ఫురించలేదు.

రవీంద్ర రాకవల్ల, వసుధ క్లినిక్‌లో పని మానేసిందని భవానమ్మగారి ఇంట్లో తెలిసింది.

★ ★ ★

"ఏమ్మా వసుధా? ఇంకెక్కడయినా ఉద్యోగంలో చేరేవా? ఆసుపత్రికి వెళ్ళటంలేదటకదా! తమ్ముడు చెప్పాడు" అంది వసుధతో భవానమ్మగారు.

"లేదండీ" అని సమాధానం ఇచ్చింది వసుధ.

"అవున్లే. పరీక్షలు దగ్గరకొచ్చాయి. చదువుకో. ఉద్యోగం ఎక్కడికి పోతుంది?"

'ఎక్కడికి పోవటమేమిటి? ఇప్పటికే పోయింది' అనుకుంది వసుధ.

★ ★ ★

అయితే వసుధ ఈ నిరామయ, నిర్లిప్త నిస్పృహకారణమయిన జీవితం అలా కూడా ఎన్నాళ్ళో సాగలేదు. ఒకరోజు ఉదయం పంపు దగ్గర నీళ్ళు పట్టుకుంటూ కూజాతో సహా ముందుకు పడిపోయింది. తమ్ముడు క్లినిక్‌లో పనిమానేసిందని తెలిసిన దగ్గర్నుండీ భవానమ్మగారికి వసుధ పట్ల పూర్వపు ఆదరణా, జాలీ మళ్ళీ కలిగాయి. ఆ కారణంగా ఆవిడ ఇదివరకులాగానే వసుధను మనఃస్ఫూర్తిగా ఆదరించింది. ఆమెను తన గదిలో పడుకోబెట్టి, తమ్ముడికి ఫోను కొట్టింది.

రవీంద్ర వాళ్ళింటికి వచ్చి, వసుధ గదిలోకి వెళ్ళాడు. ఆ రాత్రి తర్వాత ఆమెను చూడటం అతనికి ఇదే మొదటిసారి. ఆమెతో తొలిపరిచయం గుర్తుకువచ్చింది అతనికి. అప్పుడు కూడా ఆమె ఇలాగే నిస్సహాయంగా మంచంమీద పడివుంది. ఇప్పుడు కూడా అలాగే వుంది. కానీ మనిషి ఇంకా సన్నగా, నీరసంగా వుంది. ఆమె ముఖం నీటిలో నుండి తీసి బయట ఎండలో పడేసిన కలువలా వడలిపోయివుంది. పిల్లలంతా ఆమె చుట్టు గుమిగూడి వున్నారు.

"మామయ్యా! వసుధక్కకు అప్పటిలా మళ్ళీ జ్వరం వచ్చినట్టుంది చూడు" అని తొలిగి మేనమామకు దారి ఇచ్చారు. ఎనాటమీలోకి వచ్చి ఏడాది, యౌవనం సంతరించుకుని మూడేళ్లు అయిన రాధకు మాత్రం వసుధ జబ్బు కొంత అంతుపట్టినట్టుగానే వుంది. అతను వసుధ కళ్ళూ, నాలుకా పరీక్షించాడు. ఏ వివరాలూ అడగడానికి చుట్టూ ఆడవాళ్లు ఉన్నారు. తన ప్రశ్న పెదవి దాటిందా అణువిస్ఫోటనే. మనసులో తేదీలు లెక్క కట్టుకున్నాడు. తలెత్తి రాధ

వంక చూశాడు.

"ఏం కాబోయే డాక్టరమ్మా! వసుధ జబ్బుకు పేరేం పెడదాం?"

వసుధ భయం భయంగా రాధకేసి చూసింది. రాధ సమాధానం ఇవ్వలేదు. ఆమె ముఖం రాయిలా ఉంది.

"ఎనీమియా! రక్తహీనత. దానితో లోబీపీ వల్ల కొంచెం తల తిరిగి వుంటుంది. కొంచెం బాగా తిను వసుధా! పాలూ, గుడ్లూ వగైరా తీసుకో. కాలేజీకి వెళ్లేటప్పుడు క్లినిక్ కి రా. మందులిస్తాను."

"రాధా! కొంచెం కాఫీ తీసుకురావే. పిల్లలూ ఇక్కడ గుమిగూడకండి. వసుధక్కకి విశ్రాంతి కావాలి. వెళ్లండి."

పిల్లలతోబాటు రాధ కూడా బయటకి వెడుతూ రవీంద్ర వంక చూసిన చూపు ముందు అతనికి అర్థం కాలేదు. అర్థం అయ్యాక 'మైగాడ్! నేను కాదు. నాకు అంత అదృష్టమా?' అనుకున్నాడు. వంగి స్టెత్ కిట్ లో పెట్టుకుంటూ గొణిగినట్టు అన్నాడు.

"వసుధా! పీరియడ్స్ రెగ్యులర్‌గా ఉన్నాయికదూ? టేక్ కేర్ ఆఫ్ యువర్ సెల్ఫ్"

రవీంద్ర రమ్మని చెప్పినప్పటికీ వసుధ కాలేజీనించి వెడుతూ క్లినిక్ కి వెళ్లలేదు. భవానమ్మగారు ఎంత నచ్చచెప్పినా వినకుండా,

"నాకు జ్వరం లేదండీ! కొంచెం నీరసంగా ఉంది. డాక్టరుగారు కూడా అదే చెప్పారు. నేను నా గదికి వెళ్లి పడుకుంటాను" అని చెప్పి షెడ్ కి వచ్చేసింది. ఆవిడ వంట చేయించి క్యారియర్ పంపించింది. వసుధ దానివంక తలతిప్పి కూడా చూడలేదు. తన జబ్బేమిటో ఆమెకు పూర్తిగా అర్థమయింది. సంతోషపడాలో, విచారించాలో మాత్రం అర్థంకాలేదు. ఈ వార్త కృష్ణకి తెలిస్తే తనని చూడడానికి రాడూ? అతనికి ఈ వ్యవస్థ మీద, దీని నియమనిబంధనల మీద గౌరవం లేకపోవచ్చు గాక, సెంటిమెంట్స్ లేకపోవచ్చుగాక. కానీ గతి తార్కిక, భౌతికవాదాన్ని కాచి వడపోసిన ఆ మార్క్సిస్ట్‌కి పెళ్లికాని తల్లి ఈ సమాజంలో ఎన్ని సమస్యలు ఎదుర్కోవాలో, ఎన్ని కష్టాలు పడాలో తెలీదూ? ఈ సమాజం ఆమెను వెంటాడి వేధిస్తుందని తెలీదా? తాను ప్రేమించిన వసుధ కోసం కాకున్నా ఒక అసహాయురాలైన, బీద ఆడపిల్ల సమస్యను పరిష్కరించడం కోసమయినా వస్తాడు. వస్తాడా? అసలు అతనికీ వార్త తెలిసే అవకాశం వుందా? అతను రాకపోతే ఏం చెయ్యాలి? అసలు ఇదంతా తన అనుమానమేమో? నిజంగా తనకు 'ఎనీమియా'నేమో! అయితే రవీంద్ర 'పీరియడ్స్' గురించి ప్రత్యేకంగా ఎందుకడిగారు? ఎనీమియాలో అది కూడా ఒక వ్యాధి లక్షణమేమో! వసుధ మధ్యాహ్నం వరకూ ఆలోచనల్లో మునిగితేలింది. అప్పుడు లేచి చీర మార్చుకుంది. ఆమె విచారాన్ని 'సెలబ్రేట్' చేసుకునే పరిస్థితిలో లేదు. దిగులుతో ఇలా చాపమీద పడివుండటంవల్ల ఏమీ జరుగదు. తానే ఏదో ఒకటి చెయ్యాలి. నాకు ఎవరూ లేరు. నా కోసం ఎవరూ ఏమీ చెయ్యరు. అని సమాధాన పరచుకుని రోడ్డు మీదకు వచ్చింది. క్లినిక్ కి వెళితే విజయలక్ష్మి కన్పిస్తుంది. ఆనందరావు కనిపిస్తాడు. మిగిలిన అందరూ కన్పిస్తారు. ఇన్నాళ్లూ ఏమయిపోయావు వసుధా? అని అడుగుతారు. ఉద్యోగం ఎందుకు మానేశావు? అని ప్రశ్నిస్తారు. వాళ్ళను తాను ఎదుర్కోలేదు. రవీంద్ర భోజనానికి ఎలాగూ ఇంటికి వెళతాడని తెలుసు. అందుకే ఇంటికి వెళ్ళింది.

వసుధ వెళ్ళేసరికి రవీంద్ర భోజనం చేస్తున్నాడు. పనికుర్రవాడు వచ్చి వసుధ వచ్చిందని చెప్తే 'లోపలకు తీసుకురా' అని చెప్పాడు. వాడు మళ్ళీ వెనక్కు వచ్చి 'ఫర్వాలేదు. మీ భోజనం అయ్యేవరకు కూర్చుంటానన్నారు' అన్నాడు. 'ఏడ్చావులే' అని





వాణ్ణి కోప్పడి అతనే ఎంగిలిచేత్తో లివింగ్ రూమ్‌లోకి వెళ్ళి ఆమెను తోడ్కొని వచ్చాడు. కుర్చీ జరిపి, 'కూర్చో వసుధా' అంటూ ఆమెను కూర్చుండచేసి ఆమె ముందు ప్లేటు పెట్టాడు.

"నేను భోజనం చేశాను" అంది వసుధ తలదించుకుని.

"తెలుస్తూనే వుందిలే. భోజనం చెయ్యి" అంటూ అన్నం వడ్డించాడు.

పనికుర్రవాడు దగ్గరకు రాబోతే,

"నువ్వు వెళ్ళి నాకు సిగరెట్టు ప్యాకెట్ కొనుక్కురా. ఆమెకు నేను వడ్డిస్తాలే" అని చెప్పాడు. వాడు వెళ్ళినవైపే చూసింది వసుధ. ఇప్పుడు ఇదివరకటిలా ఆమెకు భయం వెయ్యటంలేదు. ఇంతకంటే తనకు జరిగే అపాయం ఏమీలేదనే నిరాశలో వుంది. అదే ఇదివరకయితే, అలా వెళ్ళిన పనికుర్రవాడు ఏమనుకుని వుంటాడు? అని బుర్రబద్దలు కొట్టుకుని ఆలోచించేది. ఇప్పుడు వాడేమనుకున్నా, ఏమని ప్రచారం చేసినా ఆమెకు లక్ష్యం లేదు. రవీంద్ర ఊహించినట్టుగానే వసుధకు భోజనం సహించలేదు.

"నాకు కడుపులో తిప్పుతున్నట్టుగా వుంది. తినలేను" అని పళ్లెం పక్కకు తోసేసింది. లేచి వెళ్ళి సింక్‌లో వూసింది. వాంతి కాలేదు. కానీ నోరు అరుచిగా వుంది. ఊరికే నోటిలో నీళ్లు వూరుతున్నాయి. రవీంద్ర తాపీగా పెరుగు వేసుకుని భోజనం పూర్తిచేశాడు.

"పద... బయట హాల్లో కూర్చుందాం"

ఇద్దరూ హాల్లోకి వచ్చి ఒకరి ఎదురుగా ఒకరు కుర్చీల్లో కూర్చున్నారు. ఇంతలో పనికుర్రవాడు సిగరెట్టు ప్యాకెట్ తెచ్చాడు.

రవీంద్ర వాడితో "అదక్కడ పెట్టి, నువ్వెళ్లి అమ్మగారికి నిమ్మకాయరసం కలుపుకుని తీసుకురా" అని చెప్పాడు.

"ఆకలిగా లేదు" అంది వసుధ భోజనం వదిలేసినందుకు క్షమాపణ చెప్పుకుంటూ.

"నేచురల్, మార్నింగ్ సిక్‌నెస్" అన్నాడతను.

మనసులో ఉదయంనుండి భయం తొలుస్తూనే ఉంది. ముఖ్యంగా అతను పీరియడ్స్ క్రమంగా ఉన్నాయా అని అడిగినప్పటినుండీ తాను ఇటువంటిదేదో వినవలసివస్తుందని ఎదురుచూస్తూనే వుంది. అయినా ఎక్కడో, ఏదో ఆశ. తన జబ్బు నిజంగానే ఎనీమియా ఏమో అని. ఇప్పుడతని మాటతో నెత్తిమీద బాంబుపడ్డట్టే అయింది.

"ఓ! నో!" అంది కుర్చీలో వెనక్కువాలి.

"అవును వసుధా! యుఆర్ ప్రెగ్నెంట్" అన్నాడతను స్పష్టంగా.

ఇద్దరూ మౌనాన్ని భోంచేస్తూ అలాగే కూర్చున్నారు చాలాసేపు. అతను మాత్రం ఒకటి రెండు సిగరెట్లు కాల్చాడు. చివరకు అతను,

"నాకు క్లినిక్‌కి టైమయింది. వెళతాను" అని లేచినప్పుడు వసుధ గొంతు పెగుల్చుకుని అడిగింది.

"ఆయనేరీ? "

'ఆయన' అని గొణుక్కున్నాడు అతను అసూయతో రగిలిపోతూ.

"ఆయన వెళ్ళిపోయారా? "

రవీంద్ర తలతిప్పి వసుధను చూశాడు. ఆమె దీనంగా అతనినే చూస్తోంది.

"అటువైపు కిటికీకి వున్న గాజుపలకను పగలగొట్టి గణపతి గదిలోకి వచ్చివుంటాడు. కృష్ణ కూడా అతనితో వెళ్ళిపోయి వుంటాడు" అన్నాడు. ఇదంతా నా ఊహే సుమా అన్న ధోరణిలో.

"మరి... ఆయన కాళ్ళు? కట్లు? "

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి అతను కొంచెం ఇబ్బందిని అనుభవించాడు.

"తన కాళ్ళకు వున్నవి దొంగకట్లని వాడికి... వాడికి తెలిసిపోయివుంటుంది"

వసుధకు కూడా ఆ రాత్రి గుర్తుకు వచ్చి ముఖంలోకి రక్తం ఎగచిమ్మింది.



ఆ మాట అనేశాక అతను ఆమెను చూడ లేనట్టు లోపలకు వెళ్ళిపోయాడు. అతను దుస్తులు మార్చుకుని వచ్చేసరికి వసుధ రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుని ఏడుస్తోంది. ఆమెను ఏమని ఓదార్చాలో అతనికి తెలియలేదు. 'అబార్షన్ చేయించుకోమని సలహా ఇవ్వాలా? కృష్ణ తిరిగి వస్తాడు. వాడి కోసం ఎదురుచూడు- అని తానే నమ్మని ఆశను ఆమెకు కల్పించాలా? లేక బిడ్డను కని పెంచుతూ వుండు. వాడిని కూడా వీరకమ్యూనిస్టుని చేసి నీ తాళి కట్టని భర్త ఆశయాలకు రూపుదిద్దు. అదే నీ జీవితాశయం అని ఆరాధన సినిమాలో షర్మిలా టాగూర్‌లా చెప్పాలా?'

అతను ఏమీ చెప్పకుండానే వసుధ లేచి, పమిటచెంగుతో ముఖం తుడుచుకుని, తల దించుకుని వెళ్ళిపోయింది.

★ ★ ★

వసుధ తీవ్రంగా ఆలోచించింది. ఏం చెయ్యాలో ఆమెకు తోచలేదు. ఈ 'సమస్య' లేకపోతే ఎలాగో ఒకలాగ ధైర్యం కూడగట్టుకుని చదువు సాగించి వుండేది. తర్వాత ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకుని వుండేది. ఈ షెడ్ తనకు సురక్షితమయిన ప్రదేశమే! తాను దక్కించుకోలేకపోయింది గానీ, తనకెప్పుడూ మంచి ఆశ్రయమే లభించింది. తనకు వాటిల్లిన 'ఆపద' కూడా తాను చెజేతులా కొనితెచ్చుకున్నదే. ఈ షెడ్‌లో వుంటూ, ఉద్యోగం చేస్తూ మిగిలిన జీవితం గడిపేయవచ్చు కానీ ఇప్పుడు హిమాలయపర్వతం అంత ఎత్తున తన ముందు నిలిచిన సమస్యకు పరిష్కారం ఏమిటి?

అబార్షన్ ఇంకా చట్ట సమ్మతం కాలేదు. శాస్త్రసమ్మతమూ కాదు. తన మనసూ దానికి అంగీకరించదు. అయినా అబార్షన్ చేయించుకోవటం అంత సులువైన పని కూడా కాదు. 'నాకు గర్భవిచ్ఛిత్తి చేయండి' అని ఎవరిని అడుగుతుంది? డాక్టరుగారినా? ఇప్పటికే ఆయన ముఖం చూడాలంటే చచ్చే చావుగా వుంది. విజయలక్ష్మినా? తాను అమాయకురాలిననీ, నోట్లో వేలుపెడితే కొరకలేననీ, మగపేషంటు గాలి తగిలితేనే మైలపడిపోతానని నమ్ముతానని ఆమెకు ప్రగాఢ విశ్వాసం. ఆ విశ్వాసాన్ని ఎట్లా వమ్ము చేసుకోవటం! కాలేజీ, లైబ్రరీ తప్ప మరేమీ తెలియని తాను, ఏ ఆసుపత్రికి వెళ్ళి ఎవరిని అడగగలదు? అసలు తను చేసిన తప్పుకి తన గర్భాన్ని పట్టుకు వేళ్లాడే ఆ చిన్నప్రాణిని శిక్షించటానికి తన మనస్సు అంగీకరించటంలేదు కూడా!

మిగిలిన మార్గం ఆత్మహత్య! అదే అన్ని సమస్యలకూ పరిష్కారం.

సిస్టర్ మోడెస్టీనా గుర్తుకు వచ్చారు. 'జీవితం ఎవరి కోసమూ కాదు వసుధా! జీవితం జీవించటానికే. లైఫ్ ఈజ్ టు లివ్' అని ఆమె అన్న మాటలు గుర్తుకొచ్చాయి. 'అసలు పిరికివాళ్లు ఆత్మహత్య చేసుకుంటారని ఎవరన్నారో కానీ అది శుద్ధ అబద్ధం! ఆత్మహత్య చేసుకోవటానికి చాలా ధైర్యం కావాలి. సిస్టర్ మోడెస్టీనా మాటలు ఏవి పాటించాను గనుక? నాకు చావటానికి ధైర్యం లేదు' అనుకుంది వసుధ.

'చచ్చినా, బతికినా నేను మాత్రం ఇంక ఇక్కడ వుండలేను. ఉండి భవానమ్మగారికీ, ఆమె కుటుంబానికీ నా ముఖం చూపించలేను. ఇక్కడనుండి వెళ్ళిపోవటం తప్ప నాకు గత్యంతరం లేదు' అనుకుంది వసుధ. ఆ ఆలోచన వచ్చిందే తడవుగా లేచి పుస్తకాలు, బట్టలు సర్దటం మొదలుపెట్టింది. ఈ రెండేళ్ళలోనూ చాలా పుస్తకాలు కొని దాచింది. వాటిని మోసుకెళ్ళడం కుదరదు. అన్నింటినీ ఒక పాతచీరెలో మూటకట్టడం మొదలుపెట్టింది. అప్పుడు ఆ పుస్తకాలలో నుండి ఉత్తరాల కట్ట పడింది. చలంగారితో ఆమె నడిపిన కరస్పాండెన్సు. అంత మేధావీ, ఎన్నో మెట్లు దిగి వచ్చి, ఎదిగీ ఎదగని ఇరవైఏళ్ళ అమ్మాయి అమాయక




ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు. ఒక ఉత్తరంలో వసుధ రాసింది. "మీరు సత్యాన్వేషణ కోసం, ఆత్మజ్ఞానం కోసం, అంత దూరం వెళ్ళారు. నాకు అంత పెద్ద కోరికలు లేవు. నా చదువు నిరాటంకంగా పూర్తి కావాలనీ, నన్ను నేను పోషించుకోగల ఉద్యోగం రావాలనీ ఆశగా వుంది. ఈ అల్పమయిన కోరికలు దేవుడిముందు వుంచటానికి నాకు సిగ్గుగా వుంది."

దానికాయన సమాధానం: "నీ కోరికలు అల్పమయినవిగా నాకేమీ తోచటంలేదు. అవి తప్పక కోరుకోదగినవీ, నీ జీవితానికి అవసరమయినవీ కూడా" అని.

ఇంకో ఉత్తరంలో "నేను అక్కడికి వస్తాను. నాకు మీ రమణుడి కృప గురించి తెలుసుకోవాలని వుంది. మీలా నేను సాధకురాలిని కాదు" అని రాసివుంది. "రావచ్చా?" అని అనుమతి కూడా అడిగింది.

"నీకు రావాలని వుంటే తప్పక రా. నీకు మంచి జరుగుతుందని నేను నమ్ముతున్నాను. కానీ తీరా ఇక్కడికి వచ్చి ఏదీ ఉపయోగం చూపించు చలం? అని నా కాలరు పట్టుకునేవు సుమా!" అని ఆయన సమాధానం ఇచ్చారు.

ఈ కృష్ణమోహన్ అనే ఇంద్రజాలికుడు తన మనసుకు గాలం వేయకముందు, ఆ ఉత్తరాలే తను జీవించటానికి స్ఫూర్తి. వాటి కోసం ఎంతగానో ఎదురుచూసింది. కాని ఆయన వెళ్ళిపోయారు. ఆయన బదులు నర్తకి బదులు రాసేది. పెద్ద పెద్ద తెలుగు అక్షరాలతో అస్పష్టంగా వుండే అక్షరాలను చదవలేక తాను 'మీకు తెలుగు రాకపోతే, ఇంగ్లీషులో రాయండి' అని రాసింది. దానికి, భలేదానివి వసుధా! అది నాకు అస్సలు రాదు. ఇదే కొంచెం నయం' అని సమాధానం వచ్చింది. ఆ ఉత్తరం చదివి. పడీపడీ నవ్వుకుంది వసుధ.

వసుధ పుస్తకాలు, కాగితాలు, ఉత్తరాలు అన్నీ పాతచీరెలో మూటకట్టి షెడ్డులో ఒక మూలగా వుంచింది. చాప చుట్టి మరొక మూల పెట్టింది. బట్టలు మడత పెట్టుకుని సూటుకేసులో పెట్టుకుంది. అది తీసుకుని బయటకు వచ్చి షెడ్డు తాళం వేసేసింది. అక్కడే రెండు నిమిషాలు నిలబడి ఆ ఇంటిని ప్రేమగా చూసింది. రెండు సంవత్సరాలు తనకు ఆశ్రయమిచ్చిన ఇల్లు. ఇక ఎప్పటికీ తాను ఇక్కడికి రాదు. 'జిందగీకే సఫర్‌మే గుజర్ జాతేహై జోమకాన్, ఓ ఫిర్ నహీ ఆతే' ఆప్‌కీ కసమ్‌లో పాట గుర్తుకు వచ్చింది.

రోడ్డు ఎక్కుతుంటే ఓబులయ్య పలకరించాడు. "ఎక్కడికమ్మా? ఈవేళప్పుడు బయలుదేరావేంటి?"

"మా స్నేహితురాలి పెళ్ళికి ఓబులయ్యా! మళ్ళీ నాలుగురోజులవరకూ రాను. అమ్మగారికి చెప్పు". అని తడుముకోకుండా అబద్ధం ఆడింది.

★ ★ ★

రవీంద్ర పూర్వంకంటే ఎక్కువ క్లినిక్‌లో గడుపుతున్నాడు. సిగరెట్లు తప్ప అతనికి ఏ అలవాట్లూ లేవు. కాలం గడవటానికీ, వసుధను మరవటానికీ అతను తనపనినే ప్రత్యామ్నాయంగా ఎన్నుకొన్నాడు.

విజయలక్ష్మి అడగనే అడిగింది.

"వసుధ ఏమయింది డాక్టర్‌గారూ! క్లినిక్‌కి రావటంలేదు"

"పరీక్షలు కదా విజయలక్ష్మీ! నేనే రావద్దని చెప్పాను"

ఆ మాటలు ఆమె నమ్మిందో లేదో తెలియదు. అతనిని మరేమీ ప్రశ్నించలేదు.

'వసుధ జీవితంలో నాకు స్థానం లేదు సరే. ఆమెను చూడటానికయినా నోచుకోలేదా నేను?' అనుకున్నాడతను. వసుధ ఇంటికి గానీ, క్లినిక్‌గానీ వస్తుందని అతను పదిహేనురోజులపాటు ఎదురుచూశాడు. ఆమె రాలేదు. తనకు ఎదురయిన సమస్యను ఆమె ఎట్లా ఎదుర్కుంటోందో కూడా

అతనికి అంతుచిక్కలేదు. ఆ విషయం కూడా అతనికి తెలుసుకోవాలనే వుంది. అక్కగారి ఇంటికి వెళ్ళేసరికి భవానమ్మా, నరసింహారావు బయట వరండాలో కూర్చుని టీ తాగుతున్నారు. ఇంటిముందు కారు ఆగిన శబ్దానికి, లోపల గదిలో వున్న రాధ కూడా బయటకు వచ్చింది. అతను ముగ్గురినీ చూసి, పలకరింపుగా నవ్వి షెడ్డు వైపు అడుగులు వేశాడు. "అదేదో మందు పెట్టినట్టుంది. ఇంటికి వచ్చినవాడు ఇటు రాక అటు ఏడుస్తాడేం? " అని విసుక్కుంది భవానమ్మ.

"ఉష్, వింటాడు. నువ్వు నోరు మూసుకో" అని మందలించాడు నరసింహారావు.

రవీంద్ర షెడ్డువరకూ వెళ్ళాల్సిన అవసరం లేకపోయింది. పదడుగుల దూరానికే వెళ్ళాడుతూ కనపడుతోంది షెడ్డుకు తాళం కప్ప. అతను తిరిగి ఇంటివైపుకి వస్తోంటే భవానమ్మ నిష్ఠూరంగా అంది. "నువ్వు నా తమ్ముడివేనట్రా. ఇంటికొచ్చినవాడివి లోపలకు రాకుండా ఆ షెడ్డువైపు ఏం పని నీకు? "

అతను విసుగ్గా సమాధానం ఇచ్చాడు. "ఇంటికొచ్చానని ఎవరు చెప్పారక్కా? నేను షెడ్డుకే వచ్చాను. వసుధతో మాట్లాడాలని"

'నేను చెపితే విన్నావా' అన్నట్టు చూశాడు నరసింహారావు ఆమెని. అతన్ని 'కార్నర్' చేసి అటువంటి సమాధానాలు రాబట్టడం వల్ల నష్టమే కానీ లాభంలేదని అతని లాయరు బుర్రకు తెలుసు. భవానమ్మకు ప్రథమ కోపం తప్ప తెలివితేటలు తక్కువ. ఆమె మాట్లాడితే పుల్లవిరిచినట్టే వుంటుంది. ఎంత మంచి మనిషి కూడా ఆ వ్యంగ్యానికి 'నెగిటివ్'గానే సమాధానం ఇవ్వాలనుకుంటాడు. ఇలా మాట్లాడి, నిశ్చయమయిన సంబంధాన్ని నీళ్ళపాలు చేస్తుందని భయం. అతను బావమరిదిని అటునుండి నరుక్కురావాలనుకున్నాడు.

"రాధ పై నెలలో పరీక్షలంటోందయ్యా" అన్నాడు.

"అప్పుడే ఏంపరీక్షలు నాన్నా! ఇంకా మూడు నెలలుంటేనూ? " అంది రాధ.

'ఇది వాళ్ళ అమ్మకంటే పెద్ద ఫూల్' అనుకున్నాడు నరసింహారావు మనసులో. పైకి మాత్రం నవ్వేసి,

"అదికాదు రవీ! పరీక్షలు అవకేం చేస్తాయిలే. మనం ముహూర్తాలు పెట్టేసుకుందాం" అన్నాడు.

అనేసి కూతురు వంక భయం భయంగా చూసేడు. కొంపదీసి ఇది 'ఇపుడేం ముహూర్తాలు నాన్నా! పరీక్షలయ్యాక పెట్టుకుందాంలే' అనదుగదా అని. కానీ రాధకు కూడా కంగారు వున్నందువల్ల ఆ అమ్మాయి సిగ్గుపడిందే తప్ప ఏమీ మాట్లాడలేదు. 'కరెక్టుగా అడిగేరుసుమా' అన్నట్టు భార్య మెచ్చుకోలుగా చూసింది.

ఇటువంటి పరిస్థితి ఏదో ఒకనాడు ఎదుర్కోవలసి వుంటుందని రవీంద్ర ఎరుగును. ముఖ్యంగా గత పదిహేను రోజులుగా అతను దానికి సిద్ధపడుతున్నాడు కూడా. అందువల్ల అతను తొణక్కుండానే జవాబు ఇచ్చేడు.

"బావగారూ! నేను రాధతో పెర్సనల్‌గా మాట్లాడాలనుకుంటున్నాను"

"దానికేం తెలుసురా? అదింకా..."

నరసింహారావు , భార్యని మాట్లాడనివ్వలేదు. "భవానీ! నువ్వూరుకో. అలాగే రవీ! మాట్లాడు. మేము లోపలకు వెళ్ళమా? "

"వద్దుబావగారూ! మేమే బయటకు వెళతాం. రాధా! తయారయిరా"

కూతురు లోపలకు వెళ్ళగానే.

"నువ్వు కూర్చోరా! బావగారితో మాట్లాడుతూ వుండు. నేను టీ పట్టుకొస్తాను" అని భవానమ్మ లోపలకు వెళ్ళిపోయింది. ఆమె వంటమనిషికి టీ చెయ్యమని పురమాయించి కూతురికి ఉపదేశం ప్రారంభించింది. ఆ ఉపదేశానుసారం టీ తీసుకుని




పావుగంట తర్వాత రాధ బయటకు వచ్చింది. అతను టీ తాగేక, ఇద్దరూ కలిసి కారులో బయలుదేరేరు.

"ఈ మాయదారి గుంటూరులో ప్రశాంతంగా కూర్చొని మాట్లాడుకోవటానికి స్థలమే లేదు" అన్నాడతను.

రాధ సమాధానంగా ఏమీ అనలేదు. అతనే కారుని ఊరికి చివరకు తీసుకువచ్చి ఆపేడు. ఇద్దరూ కారు దిగి అక్కడ 'కల్వర్టు' మీద కూర్చున్నారు. అతనే సంభాషణ మొదలుపెట్టేడు.

"మీ అమ్మా, నాన్నా మన పెళ్ళికి ముహూర్తాలు పెట్టుకోవాలనుకుంటున్నారు. నీ అభిప్రాయం ఏమిటి రాధా? "

"నాకు ఇష్టమే మామయ్యా" అంది రాధ నిర్మొహమాటంగా. "నా ఎనాటమీ అయ్యేక పెళ్ళి చేసుకుంటానని నువ్వు కూడా అన్నావుగా మామయ్యా! ఇప్పుడు వాళ్ళకు భయం పట్టుకున్నట్టున్నది, నువ్వెక్కడ మనసు మార్చుకుంటావోనని. ఆ పరీక్షలు కాకుండానే పెళ్ళి అంటున్నారు"

ఆ ఆరోపణలో నిజం వున్న కారణంగా అతను ఏమీ మాట్లాడలేకపోయాడు.

"నాకు కూడా ఇష్టమే మామయ్యా! పరీక్షలవ్వాలని పట్టింపేమీలేదు నాకు"

సమస్యను ఇంత త్వరితంగా, ఇంత ధైర్యంగా ఎదుర్కోవలసి వుంటుందని అతను ఊహించలేదు. అయినా తప్పేదేం వుంది?

"కానీ, నాకు అభ్యంతరం వుంది రాధా! మీ అందరి భయాలూ నిజమే. నేను నిన్ను పెళ్ళిచేసుకోలేను"

రాధ తల్లి చేసిన ఉపదేశసారాన్ని పూర్తిగా విస్మరించింది.

"ఎప్పుడు చేసుకోలేవు? ఇప్పుడు చేసుకోలేవా? ఎనాటమీ అయ్యేక కూడా చేసుకోలేవా? లేక నా డిగ్రీ అయ్యేక కూడా చేసుకోలేవా? "

"ఎప్పటికీ చేసుకోలేను" అన్నాడతను. 'రెండేళ్ళబట్టి ఆడుతున్న నాటకం చాలు. నేను ఈ దాగుడుమూతలు ఆడీ ఆడీ అలసిపోయేను' అనుకున్నాడతను.

"ఎందుకని? " రాధ కఠినంగానే అడిగింది. అరిచినట్టే అడిగింది. ఊరు చివర కాబట్టి, ఎవరూలేరు కాబట్టి సరిపోయింది.

'నేను వసుధను ప్రేమించాను. ఆమెకు తప్ప మరెవరికీ నాభార్యగా స్థానంలేదు. ఆమె ఆ స్థానాన్ని నిరసించి, తృణీకరించినప్పటికీ' అందామనుకున్నాడు. కానీ వసుధ అనుమతి లేకుండా ఆమె పరోక్షంలో ఆమెను గురించి మాట్లాడడం అతనికి ఇష్టం లేకపోయింది. అందువల్ల రాధ ప్రశ్నకి అతనికి మౌనమే సమాధానం అయింది.

"ఎందుకని మామయ్యా! సమాధానం చెప్పవేం? "

"........."

"నేను చెపుతాను విను. నీకు ఆ నల్ల దంటే పిచ్చి దాన్నే చేసుకుంటావు. అందుకని నన్ను చేసుకోవటం నీకిష్టంలేదు. అవునా? " ఏడుపూ, కోపం రెండూ మిళితమయిన స్వరంతో అరిచింది.

"రాధా కంట్రోల్ యువర్ టంగ్"

"ఏమిటి మామయ్యా? ఇంగ్లీషులో మాట్లాడినంత మాత్రాన నువ్వు చేసిన తప్పులన్నీ ఒప్పులయిపోతాయా? అయితే నేను కూడా ఇంగ్లీషులోనే మాట్లాడతాను. విను. యు స్లెప్ట్ విత్ హెర్. యస్. యు స్లెప్ట్ విత్ హెర్. అందుకని, నువ్వు దాన్ని చేసుకుని తీరాలి. నాకు ఆ 'టాక్టిక్స్' లేనందువల్ల, నిశ్చయమయిపోయిన భర్తని కూడా నేనెప్పుడూ నా చేష్టలతో ఆకట్టుకోలేకపోయేను. అది తెలివిగా నిన్ను బుట్టలో వేసుకుంది. అంతేగా" రాధ ఏడుస్తోంది.

రాధను ఈడ్చిపెట్టి చెంపమీద కొట్టాలన్న కోరికను అతను బలవంతంగా నిగ్రహించుకున్నాడు. ఆమెను ప్రశాంతంగా అర్థంచేసుకోవటానికి ప్రయత్నించేడు. 'ఆమె ఊహ

తెలిసినది మొదలు ఈ క్షణం వరకూ తననే భర్త అని నమ్మింది. ఇపుడు హఠాత్తుగా నేను చేసుకోను అంటే ఎవరికయినా బాధగానే వుంటుందేమో! వసుధ కృష్ణ సొత్తు అని తెలిసిన క్షణంనుండీ తానెంత నరకం అనుభవిస్తున్నాడు. ఆమె బాధ కూడా అటువంటిదేగా' అని ఆమెను అర్థం చేసుకోవటానికి యత్నించేడు.

"రాధా! రాధా! కూల్ డౌన్. ఏడవకు. నేను నిన్ను పెళ్ళిచేసుకోవటంలేదు. ర్యాదర్, వసుధ నన్ను చేసుకోబోవటంలేదు. అయినా నేను నిన్ను పెళ్ళిచేసుకోలేను"

'నీకేమయినా పిచ్చి పట్టిందా?' అన్నట్టు చూసింది.

"రాధా! వసుధ పరోక్షంలో ఆమెను గురించి మాట్లాడ్డం తప్పు అని నేను ఇంత వరకూ నిగ్రహం వహించాను. కానీ ఇక తప్పదు. నువ్వు శాంతంగా వింటే నా మనసులో వున్నదంతా నీకు వివరించటానికి ప్రయత్నిస్తాను"

అప్పటికి రాధకు తను చాలా సంస్కార హీనంగా మాట్లాడేనని అర్థం అయింది.

"సారీ మామయ్యా!" అంది కళ్ళూ, ముక్కూ తుడుచుకుంటూ.

"రాధా! నువ్వు పుట్టగానే మన పెళ్ళి నిశ్చయమయిపోయింది. నా ఊహ తెలిసిన నాటినుండీ నిన్ను నా భార్య అనే అంటున్నారు. నాక్కూడా ఎప్పుడూ అభ్యంతరం లేదు. నిన్ను నేను ప్రేమించినమాట నిజమే. కానీ, పెళ్లిచేసుకోవటానికి నాకు ఎటువంటి అభ్యంతరమూ లేకపోయింది వసుధను చూసేవరకూ. ఇది వినటం నీకు బాధగానే వుంటుంది. కానీ నువ్వు నాబాధను కూడా అర్థంచేసుకుంటావని చెపుతున్నాను. రాధను కాదని నేను ఆ నల్లపిల్ల వసుధను ప్రేమిస్తున్నానంటే ఎవరయినా నా తెలివితక్కువకి నవ్వుతారు. వీడికి అభిరుచి లేదనుకుంటారు. లైలా నల్లటిది.





నువ్వు మజ్నూ కథ విన్నావో లేదో తెలీదు. లైలా! లైలా! అని అతను ఎడారుల్లోపడి ఏడుస్తుంటే అల్లా అతని ముందు ప్రత్యక్షమయి 'ఓరి పిచ్చివాడా! ఇన్నిసార్లు లైలా! లైలా! అని ఏడిచేబదులు అల్లా! అల్లా! అని ఏడిస్తే నేను నీముందు ప్రత్యక్షమయ్యేవాడిని కాదా!' అని ప్రశ్నించేడట. దానికి మజ్నూ నేను కాదు పిచ్చివాడిని, నువ్వే. నాకు ప్రత్యక్షమవ్వాలని అంత ఉత్సాహంగా వుంటే నా లైలా రూపంలో రాకపోయావా, నిన్ను పూజించేవాడిని కదా! అన్నాడట. అలాగే, మీ అందరి కళ్ళకూ నల్లగా కనిపించే వసుధలో నాకు ఏదో గొప్ప ఆకర్షణ కనపడి వుండాలి. ఆమెను చూసిన క్షణం నుండీ నేనామెను కోరుకున్నాను. రాధా! నీకు అనిపిస్తూ వుండి వుండొచ్చు. అప్పుడే మనసు మార్చుకున్నవాడివి ఈ రెండేళ్ళూ నాతో ఎందుకు దొంగాట ఆడేవు అని. నిజమే. నేను చేసింది తప్పే. కానీ, నేను వసుధను ఇష్టపడగానే నిన్ను చేసుకోకూడదు అని నిర్ణయానికి రాలేదు. నా మనసుకి నేను నచ్చచెప్పుకోవాలని ప్రయత్నించేను. అది తాత్కాలికమయిన ఆకర్షణ. దానిని నేను అధిగమించవచ్చు అనుకున్నాను. నిన్ను చేసుకోకపోతే మీ అమ్మా నాన్నలకు దూరం అవుతానని భయపడ్డాను. అయినా నా మనసు నామాట వినలేదు. అప్పుడయినా ఈమాట నేను మీకు చెప్పి వుండవలసింది. కానీ చెప్పలేదు. చెప్పలేకపోవటానికి కారణం-ఈసారి వసుధ. ఆమె నన్ను ప్రేమిస్తోందో లేదో నాకు తెలియదు. ప్రేమించాలనే అత్యాశతోనే ఆమెను నాకళ్ళముందర నిలుపుకోవాలనే కాంక్షతోనే నేనామెకు ఉద్యోగం ఇచ్చాను. ఆమె సుఖదుఃఖాలలో పాలుపంచుకున్నాను. కానీ నన్ను ప్రేమిస్తున్నావా? అని అడిగి ఆ సాన్నిహిత్యాన్ని పోగొట్టుకుంటానేమోనని భయపడ్డాను. ఆమె ఆమాట తనకు తానుగా చెపుతుందని ఎన్నాళ్ళో ఎదురు చూశాను. నేను వసుధను ఇష్టపడు

తున్నానని తెలిస్తే మీ అమ్మ ఆ అమ్మాయిని గదిలో నుండి వెళ్ళగొడుతుందేమో, ఆమెకు ఆశ్రయం లేకుండా పోతుందని భయపడ్డాను. కానీ నువ్వు కూడా వసుధవంటి ఆడపిల్లవే అనీ, ఆశలు పెంచుకున్నావని ఆలోచించలేకపోయేను"

"పోన్లే మామయ్యా"

"కాదు రాధా! వసుధ నన్ను పెళ్ళిచేసుకోదు. నాకు తెలుసు. అందుకయినా రాజీపడి నిన్ను చేసుకోవాలనే అనుకున్నాను. కానీ అది కూడా నాకు సంభవంగా తోచటంలేదు"

"అదేం మామయ్యా! ఆ అమ్మాయికి నీకంటే మంచి వరుడెక్కడ దొరుకుతాడు?"

"అవన్నీ నేను చెప్పలేను రాధా! ఆ అమ్మాయి నన్ను చేసుకోదు. నేను నిన్ను చేసుకోను. మీ అమ్మ చదువుకోలేదు. ఇవన్నీ అర్ధంచేసుకోలేదు. నువ్వు చదువుకున్నదానివి. సంస్కారం కలదానివి. నేను నీకు చెప్పేది నువ్వు అర్ధం చేసుకుంటావనే ఇంత దూరం తీసుకొచ్చి ఇంత వాగాను"

'అయితే వసుధ గర్భవతి కాదు. నేను పొరపాటుగా అర్ధంచేసుకున్నట్టున్నాను' అనుకుంది రాధ అమాయకంగా

★ ★ ★

వసుధ మామయ్యను ప్రేమించటంలేదనే విషయం రాధ మనసుకు కొంత శాంతిని కలిగించింది. ఇప్పుడు అతన్ని తనతో పెళ్ళికి బలవంతపెట్టడం 'రబ్బింగ్ ఆన్ ది రాంగ్ సైడ్' అని కూడా అనుకుంది. అందువల్ల తల్లితో,

"మామయ్య అంతా నాతో మాట్లాడేడు. ముహూర్తాలు అవీ ఇప్పుడు కాదు" అంది. రవీంద్రని వసుధ చేసుకోని పక్షంలో అతను ఏనాటికయినా తనవాడే అని ఆ అమ్మాయి నమ్మింది.

భవానమ్మ, "రాధా! ఈ వసుధేమిటే ఫ్రెండు ఇంటికెళ్ళిందంటాడు ఓబులయ్య. పదిహేను, ఇరవై రోజులయి పోయింది. రాలేదు" అని అడిగింది.

"తెలియదమ్మా!" అంది రాధ.

ఆమెకు కూడా ఆశ్చర్యంగానే వుంది. ఇదివరకు రవీంద్ర క్లినిక్‌లో ఉద్యోగంలో చేరకముందు వసుధ దగ్గరకు వెళ్ళి కూర్చుని కబుర్లు చెప్పేది. వసుధ కూడా తరచూ వాళ్ళ ఇంటికి వచ్చేది. ఆ అమ్మాయి నర్సుగా చేరేక, తీరిక లేక రావటం తగ్గించింది. అనుమానాలతో, అపార్ధాలతో ఆమెను వీళ్ళూ దూరంగా వుంచేరు. లేకపోతే, ఒకే కాంపౌండ్‌లో వుండే వ్యక్తి ఇరవైరోజులుగా కనపడకపోతే పట్టించుకోకపోవటమేమిటి? నరసింహారావు కూడా భార్య వసుధ గురించి అడగటం విన్నాడు. అతని కాళ్ళూ చేతులూ చల్లబడ్డాయి. వసుధకు ఎవరూ లేరని అతను ఎరుగును. ఈ రెండేళ్ళలోనూ ఆమె ఎక్కడికీ వెళ్ళలేదు కూడా. ఇదేమైనా పోలీసుకేసు అవుతుందా? అని అతని లాయరు బుర్ర సందేహించింది. రవీంద్రను అడగటం ఇష్టంలేదు. కానీ ఆందోళన అతన్ని నిలువనీయలేదు. చివరకు బావమరిదికి ఫోను చెయ్యటం తప్ప, అతనికి గత్యంతరంలేకపోయింది.

"రవీ! ఈ వసుధ ఎక్కడికి వెళ్ళిందో నీకేమయినా తెలుసా?"

ఫోను అందుకున్న రవీంద్ర ఆశ్చర్యపోయేడు.

"ఎక్కడికి వెళ్ళడమేమిటి? నేను నిన్న వచ్చినపుడు షెడ్డుకి తాళంవేసి వుందిగా. మీకు చెప్పి వెళ్ళలేదూ?" కొంచెం సందేహిస్తూనే ఆయన సమాధానం చెప్పాడు.

"నిన్నటి విషయం కాదు. పదిహేను ఇరవై రోజుల క్రితం ఓబులయ్య సూటుకేసుతో వెళ్ళటం చూసేడట. ఫ్రెండు పెళ్ళికి వెళ్తున్నాను, నాలుగు రోజుల్లో వస్తానని చెప్పిందట. ఒకవేళ మన గది ఖాళీచేసి వెళ్ళిపోయిందంటావా?"

"నాన్సెన్స్!" అతను విసుగును దాచుకోలేకపోయాడు.

"సరే... నేను వస్తున్నాను. వుండండి"

అని ఫోను పెట్టేశాడు. తనూ పెట్టేసి భార్యకు చెప్పేడు. "నీ తమ్ముడు దిగుతున్నాడు"

"అది కనపడటంలేదంటే ఆఘమేఘాల మీద వస్తాడు. మీదో మూర్ఖత్వం. పోయి నదాన్ని పోనివ్వాల్సింది. వాడికెందుకు ఫోను చెయ్యటం? వెళ్ళిపోయిన తద్దినాన్ని వెతికి తెస్తానంటారేమిటండీ? "

"మట్టిబుర్ర! అంతకంటే తెలివితేటలెక్కడ ఏడ్చేయి నీకు? ఆ పిల్ల కనపడకపోతే, పోలీసులొచ్చి నిన్నూ, నన్నూ మూసేస్తారు. అర్థమయిందా? "

"అది కనపడటం లేదని ఎవరు రిపోర్టు ఇస్తారటా? మీ ఛాదస్తం కానీ"

"నాది కాదు ఛాదస్తం. నీది. ఎవరిదా కానో ఎందుకు? నీ తమ్ముడే ఇస్తాడు"

ఇంతలో రవీంద్ర రానే వచ్చేడు. నరసింహారావు బావమరిదికి ఫోనులో చెప్పిన విషయమే మళ్ళీ చెప్పాడు. రవీంద్ర ఓబులయ్యను పిలిచి పోలీసు ఆఫీసరులా వంద ప్రశ్నలు వేసేడు. వాడు ఎన్నిసార్లు చెప్పినా అదే చెప్పాడు. "ఫ్రెండ్ ఇంటికెళ్తున్నాను. నాలుగు రోజుల్లో వస్తాను. మీ అమ్మగారికి చెప్పమన్నారండి"

వసుధ ఏమయి వుంటుంది? కొంపదీపి వాడిలాగే అడవుల్లోకి వెళ్ళలేదు గదా!

★ ★ ★

రోడ్డుమీదకు వచ్చిన వసుధ బస్సెక్కి విజయవాడలో దిగింది. కైలాసపురంనుండి గుంటూరు రావటం గుర్తొచ్చింది. బస్టాండు నుండి రైల్వే స్టేషనుకు వెళ్ళి కూర్చుంది. గుంటూరు వచ్చినపుడు చదువుకోవాలనే గమ్యం వుంది. ఇప్పుడేదీ తన లక్ష్యం? జీవితంనుండీ, తెలిసిన వాళ్ళనుండీ పారిపోవటమా? ఈ ఊళ్ళోనే వుండి ఏదో ఒక వుద్యోగం వెతుక్కుందామా? అని ఆలోచించింది.

ఇక్కడుంటే ఎవరో ఒకరు తెలిసినవాళ్ళు కనపడతారు. గుంటూరు వాళ్ళు చాలామంది ఉదయం లేచిన దగ్గర్నుండీ విజయవాడలోనే వుంటారు. ఇంత పెద్ద ఊరిలో డిగ్రీ కూడా లేకుండా, పెరిగే కడుపుతో ఏ ఉద్యోగంలో చేరుతుంది? తను ఎక్కడ తలదాచుకోగలదు? ఏదో ఒక లాటరీ టిక్కెట్టు కొంటున్నదానిలా కౌంటర్‌లో చెయ్యిపెట్టి,

"ఇప్పుడేం రైలు వుందండీ? " అనడిగింది.

"ఏ వూరు వెళ్ళటానికీ? " అని ఎదురు ప్రశ్నవేసేడు కౌంటర్‌లో మనిషి.

"ఇప్పుడేదో ఎనౌన్స్‌మెంటు ఇచ్చేరుగా!"

"అదా మద్రాసు మెయిల్"

"అయితే మద్రాసుకు ఒక టికెట్టివ్వండి"

ఆ క్షణాన వసుధ తన గమ్యం నిర్ణయించుకుంది. మద్రాసు నుండి తిరువణ్ణామలై వెళతాను అనుకుంది. నీకు రావాలన్పిస్తే రా అని చలంగారు రాయటం గుర్తుకొచ్చింది. తన రచనల్తో ఆడవాళ్ళను్ను చెడగొట్టేశాడు అనే మూర్ఖులకు ఏం తెలుస్తుంది ఎంతమంది అభాగ్య స్త్రీలను ఆదరించాడో! ఇప్పుడు ఆయన లేకపోతేనేం! నర్తకి సాంతన వచనాలను ఉత్తరాలలో ఎరిగిన తాను ఆ ప్రేమమయి సన్నిధికి వెళుతుంది. నాకు రమణస్థాన్‌కి మించిన స్థలం లేదు. ఛావయినా, బతుకయినా ఇక అక్కడే అనుకుంది.

మద్రాసులో రైలు దిగి బస్సు పట్టుకుని ఆరుగంటలు ప్రయాణం చేసి తిరువణ్ణామలైలో దిగింది. విశ్వానికి ఆధ్యాత్మిక కేంద్రమని భక్తులు విశ్వసించే అరుణగిరి పర్వతం దూరంగా కనిపిస్తోంది. బస్టాండులో ఎవరో చెప్పేరు. 'దేవాలయం సత్రం వుంది. అందులో దిగవచ్చు' అని. అక్కడికి వెళ్ళి రూము తీసుకుని, స్నానంచేసి పడుకుంది. తెల్లగా తెల్లవారితే కానీ మెలకువ రాలేదు. కృష్ణమోహన్ ప్రేమలో పడిన క్షణం నుండీ, గత రాత్రివరకూ ఏ రాత్రీ కంటినిండా నిద్ర ఎరుగదు. అబ్బా!




మనసూ, శరీరమూ ఎంత తేలిగ్గా ఉన్నాయి. స్థల మహత్యమేమో అనుకుంది. మళ్ళీ తన ఆలోచనకుతానే నవ్వుకుంది. అదేమీ కాదు. ఇన్నాళ్ళూ తనను పట్టి కుదిపేసిన ఒక అనిశ్చితస్థితి తొలగిపోయింది. భాష తెలియని ప్రదేశానికి వచ్చి తల దాచుకుంది. తనను గుర్తించేవారు ఎవరూ లేరిక్కడ. తన గర్భాన్ని ఎగతాళి చేసేవారు లేరు. బతుకు భయం లేదు. చలంగారి ఆశ్రమం, అందులో నర్తకి వుందని ధీమా! నిద్రపట్టడంలో ఆశ్చర్యం లేదు.

సరాసరి వెళ్ళి రమణాశ్రమం గురించి అడిగింది. అక్కడ కొందరికి తెలుగు బాగానే అర్థమవుతుంది. అలా అర్థమయిన ఒక యువసన్యాసి 'రండి చూపిస్తాను' అని వసుధను బయటకు తీసుకుని వచ్చి దూరంగా చేయిచాచి చూపించేడు. "అదే రమణస్థాన్"

"ఎవర్రా ఈ పిచ్చిది- ఇంతదూరం వచ్చి భగవానుడి దర్శనం చేసుకోకుండా అటు పరుగెత్తుతుందే" అని కొందరు ఆశ్చర్యపోయారు.

అక్కడ-

చీలమండలం మీదకు ముతక చీరె కట్టుకుని ఒక నడివయస్కురాలు ఆవుకు మేత పెడుతోంది.

"చలంగారి ఆశ్రమం"... అంది వసుధ బిడియంగా.

"మీరు? "

"నా పేరు వసుధ... నేను"

"గుంటూరు కదూ నీది. నేను నర్తకిని" అందావిడ. ఆవును వదలి వసుధ దగ్గరికి వస్తూ, ప్రేమించటానికి ఎవరైతేనేం అన్నట్టుగా.

"నా పేరిట బ్యాంకులో ఒక పదివేలు వుండి వుంటాయి. అది కరెంట్ ఎకౌంట్. వడ్డీ అంతగా రాదు. అది తప్ప నేను మీకేమీ ఇవ్వలేను. నా మిగిలిన భారం అంతా మీదే" అన్నది వసుధ.

"నేనడిగానా పిచ్చి తల్లీ! నువ్వు నిశ్చింతగా వుండు" అంది పక్షులకీ, పశువులకీ ప్రేమ పూర్వకంగా సేవచెయ్యటమే తప్ప -ప్రతి ఫలం ఆశించని నర్తకి.

నర్తకి పెట్టినదేదో తినడం, సాయంత్రం తిరగటం, మహర్షి సమాధి ముందు ధ్యానం, రాత్రికి నిద్రమాత్రలు మింగటం- అదీ వసుధ దినచర్య.

"నీకు బిడ్డ కావాలంటే ఇక నువ్వు నిద్ర మాత్రలు మానెయ్యాలి వసుధా!" అంది నర్తకి ఆరోజు మధ్యాహ్నపు భోజనాలపుడు చాలా కాజువల్‌గా- 'ఇంకొంచెం పప్పు వేసుకో' అన్నంత మామూలుగా. ఎవరూ వసుధను విచిత్రంగా చూడలేదు. ఎంతో మంది ఆడవాళ్ళు, మగవాళ్లు, పిల్లలు భోంచేస్తున్నారు. వాళ్ళందరూ ఎవరో, ఎందుకు అక్కడున్నారో వసుధకు ఏమీ తెలీదు. తెలుసుకోవాలనే ఆసక్తే లేదు. తన రాతలతో యావదాంధ్రను కదిపి, కుదిపినవాడు లేడిప్పుడు. ఇంతేనా జీవితం?

ఆ సాయంత్రం నర్తకి ఆవులకు మేత పెడుతోంటే ఆమె వంకే చూస్తూ, "ఇవాల్టి నుండీ నిద్రమాత్రలు వేసుకోను. నాకు డాక్టర్‌తో పరీక్ష చేయించరూ" అంది.

"అట్లాగే"

★ ★ ★

నెలరోజుల అనంతరం... వసుధ ఆశ్రమంలో చెట్టుకింద కూర్చుని ఈశ్వరోక్తులు చదువుతూ మధ్యలో ఎందుకో తలెత్తి చూస్తే దూరంగా పరిచయమైన 'నడక' కన్పించింది. తను ఆశ్చర్యంగా చూస్తూ వుండగానే ఆ నడక వేగం హెచ్చయి, తన ముందుకు వచ్చి నిలబడ్డాడు రవీంద్ర.

"రవీంద్రా! మీరా? " ఆశ్చర్యంతో లేవబోయింది. పెరుగుతున్న గర్భం కొంచెం ఇబ్బంది కలిగించగా రవీంద్ర చేయి ఆసరా అందించాడు.

ఇద్దరూ లేచి నెమ్మదిగా ఆవరణలో నడ

వటం మొదలుపెట్టేరు.

"నేను ఇక్కడ వున్నానని మీకు ఎలా తెల్సింది? "

"నీ టెంపర్‌మెంట్ నాకు తెలియదా వసుధా! మీ ఇద్దర్నీ నాకంటే బాగా తెలిసిన వాళ్ళెవరున్నారు? ప్రతి సమస్యకూ విప్ల వాన్నే పరిష్కారంగా ఎంచే వాడూ, ప్రతి బాధకూ, సమస్యకూ వేదాంతాన్ని ఆశ్ర యించే నువ్వూ" అన్నాడు. కొంచెం విసుగు గొంతుతో. ఆ 'వాడు' కృష్ణమోహన్ అని తెలుసు. కృష్ణ సంగతి ఏమయినా తెలిసిం దేమో!

"ఇంతదూరం ఇంత కష్టపడి దెప్పటానికి వచ్చారా? "

"లేదు. కృష్ణ ఎలాగో పోయాడు"

పోయాడనే మాట అపశ్రుతిలా వినిపి స్తోంది.

"వాడి దగ్గరకు నేనెలాగూ పోలేను. ఇక మిగిలింది నువ్వు. నిన్ను తీసుకువెళ్ళ టమూ, నీ జీవితాన్ని చక్కదిద్దటమూ నా బాధ్యత అనుకుని వచ్చేను"

"నేనసలు ఇక్కడ వున్నానని ఎలా ఊహించగలిగేరు? "

"ఊహించటమా? పరిశోధన చేశాను. నువ్వు పలాయనం చిత్తగించినట్లు ఇరవైరో జులు వరకూ నాకు తెలియలేదు. నువ్వు క్లినిక్‌కి రావటానికీ, నన్ను చూడటానికీ ఇష్ట పడటంలేదని, నేనూ నీ జోలికి రాలేదు"

"ఇష్టపడకపోవటం కాదండీ, ముఖం చెల్లక రాలేదు"

"ఏదయితేనేమి? ఒకరోజు వస్తే నీ షెడ్ తాళంవేసి వుంది. నీ గురించి అడుగు తోంటే మా అక్క టాపిక్ డైవర్ట్ చేసింది. అదో రామాయణంలో పిడకలవేటలే. తర్వాత చెపుతాను. తర్వాత మా బావగారు ఫోను చేసి నువ్వు చాలా రోజులుగా కనప డటంలేదని చెప్పారు. ఓబులయ్య నిన్ను సూట్‌కేసుతో వెళ్తోంటే చూశానని చెప్పేడు. ముందు అడవుల్లోకి వెళ్ళి వుంటావా? అని సందేహించాను. కానీ అది సంభవం కాదు అన్పించింది. నీ షెడ్డు తాళం పగల గొట్టాం. నీ పుస్తకాలకట్ట మా ఇంటికి తీసు కుపోయాను. వెతుకుతోంటే వాటిలో చలం గారితో నీ పాత కరస్పాండెన్స్ కన్పించింది. ఇక్కడికే చేరుకుని వుంటావని ఊహించి బయలుదేరాను. కానీ వసుధా! నర్తకిని కలిసి, ఆమె నువ్వు ఇక్కడే వున్నావని చెప్పేవరకూ నాకు నిన్ను చూస్తానని ఆశ లేదు"

"అయితే ఇప్పుడు నన్ను మీతో తీసుకువె ళ్తానంటారు"

"అవును"

"తీసుకువెళ్ళి? "

"నాకు చేతనయినంతలో నీ జీవితం చక్కదిద్దుతాను"

"అంటే ఏం చేస్తారు? నాకు అబార్షన్ చేసి, మళ్లీ నన్ను కన్నెపిల్లగా 'లేబిల్'వేసి, పెళ్ళి చేస్తారా? అదేనా చక్కదిద్దట మంటే? " గొంతులో ఉక్రోషం.

"కాదు. వెళ్ళిపోయిన మనిషిని తలుచు కుని, కృంగి కృశించి, దొంగ సన్యాసం పుచ్చుకుని సంఘంనుండి పారిపోవటం"

"నాది దొంగ సన్యాసమా? "

"కాక? సన్యాసిని అంటే నీ ఆదర్శ వనిత- ఐడియల్ షి ఉందే- నర్తకి. ఆవి డది. ఇంటికి ఎవరొచ్చేరో వాడు దొంగో, దొరో, దేవుడో, భక్తుడో కూడా పట్టించుకో కుండా పొట్ట చూసేది. స్పృహలో వున్నంతసేపూ గొడ్డులా పని చేసేది. రాత్రికి అలసటతో ఒళ్ళెరుగని నిద్రపోయేది. నీలా మెలకువ వున్నంతసేపూ ఆశ్రమంలో చెట్లు కింద కాలాన్ని చంపి- రాత్రికి నిద్ర మాత్రలతో నిద్రని కొనుక్కుని జీవితాన్ని గడిపెయ్యలేదు"

"ఏం చెయ్యను మరి? "

"కృష్ణనడక్కపోయావా? "

వసుధకి అకారణంగా చాలా కోపం వచ్చింది.

"రవీంద్రా! నాకు సమస్యలున్నాయని నేను మీ ముందు ఏకరువు పెట్టలేదు. నా సమస్యను పరిష్కరించమని మిమ్మల్ని దేవి రించటం లేదు. మీరు ఆయనను నిందించ వద్దు. నా పరిస్థితికి ఆయనెంత బాధ్యులో నేనూ అంతే బాధ్యురాలిని"

'ఆ రాత్రి... తామిద్దరూ ఒకటయిన రాత్రి- అంత మైకంలోనూ, అతను తనను తాను నిగ్రహించుకోవాలని కొంత ప్రయత్నించకపోలేదు. కానీ, అప్పటికే చాలా ఆలస్యమయిపోయింది. వెల్లువలా పొంగిన ప్రేమ తన మనసుతోపాటు శరీరాన్ని ముంచెత్తగా అదుపులో పెట్టుకోలేని తాను, ఆ క్షణాన అతనిలో కరిగిపోవటమే జీవిత ధ్యేయమన్పించిన తాను లతలా అతన్ని అల్లుకుపోయింది. ఏ మూలనో అతన్ని ఈ బంధంతో కట్టెయ్యగలననే స్వార్ధం కూడా వుంది. ఆ విషయం రవీంద్రకెట్లా చెపుతుంది?'

"సారీ వసుధా! నిన్ను నొప్పించటానికి నేనింత దూరం రాలేదు. నిన్ను ఒప్పించి, వెనక్కు తీసుకెళ్లాలనే వచ్చాను. జీవితం నుండి పారిపోవటం, సమస్యలను వాయిదా వెయ్యటం పిరికివాళ్ళ లక్షణం. జీవితం జీవించటానికి వసుధా! దానిని ఎదుర్కో. దాని నుండి పారిపోకు. ఇంతకంటే నేను చెప్పేదేమీ లేదు"

"నేను కొంచెం ఆలోచించుకుంటాను"

"కొంచెమేం ఖర్మ! రాత్రంతా ఆలోచించుకో. నేను హోటల్లో దిగాను. మళ్ళీ ఉదయం వస్తాను. ఏ సంగతీ అప్పుడు చెప్పు"

వసుధ మౌనంగా ఆలోచిస్తూ ఆ చెట్టుకిందనే కూర్చుంది. చాలా పొద్దుపోయాక టార్చిలైటు తీసుకుని వచ్చింది నర్తకి. అటూ ఇటూ చూసి అడిగింది.

"అబ్బాయి వెళ్ళిపోయాడా?"

వసుధ ఆమె చేతిని అందుకుంది. ఆమె వసుధ పక్కన చతికిలబడి ఆమె తలను గుండెలకు హత్తుకుని, "ఆ డాక్టరబ్బాయి అంతా చెప్పాడు. ఏమి ఆలోచించుకున్నావ్?" అని అడిగింది.

"నేనేమీ ఆలోచించలేకుండా వున్నాను, ఆ ఓపిక కూడా లేదు"

"పోనీ, నేను చెప్పినట్టు వింటావా?"

తల ఊపింది.

"నువ్వు ఆ అబ్బాయితో వెళ్ళు"

వసుధ చివాలున తలెత్తి చూసింది.

"అవును. నువ్వు ఆ అబ్బాయితో వెళ్ళు. నువ్వు మాకు భారంకాదు. నీ మంచి కోసమే చెబుతున్నాను. నీకు ఎప్పుడు రావాలన్పిస్తే అప్పుడు ఇక్కడకు వచ్చెయ్యి. ఇప్పుడు మాత్రం వెళ్ళు"

ఆ రాత్రి దగ్గరుండి భోజనం పెట్టింది. తన బట్టలన్నీ ఒద్దికగా సూటుకేసులో సర్దింది. బ్యాంక్ పాస్ బుక్కు, చెక్కుబుక్కు ఆమెకు చూపించి బట్టల అడుగున సర్దింది.

చలంగారి పుస్తకాలు కొన్ని, భగవాన్ రమణకు సంబంధించిన పుస్తకాలు, భగవద్గీత ఇచ్చి నుదురు చుంబించి, "ఏమీ ఆలోచించకు. విశ్రాంతి తీసుకో" అని చెప్పి వెళ్ళిపోయింది.

ఎంతకూ నిద్ర పట్టలేదు. ఏమీ ఆలోచించలేకుండా వుంది. శూన్యంగా వుంది హృదయమంతా. చీకటిలో తలుపు తీసుకుని గదిలోకి సౌరిస్ వచ్చింది. ఆమె కళ్లు మూసుకుని నిద్ర నటించింది.

నొసట విభూతి పెట్టి, తలమీద ఆశీర్వదిస్తున్నట్టుగా చెయ్యి పెట్టి వెళ్ళిపోయింది. ఉదయం రవీంద్ర వచ్చేసరికి వసుధ సూట్ కేసుతో ప్రయాణానికి సిద్ధమైవుంది.

★ ★ ★

మద్రాసు రైల్వేస్టేషన్లో రవీంద్ర విజయవాడకు టిక్కెట్లు తీసుకుంటోంటే వసుధకు పాత భయాలన్నీ మళ్ళీ చుట్టుముట్టాయి. గుంటూరు, భవానమ్మగారి కుటుంబమూ, తన కాలేజీ అన్నీ గుర్తుకొచ్చాయి.

"మనం ఇప్పుడు గుంటూరు వెళ్త

న్నామా?" అని అడిగింది కంపిస్తోన్న స్వరంతో.

"అవును. ఏం? గుంటూరు రాకుండా ఏంచెయ్యాలనుకుంటున్నావు వసుధా?"

వసుధకు కొంచెం కోపం కలిగిన మాట నిజం. తాను చెయ్యాలనుకున్నది తాను చేసింది. రమణస్థాన్‌కి వెళ్ళటం. ఇప్పుడు అక్కడినుండి వెనక్కు లాక్కొచ్చి ఏం చేద్దామనుకుంటున్నావు అంటే ఏమిటి చెప్పడం? మళ్ళీ అతనే అన్నాడు.

"వసుధా! నేను మగవాడిని. నాకు సమాజమంటే భయంలేదు. సరే, నా చుట్టూ వున్న మనుష్యులు- అక్కా వాళ్ళ కుటుంబం అయితేనేం, నా ఆసుపత్రి సిబ్బంది అయితేనేం వాళ్లంటే అసలు లేదు. నీ విషయం అలా కాదు. నువ్వు ఆడపిల్లవి. వెనుకా, ముందూ ఎవరూ లేనిదానివి. ప్రస్తుతం నువ్వున్న పరిస్థితి కూడా వాళ్ళు వేలెత్తి చూపేదిగానే ఉంది"

"దానికి నన్నేం చెయ్యమంటారు? వాళ్ళెవరూ నన్ను చూసి నవ్వకూడదనుకుంటే నాకు పెళ్ళయి వుండాలి. ఇప్పుడు నన్నెవరు చేసుకుంటారు?"

"నన్ను చూసి అడుగు ఆ ప్రశ్న. సమాధానం నీకు తెలిసేవుంటుంది. నీ నిస్సహాయ పరిస్థితిని నాకు అనువుగా మార్చుకోవటం నాకు అసహ్యం. నేను అడిగేది అది కాదు. నువ్వు గుంటూరు రానంటే చెప్పు ఇక్కడ మద్రాసులో నాకు తెలిసిన వాళ్ళున్నారు. ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. చేర్పించి వెళతాను. నీకు గుంటూరు రావాలని వుండీ, ఈ పరిస్థితిలో రాలేనంటే, నాకు మనుష్యులకంటే చట్టాలు ముఖ్యంకాదు. ఇక్కడే అబార్షన్ చేయించి తీసుకువెళతాను. బిడ్డని కన్నాక వస్తానంటే, మంచి నర్సింగ్‌హోంలో చేర్పించి వెళతాను. ఏమంటావు?"

"మరి కృష్ణ?"

"యు జస్ట్ ఫర్గెట్ ఎబౌట్ హిమ్. వాడిని మరిచిపో వసుధా! నీకంటె ఎక్కువగా నాకు వాడు తెలుసు. తన సిద్ధాంతం కంటే ఏదీ ముఖ్యం కాదు వాడికి. వాడొస్తాడు. ఏదో చేస్తాడు అని ఆశించకు. వాడు లేడనీ, ఇక రాడనీ నిర్ణయించుకుని నీ భవిష్యత్తుని ప్లాన్ చేసుకో"

"నన్ను రమణస్థాన్ నుండి ఎందుకు తీసుకొచ్చేశారు?" వసుధ ఏడవటం ప్రారంభించింది.

అప్పుడు మాత్రం రవీంద్ర చాలా తీవ్రమయిన సమాధానం ఇచ్చాడు.

"చూడు వసుధా! కృష్ణ ఒక సిద్ధాంతాన్ని నమ్మాడు. దానికోసం పాటుపడుతున్నాడు. నువ్వు వేదాంతాన్ని నమ్మలేదు, నువ్వు గొప్ప పలాయనవాదివి. జీవితంనుండి పారిపోవటానికి వేదాంతాన్ని ఆసరాగా తీసుకుంటున్నావు. అర్థమవుతోందా వసుధా? నువ్వు సంఘజీవివి. ఈ సంఘంలో వుండాలనుకుంటున్నావు. దీనిలోని అందాలు, ఆనందాలు అన్నీ నీకు కావాలి. ఎక్కడయినా, ఏదయినా నీకు వ్యతిరేకంగా జరిగిందా, పారిపోయి చిన్మయ ఉపన్యాసాల్లో, ఆశ్రమాల్లో దాక్కుంటావు. నీకంటే చలం బాగా నాకు అర్థమయ్యాడు. వసుధా! ఆయనే కనుక ఆడపిల్ల అయి వుంటే- కడుపు వస్తే- అదీ తాను ప్రేమించినవాడివల్ల కడుపొస్తే తప్పు చేసిన దానిలా తెలిసిన వాళ్లందరినుండీ దూరంగా పారిపోయి ఆశ్రమాల్లో దాక్కోడు. హి వజ్ ఎ ఫైటర్ ఆర్ ట్రూ. సంఘానికీ, నీకూ పడకపోతే సంఘంలోనే ఉండి పోట్లాడాలి. కానీ పారిపోవటం మూర్ఖత్వం. సన్యాసమంటే విరక్తికాదు వసుధా! సత్యాన్వేషణ. అందరినీ, అన్నిటినీ సమానంగా చూడగల సమదృష్టి. మార్క్సిష్టులయినా, వేదాంతులయినా చెప్పేది ఒకటే. నిన్ను నువ్వు తెలుసుకో నీకేం కావాలో తెలుసుకో. దాన్ని పొందటానికి ప్రయత్నం చెయ్యి. పారిపోవటం ఏ సమస్యకూ పరిష్కారం కాదు"





"అయిపోయిందా మీ ఉపన్యాసం?" నవ్వుతూనే అడిగింది వసుధ.

అతనూ నవ్వుతూనే సమాధానం ఇచ్చాడు.

"ప్రస్తుతానికి నా ఉపన్యాసం నచ్చకపోతే చెప్పు. వెనక్కి తిరువణ్ణామలై తీసుకుపోతాను"

విజయవాడలో రైలు దిగి, గుంటూరు బస్సు ఎక్కాక వసుధ అడిగింది.

"ఇప్పుడు మనం మీ అక్కగారింటికి వెళ్తామా?"

అతను ఎదురు ప్రశ్న వేశాడు.

"ఏం? వద్దా?"

"మీరు ఏ సమస్యయినా ఎదుర్కో, పోరాడు అన్నారు. కానీ నాకిప్పుడు ఎవరికీ ఎదురుపడే శక్తి లేదు"

అతనికి అర్ధమయింది. జాలి కూడా కలిగింది. వసుధ మానసికంగా కాదు, శారీరకంగా కూడా చాలా అలిసిపోయింది.

"వసుధా! అలసటగా వుందా? పోనీ బస్సు దిగి టాక్సీలో వెళ్ళిపోదామా?"

"వద్దులెండి. బస్సు కూడా బయలుదేరబోతోందిగా"

ఇద్దరూ గుంటూరులో దిగేసరికి పొద్దుపోయింది. అతను ఒకటే రిక్షా మాట్లాడాడు. వసుధ ఏమీ మాట్లాడకుండా ఎక్కి కూర్చుంది. తాను ఎక్కి కూర్చుంటూ రవీంద్ర రిక్షావాలాకు సూచన ఇచ్చాడు.

"చూడుబాబూ! రిక్షా తొక్కవద్దు, నడిపించు"

"అట్టయితే కృష్ణనగర్ చేరేసరికి గంట వుద్ది బాబూ! నాకూ బేరాలు పోతాయి గదా!"

"అన్ని బేరాల డబ్బులూ నేనిస్తానుకదా, నడిపించు. రిక్షాలో ఒపలేని మనిషి వుంది. కన్పించటంలా?"

రిక్షా అతను ఇల్లు చేరేసరికి గంటన్నరసేపు పట్టింది. రవీంద్ర కూడా అన్నమాట నిలబెట్టుకుని అతనికి అదనంగా డబ్బిచ్చాడు. "జాగ్రత్తగా తీసుకొచ్చేవు. సంతోషం" అని కృతజ్ఞతలు కూడా వెల్లడించాడు.

వసుధ స్నానంచేసి పడుకుంటే వేడిపాలు తెచ్చి ఇచ్చాడు. పాలు తాగాక వసుధ నిద్ర తేలిపోయింది. "మీకు పనేమీ లేకపోతే కొంచెంసేపు కూర్చోండి" అని అడిగింది.

అతను గ్రహించాడు తనతో మాట్లాడాలనుకుంటున్నదని. కాఫీ కలుపుకుని తెచ్చుకున్నాడు.

"చెప్పు వసుధా! ఏమిటో చెప్పాలనుకుంటున్నట్టున్నావు?"

"నా సామానులు ఎక్కడున్నాయి?"

"నీ పుస్తకాలన్నీ నేను తెచ్చేశాను. ఇప్పుడు మా ఇంట్లోనే వున్నాయి. వాటి సహాయంతోనేగా నేను పరిశోధన సాగించి, నిన్ను పట్టుకోగలిగాను"

"మిగిలిన సామానులు?"

"చాపా, స్టవ్వూ వగైరాలేనా? నువ్వు బతికి వున్నావో లేదో, వుంటే నాకు కన్పిస్తావో లేదో, కనిపిస్తే తిరిగి నాతో రావటానికి ఒప్పుకుంటావో లేదో అన్నీ సందేహాలేగా వసుధా! అందుకని ఆ సామాన్లన్నీ ఓబులయ్యా అండ్ గ్యాంగ్ వున్నారుగా, అక్కావాళ్ళ పని వాళ్లు-వాళ్ళకి దానం చేసేశాను నీ అనుమతి లేకుండానే"

"ఫర్వాలేదులెండి. నేను ఇక్కడ మీ ఇంట్లో ఎన్నాళ్లుంటాను?"

అతను ఎదురు ప్రశ్న వేశాడు.

"ఎన్నాళ్లు ఉండగలవు?"

"మీరు ఎన్నాళ్ళు ఉంచుకోగలరో చెప్పండి"

"జీవితాంతమూ సంతోషంగా"

ఆమె అతన్ని ఆశ్చర్యంగా చూసింది.

"అవును వసుధా! నీ పలాయనం నాలో కూడా మంచి మార్పే తెచ్చింది. నేను కూడా సమస్యలను వాయిదా వెయ్యకూడదనుకుంటున్నాను. మొహమాటపడి, మాటా మనసూ దాచుకోకూడదనుకుంటున్నాను. నీకే అనుమానాలున్నా అడిగెయ్యి. బిడియ

పడకు. భయపడకు"

"మీరు... మీరు నన్నెందుకు తీసుకువచ్చారు?"

"నేను హెచ్చరిక చేశాను. గుర్తుందిగా వసుధా! మనసూ, మాటా దాచుకోనని. సమాధానం చెప్పబోతున్నాను. నీ ప్రశ్నను 'విత్‌డ్రా' చేసుకోవాలంటే చేసుకో"

"నేను కూడా అన్నింటికీ తెగించే వున్నానులెండి. ప్రశ్నను విత్‌డ్రా చేసుకోవటం లేదు"

"రైట్! అయితే విను. నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నిన్ను చూడకుండా ఉండలేను. అందుకని తీసుకువచ్చాను"

"ఏంటీ?" వసుధ కీచుగా అరిచింది.

"అవును. నువ్వంటే నాకు పిచ్చి నిన్ను చూడకుండా వుండలేను. అందుకనే తీసుకొచ్చాను"

"మీకు నిజంగానే మతిపోయింది"

"లేదు. నిజమే మాట్లాడుతున్నాను"

"ఈ ప్రేమ వ్యవహారం ఎప్పటినుండి?"

"చెపితే నమ్మవు. మళ్ళీ మతిపోయిందంటావు"

"అన్నీ నమ్మలేని నిజాల్లాగానే వున్నాయి. చెప్పి చూడండి"

"లవ్ ఎట్ ఫస్ట్ సైట్. నిన్ను చూసిన క్షణంనుండీ"

"మరి నాకెప్పుడూ చెప్పలేదేం?"

"మాటల్లో చెప్పలేదు. నిజమే"

"మీరు రాధని..."

"ప్రేమించలేదు. కానీ నువ్వు కనపడకుండావుంటే పెళ్ళిచేసుకుని వుండేవాడిని"

"ఇప్పుడు...?"

"చేసుకోనని చెప్పేశాను"

"నేను మిమ్మల్ని చేసుకుంటాననుకుంటున్నారా?"

"పొరపాటున కూడా అనుకోవటంలేదు"

"మరెందుకు నాతో ఇవన్నీ చెపుతున్నారు?"

"బాగుందమ్మోయ్! ప్రశ్నలు అడిగి జవాబులు చెప్పించుకుని, ఎందుకు చెపుతున్నానంటావేం?"

రవీంద్ర హాస్యం ఆడుతున్నాడో, నిజం చెప్తున్నాడో ఆమెకు అర్థం కాలేదు.

"అర్ధరాత్రి ఈ ప్రశ్నలేమిటి చెప్పు. హాయిగా పడుకో. విశ్రాంతి తీసుకో. గుడ్ నైట్"

★ ★ ★

ఉదయం పనికుర్రాడు వసుధను చూడటమేమిటి, ఆఘమేఘాలమీద ఆ వార్తని భవానమ్మకు చేర్చటమేమిటి, ఆమె భర్తనూ, కూతురినీ తీసుకొని తమ్ముడింట్లో ప్రత్యక్షం కావటమేమిటి అన్నీ చిటికెలో జరిగిపోయాయి. వాళ్ళు ఇంటిముందు కారు దిగుతోంటే వసుధ చూసింది. నిలువునా వణికిపోయింది.

రవీంద్ర బాత్‌రూమ్‌లో ఉంటే దబదబా తలుపులు కొట్టి చెప్పింది.

"మీ సత్యం చెప్పేసినట్టున్నాడు. మీ అక్కా వాళ్ళ కుటుంబం వచ్చారు"

అతను లోపలనుండే సమాధానం ఇచ్చాడు.

"రిలాక్స్ వసుధా! నేను వస్తున్నాను"

ఈలోగా భవానమ్మ లోపలకి వచ్చేసింది. వసుధను నఖశిఖ పర్యంతమూ కాల్చేసేలా చూసింది.

"ఏంటీ? కడుపా? ఎన్నో నెల?" అంటూ వుంది. రవీంద్ర బాత్‌రూమ్‌లో నుండి వూడిపడ్డాడు.

"ఆరో నెలలే. పద, కూర్చో ఒరేయ్! సత్తిగా పితూరీలు మోసినవాడివి, కాఫీలు తేవాలని తెలీదట్రా. పోయి నాలుగు కాఫీలు పట్టుకురా"

"వాడినేమీ అనకు" అన్నాడు నరసింహారావు. దానికి రవీంద్ర ఏమీ జవాబు చెప్పలేదు.

"ఊ! ఎక్కడ దొరికింది?" అంది భవానమ్మ.




"వసుధా! నువ్వు లోపలకుపోయి విశ్రాంతి తీసుకో. ఆ! నువ్వు చెప్పు, ఏంటక్కా అడుగుతున్నావు? "

వసుధ పడకగదిలోకి వెళ్ళిపోయింది. వెనకే రాధ కూడా వెళ్ళింది. నరసింహారావు భార్య సత్యభామలా యుద్ధంలోకి దిగిందని గ్రహించి, కృష్ణుడిలా మూర్ఛబోవటం కుదరక, 'బయట పనుంది. చూసుకుని వస్తా' అని జారుకున్నాడు.

"దీన్నెక్కడ పట్టావు? " అనడిగింది భవానమ్మ.

"చూడక్కా! వసుధ కూడా నీ కూతురు లాంటి ఆడపిల్లే. దీన్నీ దాన్నీ అనకు. బాగోదు"

"ఏమిట్రా దానికీ నా కూతురికీ పోలికా? అదేమన్నా దీనిలాగ పెళ్ళి కాకముందే కడుపు తెచ్చుకుందా? "

'అక్కా! మర్యాదగా మాట్లాడు. అలా మాట్లాడ్డం రాకపోతే దయచెయ్యి"

"నువ్వు దాన్ని పంపించెయ్యి"

"అది తప్ప ఇంకేమైనా చెప్పు. వింటాను"

"నువ్వు రాధను పెళ్ళిచేసుకో"

"చేసుకోను. ఆ విషయం రాధకి ఎప్పుడో చెప్పాను"

"అంత ఆగలేని వెధవ్వి పెళ్ళి చెయ్యమని మమ్మల్నే అడిగి వుండవచ్చుగా. నిక్షేపంలా రాధనే ఇచ్చి పెళ్ళిచేసి వుండేవాళ్ళం"

వింటోన్న వసుధ ఉలిక్కిపడింది. ఈ భవానమ్మగారు తన కడుపుకు కారణం రవీంద్ర అనుకుంటోందా కొంపదీసి? అక్కగారి ఈ ఆరోపణకు అతను ఏవిధమయిన సమాధానమూ చెప్పలేదు. అది అతని బలహీనతని గ్రహించినదానిలా ఆవిడ రెచ్చిపోయి తమ్ముడని కూడా చూడకుండా "నా కూతురు అందుబాటులో లేదని, వసుధకు కడుపు చేశావు" అంటూ పిచ్చి ప్రేలాపన సాగించింది. అతను అన్నింటినీ సహనంగా విన్నాడు. ఒక్కసారయినా సహనం కోల్పోయి ఆమె కడుపుకీ, నాకూ ఏమీ సంబంధంలేదు అంటాడనుకుంది వసుధ. అతను పెదవి విప్పనేలేదు. విసిగి ఆవిడ కూతురుని తీసుకుని వెళ్ళిపోయింది. తర్వాత వసుధ అడిగింది.

"ఆమె అంతలా తిడుతోంటే మాట్లాడలేదేం మీరు? "

"అది సహజమేకదా, వసుధా! అక్క తనకి కూతురు పుట్టినప్పటినుండీ ఈ క్షణం వరకూ నేనే తన అల్లుడినని నమ్మింది. ఇవాళ నేను ఆమె కూతుర్ని చేసుకోనంటే, ఆమాత్రం కోపం రాదా? "

"అది సరే! మీమీద అంత పెద్ద నింద వేస్తోంటే..."

"ఏంటి? " అని అంతలోనే స్ఫురించినవాడిలా "అదా? మరేం చెయ్యను? నేను కాదు అంటే ఇంకో వందప్రశ్నలు వేస్తుంది. ఎవరూ? అంటుంది. నీకూ, కృష్ణకు సంబంధించిన రహస్యాలు వెల్లడించటానికి నాకేం హక్కుంది చెప్పు"

"అందుకని ఆమె అంతంత మాటలంటోంటే భరిస్తారా? పోనీ మీరు రాధను చేసుకోరాదూ? అందమయినది, మంచిది"

"చాల్లే! అది నా మేనగోడలు. దాని అందం గురించి మంచిని గురించి నువ్వేం కితాబు ఇవ్వనక్కరలేదు. నాకు తెలుసు. నేను రాధను చేసుకుంటే మా అక్క నిన్ను మెచ్చి మేకతోలు కప్పుతుందనుకుంటున్నావా? పెళ్ళయిన మరురోజే నిన్ను బయటకు గెంటుతారు. అయినా కృష్ణని ప్రేమించిన నీకు నన్ను చేసుకోవటం ఎంత కష్టమో, నాకు రాధను చేసుకోవటం అంత కష్టం"

★ ★ ★

నరసింహారావు గేటు తీసుకురావటం వసుధకు పడకగది కిటికీలోనుండి కన్పించింది. మళ్ళీ ఏం తగాదా రాబోతోందో అని వణికిపోయింది. అయినా తప్పదు. ఇంట్లో రవీంద్రా లేడు. సత్యమూ లేడు. తనే వెళ్ళి

తలుపు తీసింది. ఆయన లోపలకు వచ్చి ఫ్యాను వేసుకుని సోఫాలో కూర్చున్నాడు. "కొంచెం మంచినీళ్ళిస్తావా అమ్మా!" అని అడిగి తాగాడు.

"రవీంద్ర లేడా ఇంట్లో? "

"లేరండీ. బయటకు వెళ్ళారు"

"కాసేపు కూర్చుంటాను"

వసుధకు ఏమనాలో తెలియక తానూ ఆయనకు ఎదురుగా కూర్చుంది.

"రాధకు పెళ్ళి సంబంధం చూశానమ్మా!"

వసుధ గిల్టీగా తల వంచుకుంది. ఆయన అదేమీ గమనించకుండా చెప్పటం కొనసాగించాడు.

"ఆ అబ్బాయి పేరు భార్గవరాం అట. నిరుడు హౌస్ సర్జన్సీ అయిపోయిందట. మన ఆసుపత్రికి, అదే రవీంద్ర ఆసుపత్రికి వచ్చేవాడట. ఇతనికేమయినా తెలుసేమోనని అడుగుదామని వచ్చాను"

వసుధకు కూడా గుర్తొచ్చింది. ఆ అబ్బాయి అయిదారునెలలు పని నేర్చుకుంటానని తమ ఆసుపత్రికి వచ్చాడు.

"అవునండీ మంచి అబ్బాయి. కుర్రవాడు కూడా బాగానే వుంటాడు. డాక్టరుగారు కూడా తెలివయినవాడని మెచ్చుకున్నారు" అంది.

"అట్లాగా! వాళ్ళ నాయన కూడా డాక్టరే. డాక్టరు రమణమూర్తి అని ఎనస్థటిస్ట్ అట. బాగా సంపాదించాడన్నారు"

"మన ఆసుపత్రికి కూడా ఆయనే ఎనస్థటిస్ట్ అండీ"

"వెరీగుడ్! ఈ రవీంద్ర రాలేదు. నేను వెళ్తానమ్మా. అతను వస్తే చెప్పు. వీలుచూసుకుని ఒకసారి ఇంటికి రమ్మను. ఇద్దరం కలిసి వెళ్లి మాట్లాడివస్తాము. నీ ఆరోగ్యం జాగ్రత్త. రవి వస్తే మరిచిపోకుండా చెప్పు" అని మరీమరీ చెప్పి నరసింహారావు వెళ్ళిపోయాడు.





అతను భార్య అంత బాధ పడలేదో రవీంద్ర సంబంధం తప్పిపోయినందుకో లేక మరింత మంచి సంబంధం దొరికిందని సంతోషమోగానీ తనను నిందించనందుకు మాత్రం వసుధ సంతోషపడింది. మరిచిపోకుండా రవీంద్ర రాగానే ఆ కబురు అతని చెవిన వేసింది.

"ఎవరూ? భార్గవరామా? మంచి కుర్రాడు. వాళ్ళ నాయనే కొంచెం ఆశబోతు. రాధను చేసుకుంటామన్నారటనా? ఎందుకు చేసుకోరులే. అది బొమ్మలా వుంటుంది. మా బావ లక్షలు కట్నం ఇస్తాడు. చేదా ఏం? " అన్నాడు.

"మీకు చేదే అయిందిగా" అంది వసుధ నవ్వి.

"సరేలే. ఒకరికిష్టమైన తిండి మరొకరికి విషం అని ఇంగ్లీషు వాడి సామెత".



రవీంద్ర బావగారితో కలిసి, రమణమూర్తిగారి ఇంటికి వెళ్లి పెళ్లి మాటలు మాట్లాడి వచ్చాడు. భవానమ్మ ఫార్మాలిటీకోసమే అన్నట్టు 'తమ్ముడిని ఎదురుగా పెట్టుకుని బయట సంబంధం చేసుకుంటున్నాం. మా ఖర్మ' అని ఒకటిరెండు బుడిబుడి రాగాలు తీసింది. తర్వాత పెళ్లిపనుల్లో ఒకప్పుడు తమ్ముడికి రాధనిచ్చి చేద్దాం అనుకున్నామనే

మాటే మరచిపోయింది. కనీసం అట్లా నటించింది. అది సహజం కూడా.

రమణమూర్తి రవీంద్రకంటే ఉన్నవాడు. తండ్రీ కొడుకులు కలిపి ప్రాక్టీసు పెడితే లక్షలు కురుస్తాయని ఆశిస్తున్నారు. కుర్రవాడు కూడా చక్కనివాడు. ఆ విధంగా భవానమ్మ, రాధ కూడా సంతోషంగానే ఉన్నారు. కానీ సుబ్బి పెళ్ళి వెంకి చావుకొచ్చినట్టు ఈ పెళ్లివల్ల వసుధ బాగానే నష్టపోయింది.

ఒక మధ్యాహ్నం వేళ రాధ వసుధ దగ్గరకు వచ్చింది కాబోయే భర్తతో సహా.

"నేను షాపింగ్‌కి వెళ్ళాలి. నువ్వు తోడు వస్తావేమోనని వచ్చాను" అని చెప్పింది వసుధతో.

అది వంక మాత్రమే అని గ్రహించలేని మూర్ఖురాలు కాదు వసుధ. షాపింగ్‌కు వెళ్ళాలంటే రాధకు కంపెనీయే లేదా! తల్లి వుంది. ఇంటినిండా చెల్లెళ్లు ఉన్నారు. ఊరంతా ఆమెకు సమానహోదాలో వున్న స్నేహితులున్నారు. అన్నింటికీ మించి కాబోయే భర్త ఉన్నారు. ఇంతమంది ఉండగా షాపింగ్‌కు తోడు తానే కావలసివచ్చిందా? 'చూశావా? నువ్వు నా మామయ్యను ఎగరేసుకుపోతే నేను అంతకంటే అందగాణ్ణి, ధనవంతుడినీ వరిస్తున్నాను' అని వసుధకు చూపాలని ఆమె ఆకాంక్ష. తాను ఎన్ని మెట్లు ఆర్థికంగా పైనవుందో, వసుధ ఎంత దిగువున వుందో కూడా చూపాలని కోరిక. రవీంద్ర మెలకువగా ఉంటే ఎలా ఉండేదో కానీ అతను మధ్యాహ్నం విశ్రాంతి తీసుకోవడంతో ఇంకా రెచ్చిపోయి మాట్లాడింది రాధ. వాకిట్లో కారు చూపించి 'మా నాన్నగారు రామ్‌కి తాంబూలాలు తీసుకునేటప్పుడు బహుమతిగా ఇచ్చారని' చెప్పింది. తన చేతికున్న వజ్రాల గాజులు చూపించి 'మా అత్తగారు నాకు పెట్టారు' అని వెల్లడించింది. వసుధ తెలీక తెల్లరాళ్లు బాగున్నాయని మెచ్చుకుంటే అవి రాళ్ళు కాదనీ, వజ్రాలనీ ఆ రెంటికీ తనకూ, వసుధకూ ఉన్నంత తేడా వుందనీ పరోక్షంగా చెప్పింది.

అన్నీ చెప్పి అంతటితో ఉత్సాహం ఆగక, "నువ్వు రారాదూ మాతో షాపింగ్‌కి?" అని ఆహ్వానించింది.

"వద్దులే. మీరిద్దరూ వెళ్ళండి" అని వసుధ అంటే, "మాకు మీలా పెళ్లికిముందు ఏకాంతం అక్కర్లేదులే" అని హాస్యమాడి వసుధ ముఖంలో బాధను గమనించి పైశాచికంగా నవ్వుకుంది. తను ఇవాళ చెయ్యబోయే షాపింగ్ వసుధకు చూపించాలనే దృఢనిశ్చయంతో వచ్చింది. అందువల్ల వసుధను బలవంతపెట్టి షాపింగ్‌కి తీసుకుపోయింది. సత్యానికి చెప్పి రాధను, భార్గవరామ్‌ను అనుసరించింది వసుధ.

రవీంద్ర నిద్రలేచి వసుధ ఇంట్లో లేకపోవటం చూసి ఆశ్చర్యపోయాడు. తర్వాత సత్యం చెప్పాడు రాధతో షాపింగ్‌కి వెళ్ళిందని. 'పోనీలే. మనుష్యుల్లో పడుతోంద'ని అతను సంతోషించాడు.

ఆరాత్రి భోజనాల దగ్గర వసుధ ముఖం చాలా అలసటగా వుండటం గమనించాడు రవీంద్ర.

"ఏం వసుధా? ఒంట్లో బాగాలేదా?"

"బాగానే వుందండీ"

కానీ ఆమె ముఖం బాధతో ముడుచుకుని వుంది.

"లేదు వసుధా! నీ ముఖం వడిలిపోయి వుంది. నీకేదో నలతగా ఉందని నా అనుమానం".

"మీకంతా అనుమానమే. మధ్యాహ్నం రాధతో షాపింగ్‌కి వెళ్ళాను. కొంచెం అలసట అంతే"

"సరే. పెందలాడే పడుకో" అతను తన గదిలోకి వెళ్ళిపోయాడు.

అతనికి తెలిస్తే విసుక్కుంటాడని వసుధ చెప్పలేదు. కానీ భార్గవరామ్‌కి డ్రైవింగ్ థియరీ బాగానే వచ్చుకానీ ప్రాక్టికల్స్ అంతగా రావు. కొత్త కారు మోజులో

మామగారు బహుమతి ఇచ్చిన కారుమీద నేర్చుకుంటున్నాడు. ఆ ఉత్సాహంతో ఇవాళ షాపింగ్‌కి కూడా అదే వేసుకొచ్చాడు. కానీ కొన్ని వందలసార్లు సడన్‌బ్రేకులు వేశాడు. వేసిన ప్రతిసారీ వసుధ తుళ్ళితుళ్ళి పడింది. ఒకటి రెండుసార్లు సీటులోనుండి జారిపడింది కూడా. దాని ఫలితమో ఏమో తెలియదు. ఆమెకు సన్నగా కడుపులో నొప్పి ప్రారంభం అయింది. రవీంద్రకు చెపితే కంగారు పడతాడని ఆమె అతనికి చెప్పలేదు. కానీ అర్ధరాత్రి అయ్యేసరికి ఆమెకు నొప్పి విపరీతమైపోయింది. దానికి తోడు కొంచెం బ్లీడింగ్ కూడా కనిపించేసరికి ఆమెకు రవీంద్రను లేపక తప్పలేదు.

"నాకు కడుపులో నొప్పిగా వుంది. కొంచెం బ్లీడింగ్ కూడా వుంది"

"సాయంత్రమే వుంది కదూ!"

మెల్లగా తల ఊపింది.

"మరెందుకు అబద్ధం చెప్పావు. ఇప్పుడెంత బాధపడుతున్నావో చూడు."

అతను స్టెత్ తీసుకుని ఆమెను పరీక్షించాడు. బి.పి. చూశాడు. గైనికాలజిస్ట్ కానందువల్ల అతని వద్ద పెరిస్కోపు వుండదు. ఆమె గర్భంమీద చెవిపెట్టి విన్నాడు. వెంటనే ఆసుపత్రికి ఫోను చేశాడు. ఆనందరావుకి ఫోనులోనే సూచనలు ఇచ్చాడు. అతన్ని ఫోనుచేసి గైనికాలజిస్టుని ఆసుపత్రికి రమ్మనమని చెప్పమని, విజయలక్ష్మికి కూడా కబురు పంపమని చెప్పాడు. వసుధను కారులో పడుకోపెట్టుకుని ఆసుపత్రికి తీసుకువెళ్ళాడు. దారి పొడవునా ప్రశ్నలు వేస్తూనే వున్నాడు.

"బాగుందా వసుధా! బాగా నొప్పిగా వుందా? ఫర్వాలేదా?" అంటూ ప్రతి అయిదు నిముషాలకూ అడుగుతూనే వున్నాడు.

వాళ్ళు ఆసుపత్రికి చేరిన పావుగంటకి గైనకాలజిస్టు కూడా వచ్చింది. ఆమెతోపాటు రవీంద్ర కూడా థియేటర్‌లోకి వచ్చాడు.

"డాక్టర్! నా నర్సు ఇంకా రాలేదు. నేను మీకు 'ఎసిస్ట్' చేస్తాను" అన్నాడు.

"అలాగే తప్పకుండా" అంది ఆవిడ.

అంత బాధలోనూ వసుధకు చాలా సిగ్గనిపించింది. నా శృంగారానికీ, మాతృత్వానికీ కూడా ఈ పురుషుడే ప్రత్యక్షసాక్షి అనుకుంది నిర్వేదంగా.

అయితే ఆ మాతృత్వం ఆమెకు దక్కలేదు. గైనికాలజిస్టు ఎంత ప్రయత్నించినప్పటికీ బిడ్డ కడుపులోనే మరణించింది.

★ ★ ★

మరురోజు మధ్యాహ్నానికి వసుధకు స్పృహ వచ్చింది. ఆశగా పక్క తడుముకుంది. చేతికి ఏమీ తగలలేదు. పక్కకు తిరిగి ఉయ్యాలవంటిదేదైనా వుందా? అని చూసుకుంది. ఎక్కడా ఏమీలేదు. అంత పెద్ద గదిలోనూ ఆమె మంచం ఒక్కటే వుంది. కాకతాళీయమో లేక రవీంద్ర కావాలని చేశాడో తెలీదు కాని అది కృష్ణమోహన్ వాడిన గది. ఆ కిటికీకి గాజుపలక కూడా ఇంకా వేయించలేదు. ఆ రాత్రి తరువాత, తను ఈ ఆసుపత్రివైపు కన్నెత్తి చూడలేదు. తన జీవితంలో భవానమ్మగారి కారు షెడ్ తోసహా ఏ మజిలీని తాను రెండవసారి సందర్శించలేదు. ఒక్క హాస్పిటల్‌ని తప్ప.

కొంతసేపటికి విజయలక్ష్మి గదిలోకి వచ్చింది. రోగులపాలిట నైటింగేల్. తనకు నర్సింగ్‌లో గురువు. సహోద్యోగి. సన్నిహితురాలు. వసుధ పలకరింపుగా నవ్వింది. ఆమె తానెరిగిన విజయలక్ష్మి కాదు. ఆ ముఖంలో నవ్వు లేదు. పలకరింపు లేదు. తెలిసిన మనిషిని చూసినట్టు గుర్తింపూ లేదు. ముఖం రాయిలా, భావరహితంగా పెట్టి "డాక్టరుగారికి చెప్పి వస్తాను" అని వెళ్ళిపోయింది.

'నాకు మగబిడ్డ కలిగేడా? ఆడబిడ్డ కలిగిందా? నా బిడ్డ ఏదీ?' అని ఎన్నో ప్రశ్నలు వేయాలనుకుంది వసుధ. అవేమీ వినిపించుకోకుండానే విజయలక్ష్మి వెళ్ళిపో




యింది. కొంతసేపటికి రవీంద్ర వచ్చాడు.

"రవీంద్రా... రవీంద్రా" అతని రెండు చేతులూ పట్టుకుని అడిగింది.

"నా బిడ్డ... నా బిడ్డ ఎక్కడ?"

"నెలలు నిండలేదుగా వసుధా! స్టిల్ బోర్న్ బేబీ"

వసుధ కళ్ళవెంట నీళ్ళు జలజలా రాలాయి. ఈరోజుకోసం ఎంతో ఎదురుచూసింది. కృష్ణవంటి బిడ్డ పుడతాడని ఆశించింది. జీవితంలో కొత్తఆశలు చిగురిస్తాయని ఎదురుచూసింది. ఈ గదిలోనే తన ఆశలు విరిశాయి. ఇక్కడే వాడిపోయాయి. ఆరోజు అతని స్మృతిని మూటకట్టుకుంటున్నానని భ్రమపడింది. అతనిలానే అతని గుర్తూ తనను దగాచేసింది. అతను ఎప్పటికయినా వస్తాడనీ, ఈ బిడ్డను చూపించాలనీ అనుకుంది. అతని కళ్ళల్లో విస్మయమా? ఆనందమా? తప్పుచేసిన భావనా? ఏది కనపడుతుంది? అని ఊహాగానాలు చేసింది. ఏదీలేదు. అంతా కల. ఒట్టి స్వప్నం. ఆ కృష్ణమోహన్... అతని ప్రేమ... ఆ మధురస్మృతి... ఈ బిడ్డా... అంతా కల.

"ఏడవద్దు వసుధా! నీకు కొంచెం టెంపరేచర్ వుంది. అది ఎక్కువవుతుంది ప్లీజ్"

అతని మాటలు లక్ష్యపెట్టకుండా ఏడుస్తూనే వుంది.

"ఆల్ రైట్! నా మాటలకు విలువ లేకుండా నేనెందుకిక్కడ?" అని అతను వెళ్ళిపోయాడు.

సాయంత్రం రవీంద్ర ఊహించినట్టుగానే వసుధకు టెంపరేచర్ పెరిగిపోయింది. ఆడపేషంటు. విజయలక్ష్మికి స్నేహితురాలు. అందులోనూ పురుటికేసు. విజయలక్ష్మి చూసుకుంటుందిలే అని ఆనందరావు వసుధ గదిలోకి రాలేదు. మధ్యాహ్నం మందులు వేసినవాళ్ళు ఎవరూలేరు. ఆమెకు కాఫీ ఇచ్చినవాళ్ళు లేరు. సాయంత్రం రవీంద్ర వస్తూనే ఆమె గదిలోకి వెళ్ళిచూశాడు. టెంపరేచరు నూటనాలుగు డిగ్రీలు దాటిపోయి, వసుధ పలవరిస్తోంది. అతనికి విజయలక్ష్మిమీద విపరీతమయిన కోపం వచ్చింది. ఆ క్షణాన 'డిస్మిస్' చేసిపారేద్దామా? అనుకున్నాడు. గబగబా ఐస్‌వాటర్ పెట్టి ఆమె ఒళ్ళంతా తుడిచి, పారాసెట్‌మాల్ ఇంజెక్షను చేసి మంచందగ్గరే కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

అతను ఆ పనులు చేస్తున్నంతసేపూ ఆనందరావు అక్కడే వుండి అతనికి సాయపడ్డాడు.

"క్షమించడయ్యా! విజయలక్ష్మిగారు చూసుకుంటుందనుకున్నాను. నేను చూస్తాను. మీరు రౌండ్స్‌కి వెళ్ళిరండి" అని బతిమాలాడు.

"వద్దు ఆనంద్. ఫర్వాలేదు. నేనిక్కడే వుంటాను. టెంపరేచరు కొంచెం తగ్గనీ. ఇంటికి తీసుకెళ్ళిపోతాను" అన్నాడు రవీంద్ర.

విజయలక్ష్మి అయిదుగంటలకు ఆసుపత్రికి వచ్చేటప్పటికి రవీంద్ర వసుధను ఎటెండ్ అవుతున్నాడని తెలిసింది. తను చేసిన తప్పు కూడా ఆమెకు తెలిసింది. కాసేపటికి అతను ఆనందరావు సహాయంతో వసుధను బయటకు తెచ్చాడు. వసుధ తోటకూరకాడలా వడలిపోయి, వాలిపోతూ వుంది. విజయలక్ష్మి చటుక్కున సాయం రాబోయింది. 'ప్లీజ్' అని గద్దించి రవీంద్ర ఆమె చేతిని తోసేశాడు. వసుధను కారు వెనకసీటులో పడుకోబెట్టారు. రవీంద్ర డ్రైవింగ్‌సీట్లో కూర్చుని ఆనందరావును కేకేశాడు.

"ఆనంద్! నేను ఒక వారంరోజులు ఆసుపత్రికి రాను"

"ఆసుపత్రి..." అని గొణిగింది విజయలక్ష్మి.

"మూసెయ్యండి" అని అరిచి కారును ముందుకు దూకించాడు.

★ ★ ★



వసుధ డెలివరీకి అటెండ్ అయిన గైనకాలజిస్ట్ ఇంటికి వచ్చి వసుధను చూసింది. వారంరోజులు ఆసుపత్రి ముఖం చూడకుండా రవీంద్ర ఆమెకు సేవలు చేశాడు. ముఖం కడిగీ, తలదువ్వీ, స్పాంజ్ బాత్ చేయించీ, దుస్తులు మార్పించీ డాక్టర్‌లా కాక నర్సులా సేవచేశాడు. మగవాడిలా కాక ఆడదానిలా సేవచేశాడు. ఆమెను ప్రేమించినవాడిలాకాక, తల్లిలా చేశాడు.

వసుధకు జ్వరం తగ్గి, కొంచెం భోజనం చేసిన రోజున, రవీంద్ర ఇంట్లో లేని సమయంచూసి విజయలక్ష్మి వచ్చింది. తాను ఆసుపత్రిలో వుండగా విజయలక్ష్మి ప్రవర్తన గుర్తుకొచ్చింది వసుధకు. ఆమె తప్పులేదు. అవివాహిత తల్లులపట్ల సంఘానికి ఎప్పుడూ సానుభూతిలేదు. విజయలక్ష్మి అటువంటి సంఘానికి ప్రతినిధి అనుకుంది వసుధ. అందువల్ల ఆమె విజయలక్ష్మిని ఆదరంగానే ఆహ్వానించింది.

"సారీ వసుధా! నేనేదో ఇంటి గొడవల్లో ఉండి, నిన్ను ఆరోజు అటెండ్ కాలేకపోయాను" అంది విజయలక్ష్మి.

అది అబద్ధమని వసుధకు తెలుసు. తాను నమ్మినట్టే నటించింది. "ఫర్వాలేదులే విజయలక్ష్మీ. నేనేమీ అనుకోలేదు"

"డాక్టరుగారు నామీద కోపంగా వున్నారు. నన్ను ఉద్యోగంలోనుండి తీసేస్తారేమో"

"ఛ! అదేం అయ్యుండదు"

"ఏమయినా నువ్వు ఒకమాట చెపుదూ"

'ఓహో! ఇందుకొచ్చిందన్నమాట' అనుకుంది వసుధ. విజయలక్ష్మిపట్ల ఇన్నాళ్ళూ పెంచుకున్న స్నేహభావం ఒక్క క్షణంలో పటాపంచలయింది.

"అలాగే... నేను పడుకుంటాను" అంది ఆమె అక్కడ వుండగానే మంచంమీదకు ఒరిగి.

కానీ ఈపూట విజయలక్ష్మి అంత త్వరగా వదిలేలా లేదు. వసుధను ప్రసన్నం చేసుకుని ఉద్యోగం కాపాడుకోవాలనే కృతనిశ్చయంతో వుంది. అందుకని వసుధ విసుగును లక్ష్యపెట్టకుండా కబుర్లు మొదలుపెట్టింది.

"వసుధా! నీకు తెలుసా? మన ఆసుపత్రిలో అప్పుడు వుండలేదూ... డాక్టరుగారి స్నేహితుడు కృష్ణమోహన్... అతను కమ్యూనిస్టంట. నీకు తెలుసా? "

కృష్ణ పేరు వినగానే వసుధ మత్తు దిగిపోయింది.

"అదేంటి విజయలక్ష్మీ! నువ్వేగా నాకు చెప్పావు. మనమంటే సానుభూతి వుందనీ"

"అవునూ... ఏదో మంచివాడు మనమంటే జాలిపడుతున్నాడు అనుకున్నా. మన భాస్కరంలేడూ... అదే కమ్యూనిస్టు భాస్కరం... అతనిలా అనుకున్నాను. తీవ్రవాది అనుకోలేదు"

విజయలక్ష్మి అడ్డంగా కోతలు కోస్తోందని వసుధకు అర్థమయింది. ఆరోజు కృష్ణ ఆసుపత్రిలో చేర్చబడ్డరోజు ఈ విజయలక్ష్మి పోలీసుకేసనుకుంటా... చచ్చేలా వున్నాడు. ఒళ్ళంతా తుపాకీ గాయాలు అని చెప్పింది. ఇప్పుడు తీవ్రవాది అనుకోలేదు అంటుంది. ఏమిటో మనుష్యుల మనస్తత్వాలు.

"అతన్ని వాళ్ళ మనుష్యులొచ్చి తప్పించుకు తీసుకుపోయారు. గాజు కిటికీలు పగలకొట్టి ఆసుపత్రిలోకి వచ్చి ఇతన్ని ఎత్తుకుపోయారు"

"ఎవరు చెప్పారు నీకు"

"ఎవరు చెప్పటమేంటీ? పేపర్లో వేశారు. మన డాక్టరుగారిని కూడా పోలీసులు పట్టుకెళ్ళారప్పుడు. నీకు తెలియదా? " విజయలక్ష్మి ఆశ్చర్యపోయింది.

"నాకు ఇటువంటి విషయాలలో ఆసక్తి లేదు విజయలక్ష్మీ. సరే, నేను పడుకుంటాను. డాక్టరుగారు వస్తే నీ విషయం చెపుతాను. అసలు ఆయన అటువంటి పని చెయ్యరనుకో" అని భరోసా ఇచ్చింది.

విజయలక్ష్మి ప్రశాంతంగా వున్న చెరువులో రెండుదోసిళ్ళతోనూ ఎత్తి ఇన్ని గుల-




కరాళ్ళు పోసింది. వసుధకు ఇంకెలా నిద్రపడుతుంది. పేపరులో కృష్ణ పరారీ వార్త వచ్చిందని విన్నాక, ఆమె గుండె పగిలినట్టయ్యింది. అతను అండర్‌లైన్ చేసుకున్న ఒక్కొక్క వార్తా గుర్తుకొచ్చింది. 'కృష్ణని కూడా రవీంద్ర భయపడ్డట్టే ఎన్‌కౌంటర్ చేసి పారేశారా? డాక్టర్‌గారిని తీసుకెళ్ళి వాళ్ళ పద్ధతిలో 'ఇంటరాగేషన్' చేశారా? ఈయన నోరువిప్పి వుండరు. అంతవరకూ ఖచ్చితం. ఏమయినా ఆయన వస్తే అడగాలి' అనుకుంటూ వసుధ మధ్యాహ్నం మెలకువగానేవుంది.

రవీంద్ర క్లినిక్‌నుండి వచ్చి "సత్యం! భోజనం పెట్టు. వసుధ ఏదీ? " అనడిగితే,

"సత్యం లేదు" అంటూ వసుధ ప్రత్యక్షం అయింది.

"అదే నీతో వచ్చిన చిక్కు. ఒంట్లో బాగో లేనిదానివి ఒకచోట పడుకోకూడదూ. బొంగరంలా ఇల్లంతా తిరక్కపోతే!" అని ప్రేమగా విసుక్కున్నాడు.

వసుధ అతనికి భోజనం వడ్డించి, ఎదురుగా కూర్చుని అడిగింది, "అప్పుడు కృష్ణ పారిపోయిన వార్త పేపర్లో వచ్చిందా? "

అతను భోజనం చేయడం ఆపి ఆమె ముఖంలోకి పరీక్షగా చూస్తూ, "ఎవరు చెప్పారు? " అనడిగాడు.

"ఎవరో ఒకరు"

"అవును... వచ్చింది. వాళ్ళేమయినా నిశ్శబ్దంగా వచ్చారా? నీకు... నిద్రలో తెలియలేదు గానీ, బయట పోలీసువాడి బుర్ర బద్దలుకొట్టి, మన కాంపౌండ్‌లోకి దూకి, మన కిటికీ తలుపులు పగలకొట్టి లోపలకు వచ్చారు. పోలీసులు వెంటపడ్డారు. మరి పేపర్లో రాదూ!"

ఆమె ప్రాణం ఉగ్గబట్టుకుని అడిగింది. "వాళ్ళని కాల్చేసారా? "

అతను రిలాక్స్‌డ్‌గా చూశాడు. "లేదు... తప్పించుకున్నారు"

"మరి పోలీసులు మిమ్మల్ని ఎందుకు తీసుకువెళ్ళారు? "

"ఇంట్లో కూర్చుని చాలా విషయసేకరణ చేసినట్టున్నావే. ఎంత సిల్లీ ప్రశ్న వసుధా! నా హాస్పిటల్‌లో ఇంత సెన్సేషనల్ సంఘటన జరిగితే నన్ను తీసుకెళ్ళరా? నేను వాంజ్మూలం ఇవ్వనక్కరలేదా? నీకు ఖాళీ ఎక్కువై వెర్రివెర్రి ఆలోచనలు వస్తున్నాయి. ముందు నీ క్లాసు పుస్తకాలు బయటకు తీసి దులుపు. ఇవాల్టినుండీ చదవటం మొదలు పెట్టు. కాలేజీకి వెళ్ళు. సప్లిమెంటరీ రాసి ఆ సెకండ్ ఇయర్ పూర్తిచెయ్యి"

అతను భోజనం ముగించి పడుకోవటానికి వెళ్ళిపోయాడు. వసుధకు భోజనం రుచించలేదు. అవిశ్రాంతంగా అటూ ఇటూ తిరిగింది. వెనకవున్న స్టోర్ రూములోకి వెళ్ళి పాత పేపర్లు తీసింది. తేదీలు లెక్కపెట్టుకుని కృష్ణ వెళ్ళిపోయిన నాటినుండి పది పదిహేను రోజులపాటు వచ్చిన పేపర్లు వెదికింది. ఇవి అంతగా ప్రాధాన్యతలేని పేపర్లు కావటంవల్ల, జాగ్రత్తగా వెదకవలసి వచ్చింది. అతను వెళ్ళిన మూడవరోజు పేపర్లో నర్సింగ్‌హోం కిటికీ పగలకొట్టి ఒక తీవ్రవాది ఒక పేషంటును తీసుకువెళ్ళిపోయాడని రాశారు. తర్వాత వారం పేపర్లో గణపతి, సాహిర్ అనే తీవ్రవాదుల్ని పోలీసులు 'ఎన్‌కౌంటర్'లో కాల్చి చంపేశారని వుంది. తర్వాత అయిదవ రోజు పేపరులో ఝాన్సీ, వెంకట్ అనబడే తీవ్రవాదుల్ని ఎన్‌కౌంటర్ చేశారని వుంది. ఆ చావు వార్తలన్నీ ఒకదాని తర్వాత ఒకటి చదివి వసుధ, 'అమ్మయ్య! కృష్ణ పేరు లేదు' అనుకుంది.

కృష్ణ అసలు పేరు సాహిర్ అని ఆమెకు తెలియదు.

★ ★ ★

తర్వాత కొద్దిరోజులకే రాధ పెళ్ళి జరిగింది. పెళ్ళికి వధూవరులిద్దరికీ బట్టలు చదివించాడు రవీంద్ర.

"నేను పెళ్ళికి రాను. నాకు ఆ ఇల్లు చూస్తే భయం" అది వసుధ.

"ఎన్నాళ్ళు ప్రపంచంనుండి దాక్కుంటావు

వసుధా! ఏ పనయినా చేసే వరకే భయం. ఒకసారి చేసి చూడు, ఏ భయమూ వుండదు" అన్నాడు రవీంద్ర.

అతను వెళ్ళిపోతోంటే తదేకంగా చూసింది వసుధ. ఇప్పటివరకూ తారసపడ్డ వ్యక్తులందరూ తనకు ఏదో ఒక సందేశం ఇస్తూనే వచ్చారు. తమ మాటలద్వారా, చేతలద్వారా, అందరివల్లా తను ఉపయోగం పొందింది. చంద్రమ్మత్త 'పని బాగా చేసుకో పిల్లా! నీ పొట్ట గడిచిపోతుంది' అని చెప్పింది. నిర్మలక్క శరీర శుభ్రత నేర్పింది. తనకంటే నాలుగయిదేళ్ళు మాత్రమే పెద్దవాడయిన నళిని విద్యాభ్యాసం చేయించాడు.

మోహన్ అన్నయ్య "ఈ శరీరం నీది. ఎవర్నీ తాకనివ్వద్దు" అన్నాడు. అంతేకాదు ఆయనవల్లనే తనకు ప్రేమంటే ఏమిటో తెలిసింది. నిర్మలక్క మీద ప్రేమను ఆయన తన మీదకు డైవర్ట్ చేసుకున్నాడు. ఏ రక్తసంబంధమూలేని తనకి తండ్రిగా ఈ ప్రపంచానికి పరిచయమయ్యాడు. డబ్బు పంపి చదివించాడు. చదువుకుని ఉద్యోగం చెయ్యి తల్లీ, ముసలివాడినయ్యాక నీ దగ్గరకు వచ్చి వుంటాను అని చెప్పాడు. తను ఏదీ పాటించలేదు. ప్రేమ పేరుతో సమస్యల్ని సృష్టించుకుంది. చదువు మానేసి, డాక్టరుగారిమీద 'పేరసైట్'లా బతుకుతోంది.

కృష్ణకు కూడా తను నమ్మిన ఆదర్శం వుంది. దానిముందు తన వ్యక్తిగత ప్రేమ అతనికి గడ్డిపోచతో సమానం. ఎవరో రాసినట్టు 'స్త్రీ తను ప్రేమించిన వాడికోసం సర్వం అర్పిస్తుంది. పురుషుడు తను నమ్మిన సిద్ధాంతం కోసం సర్వమూ ధారపోస్తాడు. త్యాగధనులెప్పుడూ పురుషులే'. అటువంటి పుణ్యపురుషుడతను. చలమూ, నర్తకీ ఇంత మంది ప్రేమమూర్తుల్ని చదివి కూడా తాను ఏమీ నేర్చుకోలేకపోయింది. రవీంద్ర మాత్రం! తను ప్రేమించిన స్త్రీ తన స్నేహితుడి బిడ్డకు తల్లయి, పారిపోతే ఆమెను వెతుక్కుంటూ రాష్ట్రం కాని రాష్ట్రానికి వచ్చాడు. తనను వెనక్కు తీసుకువచ్చి తనకి సేవలు చేస్తున్నాడు. తనవల్ల లోకంలో నిందలపాలవుతున్నాడు. అయినవారికి దూరమయ్యాడు. తాను? తను ఎవ్వరికీ ఏమీ చెయ్యకుండా, చచ్చిపోదామా, పారిపోదామా? అని ఆలోచిస్తోంది. ప్రతిఫలం ఆశించక ప్రేమించటం ఆయన స్వభావం అయినంత మాత్రాన, ప్రతిఫలం ఇవ్వకుండా ఆయన ప్రేమను పొందటానికి తనకేం హక్కువుంది? అర్హత వుంది?

'ప్రేమంటే ఏమిటి 'షా' రాసినట్టు కేరింగ్ ఫర్ ఈచ్ అదర్స్ ఫీలింగ్స్. అయితే ఆయన నన్ను ఇంతగా ప్రేమించి, ఆరాధిస్తోంటే నేను ఆయన్ని ప్రేమించటానికి ప్రయత్నం అయినా చెయ్యలేనా? అనుకుంది వసుధ. ఆయన చెప్పినట్టు మళ్ళీ చదువుకుంటాను. మోహన్ అన్నయ్య చెప్పినట్టు ఉద్యోగం చేస్తాను. సిస్టర్ మోడెస్టీనా చెప్పినట్టు జీవితం ఎవరికో సమూ కాదు, జీవించటానికి. నేను జీవించి, నన్ను ప్రేమించిన వాళ్ళను జీవింపచెయ్యటానికి' అనుకుంది.

ఆ ఉత్సాహంలో సత్యాన్ని పిలిచి, "నా పుస్తకాలు ఎక్కడున్నాయో తెలుసా సత్యం" అని అడిగింది.

"ఓ తెలుసండీ! అయ్యగారి బీరువాలో" అన్నాడతను.

"పద. చూపించు"

బీరువా తెరిచి చూస్తే తన పుస్తకాలన్నీ నీటుగా సర్దివున్నాయి. ఆ షైలరలో రవీంద్ర మెడికల్ జర్నల్స్, ఒకటి రెండు కృష్ణ పుస్తకాలు. అందులో ఒకటి కృష్ణ చేతిలో ఎప్పుడూ నలుగుతూ వుండే బైండ్ వాల్యూం. ఎంతో అభిమానంగా ఆ పుస్తకాన్ని చేతుల్లోకి తీసుకుంది. దానిలో నుండి జలజలా రాలిపడ్డాయి ఫొటోలు. ఒకటి, రెండూ కాదు. ఏడెనిమిది. కృష్ణ అన్ని ఏంగిల్స్‌లోనూ చచ్చిపోయి పడివున్నాడు. పక్కనే తుపాకీ పెట్టి వుంది. అవి కృష్ణ ఫొటోలు కాదు. కృష్ణ శవం యొక్క ఫొటోలు. పోలీసు షైల్




ఫొటోలు. తాను ఎలా స్పృహ కోల్పోయిందో వసుధకు గుర్తురాలేదు.

★ ★ ★

వసుధ కళ్ళు తెరిచేసరికి,

ఎదురుగా రవీంద్ర. "ఎలా వుంది వసుధా? "

'ఈ మనిషిని బ్రహ్మ ఏ పదార్థంతో తయారుచేసి వుంటాడు? ఇతను భవానమ్మగారి ఇంట్లో తనను చూసిన క్షణం అతని పాలిట ఎంత చెడ్డది? తన ప్రతి కష్టంలోనూ ఇతని చేయూత వుండవలసిందేనా? ' అతను దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

"సారీ వసుధా! నేను వాడిని గురించిన నిజం నీ దగ్గర దాచాను. వాడు ఈ ప్రపంచంలో లేడని తెలిసి, నువ్వు జీవితంలో రాజీపడే ప్రయత్నంలో నన్ను పెళ్ళిచేసుకుంటావేమో అనుకున్నాను. అది నాకు ఇష్టంలేకపోయింది. దానికంటే నన్ను ఎక్కువ భయపెట్టింది నీ పలాయన వాదం. వాడు లేని ఈ ప్రపంచంమీద నీకు ఆసక్తి పోతుందేమో అని వణికిపోయాను. వాడు, నువ్వు బతకటానికి గల ఆధారమయితే, ఆ ఒక్క ఆధారాన్ని లాక్కోవటానికి నేను సాహసించలేకపోయాను. వాడు లేకపోయినా, వాడి ప్రతిరూపం ద్వారా ఈ ప్రపంచంలోకి వస్తుందని ఆశించాను. ఆ బిడ్డ ఆధారంతో నువ్వు జీవించాలని నిర్ణయించుకుంటావు అని ఎదురు చూశాను. కానీ నీకు బిడ్డ కూడా దక్కకపోయాక కృష్ణ గురించి నిజం నీకెప్పటికీ చెప్పకూడదనే అనుకున్నాను. వాడు బతికి వున్నాడనే ఆశ ఒక్కటే నీ జీవితాధారం అని నమ్మాను. వసుధా! నువ్వు కృష్ణను ఎంతో గాఢంగా ప్రేమించి వుండవచ్చు అయితే, నీ ప్రేమను అందుకునేందుకు వాడు జీవించిలేడు. అది వాడి దురదృష్టం!"

వసుధ సమాధానం ఇవ్వలేదు. కన్నీరు కూడా కార్చలేదు. అలా నిర్వికారంగా కూర్చొని వుంది. చాలాసేపటికి రవీంద్రే నోరు విప్పాడు. "మళ్ళీ తిరువణ్ణమలై పారిపోతావా వసుధా? "

ఎంతో దీనంగా ధ్వనించిన అతని కంఠస్వరం విని ఆమె ఈ లోకంలోకి వచ్చింది.

చాలా తాపీగా తల అడ్డంగా వూపింది. "ఊహు! వెళ్ళను రవీంద్రా! ఈసారి నేను జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొంటాను. అదంతా భవిష్యత్తు. వర్తమానం ఏమిటంటే ఇన్నాళ్ళూ మీ నుండి నేను ఎంతో పుచ్చుకున్నాను. ఎన్నడూ ఏమీ ఇవ్వలేదు. ఇప్పుడు నన్ను మీకిచ్చుకుంటున్నాను. ఈనాడు నాకు ఏ సమస్యలూ లేవు. సమస్యలతో మిమ్మల్ని చుట్టుకోవటం లేదు. అది ఆనందించదగిన విషయమే అయినా, నా మనసూ, శరీరమూ కూడా ఆఘాతాలు. అందువల్ల మీరు నన్ను దాసిగా ఉపయోగించుకున్నా నా కిష్టమే! ఈ ఇల్లు వదలను ప్రాణం వున్నంతవరకూ!"

రవీంద్ర ముందు కొంచెం సందేహించాడు. ఈ మంచుగోడ కరిగేవరకూ ఎదురుచూడటంలో అర్థంలేదనిపించింది. ఛేదించటమే మార్గం! ఆ ఆలోచన వచ్చాక చేతులు చాచి, ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. తర్వాత ఆ చేతులను ఆమె చుట్టూ పోనిచ్చి తలను గుండెకు అదుముకున్నాడు. వంగి చుబుకంతో ఆమె జుట్టును చెవుల వెనక్కు తోసి ఆ చెవిలో గుసగుసగా.

"వసుధా! మూడు సంవత్సరాలు అందీ అందక, ఆశ నిరాశల మధ్య నన్ను ఎంతగానో ఏడ్పించావు. దీనికి శిక్షగా నిన్ను దాసిగా మాత్రమే కాదు. మంత్రిగానూ. వంటమనిషిగానూ, భార్యగానూ, నా పిల్లలకు తల్లిగానూ, మర్చిపోయాను నా నర్సింగ్‌హోంలో నర్సుగానూ, ఎన్నివిధాల వీలయితే అన్ని విధాలా వాడుకుంటాను. జాగ్రత్త!" అన్నాడు.

నాకు అంగీకారమే సుమా! అన్నట్టు కళ్ళు మూసుకుంది వసుధ ఆ గుండెల్లోని భద్రతను మనఃస్ఫూర్తిగా ఆస్వాదిస్తూ! ☆

# చతుర కతలు

## మూడు ఖూనీలు ఆరు లూటీలు

"అక్కా! ఈసారైనా నేను పోటీచేయడానికి బావగారిచేత టిక్కెట్టిప్పించకపోతే ఊరుకునే దిలేదు. కిందటిసారంటే నాకు పాతికేళ్ళు నిండలేదు కనుక పోటీచేసే అవకాశం లేకపోయింది కాని, ఈసారి నాకు బావగారు టిక్కెట్టిప్పించకపోతే సహించేది లేదు" అన్నాడు

ఇంతలో రాజకీయనాయకుడు రానే వచ్చాడు.

రాత్రి భోజనాలయేక శయనమందిరంలో రాజకీయనాయకుని భార్య అంది.

"ఏవండీ! ఈసారి రాబోయే ఎన్నికల్లో పోటీచెయ్యడానికి టిక్కెట్టిప్పించకపోతే ఊరుకునేది లేదని మా తమ్ముడు హెచ్చరించాడండీ! కిందటిసారంటే పాతికేళ్ళు నిండలేదని టిక్కెట్టివ్వలేకపోయారు కాని, ఈసారి వాడికి




రాజకీయనాయకుని బావమరిది.

"అలాగేలేరా! బావగారికి చెబుతానుగా!" అంది అక్క.

"అలా ఇలా చెప్పడం కాదు. చాలా స్ట్రాంగ్‌గా చెప్పాలి. నేనీలోగా పత్రికా విలేఖరుల గోష్ఠి జరిపి, నేనే అభ్యర్థినని ప్రకటించేస్తాను" హెచ్చరించాడు బావమరిది.

"అలాగే! బావగారు రాగానే చెప్తాన్రా" అంది అక్క.

పాతికేళ్ళు నిండేయి కనుక మీరు వాడికెలాగైనా టిక్కెట్టిప్పించకపోతే వీల్లేదు" డొక్కచించేస్తాను అన్నట్లు మాట్లాడింది రాజకీయ నాయకుని భార్య.

"అలాగేలేవే తప్పకుండా ప్రయత్నిస్తా" అన్నాడు రాజకీయనాయకుడు.

ఈలోగా తనకు టిక్కెట్టు ఖరారయిపోయిందని ప్రచారం చేసేసుకుంటున్నాడు బావమరిది.

సినిమా పోస్టర్లంటించే అబ్బాయికి పోస్టర్లంటించమని బెత్తాయించాడు. వివిధ గృహ




యజమానుల అనుమతితో ఫలానా అభ్యర్థి పోటీ చేయబోతున్నాడని గోడలమీద రాయించేశాడు. అందరికంటే ముందుగా ప్రచారపు హోరు ఎత్తించేస్తున్నాడు.

అధిష్ఠానవర్గం సరైన అభ్యర్థులెవరో తెలుసుకుని రమ్మని ఒక పరిశీలకుల బృందాన్ని పంపించింది. ఆ కమిటీవారు రాజకీయనాయకుని బావమరిది పోటీ చేద్దామనుకున్న నియోజకవర్గానికి వచ్చారు. పోటీ చేద్దామనుకున్న అభ్యర్థుల్ని ఒక్కొక్కర్నే ఇంటర్వ్యూ చేశారు పరిశీలకులు.

రాజకీయనాయకుని బావమరిది ఓ యాభై లారీలు, వంద స్కూటర్లు, ట్రాక్టర్లు వెంటవేసుకుని మద్దతుదార్లతో వచ్చి తన విశ్వరూపం చూపించాడు! మిగతా అభ్యర్థులెవరూ ఇంత భారీ ప్రదర్శన ఏర్పాటుచేసుకోలేకపోయారు.

అతనికి టిక్కెట్టివ్వడం ఖాయం అనుకున్నారందరూ.

తానొకటి తలిస్తే అన్నట్టు బావమరిది ఒకటి తలిస్తే అధిష్ఠానవర్గం ఇంకోలా తలచింది. బావమరిదికి టిక్కెట్టు హుళక్కి అయింది.

రాజకీయనాయకుని శ్రీమతి భగ్గుమంది భర్తమీద! ధుమధుమలాడుతున్న ధూమకేతువయింది. లావా ప్రవహించే జ్వాలాముఖి అయింది.

రాజకీయ నాయకుడు శాంతంగా-దీనంగా, జాలిగా, తన నిస్సహాయతకు చింతిస్తూ అన్నాడు.

"చూడు శ్రీమతీ! మూడు ఖూనీలు- ఆరు లూటీలు అన్న మాట విన్నావు కదా? మీ తమ్ముడు కనీసం ఒక్క ఖూనీ అన్నా చేయలేదుకదా? అదే కనీసార్హతాయె! అందుకే అధిష్ఠానవర్గం మీ తమ్ముడికి టిక్కెట్టివ్వడానికి నిరాకరించింది. నన్నేం చేయమంటావు చెప్పూ!"

—బులుసు జి. ప్రకాష్

---

## బాధ్యత

ఓ కండెమ్డ్ క్రిమినల్ మీద హత్యాప్రయత్నం జరిగింది. రివాల్వరుతో పాయింట్ బ్లాంకులో కాల్చబడ్డాడతను. చావు బతుకుల్లో వున్న ఆ ముద్దాయిని పోలీసులు ఓ సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ కి తీసుకొచ్చారు, ఎమర్జెన్సీ ట్రీట్ మెంట్ కోసమని. యాభై ఏళ్లుంటాయి అతనికి. ప్రభుత్వ ఆసుపత్రిలో తగిన సదుపాయాలు లేవని ప్రయివేట్ హాస్పిటల్ కి తీసుకురాబడ్డాడు.

"ప్లీజ్, డాక్టర్! ఇతన్ని ఎలాగైనా బతికించాలి మీరు. ఎంత ఖర్చయినా ఫరవాలేదు" అంటూ ప్లీజ్ చేస్తూన్న జైలర్ వంక విస్మయంగానూ, వింతగానూ చూశారు డాక్టర్స్. "మాకు చేతనయిన కృషి చేస్తున్నాం. ఆపైన ఇతగాడి అదృష్టమూ, ఆయుష్షూనూ" అని జవాబిచ్చారు.

ఎమర్జెన్సీ ఆపరేషన్ చేసి బుల్లెట్ తీసేశారు. ఇంటెన్సివ్ కేర్ యూనిట్ లో వుంచి స్పెషలైజ్డ్ ట్రీట్ మెంట్ ఇచ్చారు. అతను బతికి బయటపడగానే మరో వారం రోజులు స్పెషల్ వార్డ్ లో వుంచి ప్రత్యేకంగా చూసుకున్నారు. దాంతో మనిషి బాగా ఆరోగ్యంగా తయారయ్యాడు.

సాధారణంగా కస్టడీలో వున్న ముద్దాయిల గురించి పెద్దగా పట్టించుకోదు ప్రభుత్వం. వాళ్ళు చస్తూ వున్నా ఆ జైలు డాక్టర్లూ, ఆ రంగునీళ్లూ, ఆ కల్తీ మందులే తప్ప మరో దిక్కుండదు. హ్యూమన్ రైట్స్ ప్రభుత్వం నెత్తిమీద మొట్టినా అతీగతీ వుండదు.

అటువంటిది ఓ ఖైదీని అందునా కండెమ్డ్ క్రిమినల్ ని బతికించడంకోసం అంతగా తహతహలాడుతూ, ఖర్చులకు సయితం వెరవకుండా, రూల్సు నతిక్రమించి ప్రత్యేక వైద్య సదుపాయాన్ని కలిగించడమూ... అతనికి నయమయేంతవరకూ స్వంత మనుషులకంటే ఎక్కువగా ఆత్రుత, ఆందోళనా చూప




డమూ... చాలా అసాధారణంగా అనిపించింది డాక్టర్లకి. తాము కలగంటున్నామా లేక పోలీసులలో నిజంగానే మార్పు వచ్చిందా అన్న సందేహం కూడా కలిగింది.

ముద్దాయిని డిశ్చార్జ్ చేస్తూ అదేమాట అన్నారు వాళ్లు. "ముద్దాయిలను జీవంలేని మట్టిసుద్దల్లా ట్రీట్ చేసే మనదేశంలో, ఓ నేరస్థుడిపట్ల ఇంత శ్రద్ధ, కన్సర్న్ చూపిస్తున్న మీ సహృదయాన్నీ, మానవతా దృక్పథాన్నీ మనసారా అభినందించకుండా వుండలేకపోతున్నాం. మీలాంటి అధికారులు మరి కొందరుంటే మన వ్యవస్థే మారిపోతుంది. అయినా మీలో ఇంత మార్పు ఎలా వచ్చింది అని ప్రశంసిస్తూనే ఆశ్చర్యంగా అడిగారు డాక్టర్లు. కాస్త ఇబ్బందిగా కదిలి, తరువాత ఓ వెర్రి నవ్వు నవ్వి మెల్లగా అన్నాడు జైలర్. "సారీ! ఇది నా బాధ్యత. ఇతను మల్టిపుల్ మర్డర్ కేసులో మరణశిక్ష పడిన ఖైదీ. వచ్చే వారమే ఇతని ఉరిశిక్ష అమలుపరచవలసి వుంది. ఉరి తీసేలోగా చావకుండా చూడటం మా బాధ్యత! అందుకే ఈ పాట్లన్నీ!"

"ఆc...!? " అంటూ నోళ్ళు వెళ్ళబెట్టారు డాక్టర్స్.

–పి.వి.వి.యస్

---

## ఎందుకు

అప్పలకొండ అపోజిషన్ పార్టీకి చెందిన ఓ ఛోటానాయకుడేకాక లేబర్ లీడర్ కూడాను. ఈమధ్య పార్టీ, ప్రజలూ తన వునికిని పట్టించుకోవడంలేదన్న అనుమానం కలిగింది అతనికి. వెంటనే ఏదో ఒకటి చేసి పత్రికలకు ఎక్కాలనుకున్నాడు.

అప్పలకొండ దృష్టి పోస్టల్ డిపార్ట్‌మెంటు మీద పడింది. ఆ డిపార్ట్‌మెంటు సిబ్బంది సమ్మెచేసి ఏడాదయిపోయింది. తరువాత సమ్మె ఓవర్ డ్యూ అనిపించి, యూనియన్ లీడర్స్‌ని పిలిపించి వెంటనే సమ్మెకు సన్నాహాలు చేయాలన్నాడు.

"ఈమధ్యనేగా ఏడాదిక్రితం నెల్లాళ్లు సమ్మె చేసి కోర్కెల్ని తీర్చుకున్నాం?" అన్నారు వాళ్ళు

"కోర్కెలకు కొదవేమిటి? సమ్మె అంటూ ఆరంభిస్తే డిమాండ్లు వాటంతటవే పుట్టుకొస్తాయి" అన్నాడు అప్పలకొండ.

ఎంప్లాయీస్ మీటింగు ఏర్పాటయింది. ప్రపంచంలోనే అతి పెద్ద నెట్ వర్క్‌ని అత్యంత సమర్ధవంతంగా నడుపుతూన్న ఆ డిపార్ట్‌మెంటు సిబ్బంది బాగోగులను ప్రభుత్వం పట్టించుకోవడంలేదనీ, వారిని ఎక్స్‌ప్లాయిట్ చేస్తోందనీ ఓ గంటసేపు అనర్గళంగా, ఆవేశంగా ప్రసంగించాడు అప్పలకొండ. కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

రెస్పాన్సుకి వుబ్బితబ్బిబ్బవుతూ, "ప్రభుత్వం కళ్ళు తెరిపించాలంటే మరో సమ్మె చేయవలసిందే మీరంతా!" అన్నాడు.

సభికులలోంచి తక్షణం "నో, నో...!" అన్న అరుపులు వినిపించడంతో వులిక్కిపడ్డాడతను.

లసొచ్చింది. ఆ పనయ్యేలోగా వచ్చిన గూని ఇంతవరకూ ఎవరికీ తగ్గలేదు. అందుకే సమ్మె అంటే భయపడుతున్నారంతా" అంటూ వివరించాడు యూనియన్ లీడరు.

అప్పలకొండ చూడడం కోసమని గూని వాళ్ళంతా లేచి నిలుచున్నారు. సభికులలో సగం మంది గూనివాళ్ళే!

"అయినా మన డిమాండ్సు అన్నీ ప్రభుత్వం వొప్పేసుకుందిగా? ఇప్పుడు మళ్ళీ ఏ కారణంతో సమ్మె చేస్తాం? " అని ప్రశ్నించారు వారిలో కొందరు.

అంతటితో తగ్గితే అప్పలకొండ రాజకీయనాయకుడెందు కవుతాడు?




ఒక ఉద్యోగి లేచి నిలుచుని, "మొన్న చేసిన సమ్మె పుణ్యమా అంటూ సగం మందికి పైగా గూని వాళ్లమయిపోయాం! మళ్ళీ స్ట్రయికంటే మావల్లకాదు" అన్నాడు ఖచ్చితంగా.

అప్పలకొండ తెల్లబోయి "సమ్మెచేసి ఏడాదైందిగా. అయినా సమ్మెకీ, గూనికీ సంబంధమేమిటీ? " అనడిగాడు.

"నెల్లాళ్లపాటు సాగిన సమ్మె కారణంగా డెలివరీ చేయవలసిన టపా అంతా గుట్టలు గుట్టలుగా పేరుకుంది. సమ్మె విరమణానంతరం ఆ టపా సంచుల్ని చచ్చినట్టు వీపులమీద మోసుకుని వీధివీధికీ తిరిగి బట్వాడా చేయవ

"ఇంతకంటే కారణం ఇంకా ఏంకావాలి? ఈ మన సోదరులకు గత సమ్మెమూలంగా వచ్చిన గూని ఆర్నెల్లయినా తగ్గలేదు. కనుక వారందరికీ ప్రభుత్వం కాంపెన్‌సేషన్ ఇవ్వాలని డిమాండ్ చేద్దాం!" అని అరిచాడు.

"ఔరా...? " అంటూ ఆశ్చర్యపోయారంతా.

ఆ ఆశ్చర్యంలో గూని వాళ్ళంతా నిటారుగా అయిపోయారు అద్భుతంగా!!

—తిరుమలశ్రీ



# ఏరినముత్యాలు

★ ఏదైనా ఒక నిర్దిష్ట లక్ష్యానికి ఉపయోగపడని అపార విజ్ఞానం తో నిండిన బుర్ర నిరుపయోగమే.

– ఒకసూక్తి

★ నిషేధించిన ప్రతి పుస్తకంలోనూ ప్రపంచానికి కావలసిన విజ్ఞానం ఏదో ఉందన్నమాట.

– ఎమర్సన్

★ పుస్తకాలు ఆత్మకు టానిక్కులవంటివి.

– స్వామీ వివేకానంద

★ వివేకులు కాలాన్ని విజ్ఞాన సముపార్జనకు, అవివేకులు దురలవాట్లకు, నిద్రకు ఉపయోగిస్తారు.

– సంస్కృత సామెత

★ ప్రపంచంలో రెండే రెండు ఆయుధాలున్నాయి. ఒకటి కత్తి, మరొకటి కలం.

– నెపోలియన్

★ ప్రజలకు నేనూ ఏదైనా సేవ చేస్తే అది సహనంతో ఆలోచించడం వల్లనే.

– న్యూటన్

★ దుర్బలమైన శరీరం బుద్ధిని బలహీనపరుస్తుంది.

– రూసో

★ జూదమూ, వాదమూ వేదనను కలిగిస్తాయి.

– అవ్వయ్యార్

★ సరైన వ్యాయామం ఉంటే మనసు, శరీరం రెండూ అభివృద్ధి చెందుతాయి.

– ఇ.ఇ.గ్రీన్

★ క్రీడలకు టైం లేనివారు రోగాలకు టైం ఇవ్వవలసి వస్తుంది.

– జాన్ వనమకర్

★ అన్ని మతాలను సహించగలిగేదే సర్వోత్తమమైన మతం.

– మదాం–డి.గిరార్జిన్

★ ప్రేమ గలవాడే పెద్ద బోధకుడు.

– స్పానిష్ సామెత.

★ చెడును ఉపేక్షించినవాడు మంచిని నిర్లక్ష్యం చేస్తున్నాడన్నమాట.

– టాల్‌స్టాయ్

★ ఒక పిచ్చివాని చేతిలోని తుపాకీ గుండుతో నాకు మరణమే సంభవిస్తే నేను నవ్వుతూ దానిని స్వీకరిస్తాను.

– గాంధీ

సేకరణ: టి.తిప్పారెడ్డి

# ‘హలో రంభా...!’ పై సమీక్షలు

సెప్టెంబర్ చతుర లో ప్రచురితమైన కోలపల్లి ఈశ్వర్ నవల ‘హలో రంభా...!’ పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## సస్పెన్స్

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

"హలోరంభా" ఆద్యంతం చదివింపచేసినా, రచయిత ఆశించినట్లుగా కడుపుబ్బ నవ్వులను మాత్రం ఉద్భవింపజేయలేకపోయింది.

స్వర్గనరకాల్ని, వాటి అధిపతుల్ని, సిబ్బందిని భూలోక జీవితాలకు అనుసంధానిస్తూ కేవలం కామెడీయే లక్ష్యంగా ఇదివరకు వచ్చిన రచనలు, చిత్రాల్లో క్లైమాక్స్‌ల్లో ఏదో ఒక సందేశం ఉండేది కానీ ‘హలోరంభా’లో రచయిత ఫెయిల్యూర్ అయ్యారనిపిస్తోంది.

నవలారంభంలోనూ ఆ తర్వాత మరో సందర్భంలోనూ కన్పించిన బ్రహ్మచారులు సులోచనరావ్, సుధీర్‌బాబులు మళ్ళీ అడ్రస్ లేకుండా పోయారు.

మనిషి మస్తిష్కంలో సౌందర్యానికి ప్రతీకగా స్థిరమైపోయిన దేవకీనర్తకీమణి ‘రంభ’ నవలలో తన కార్యసాధనకు భూలోకం అరుదెంచినపుడు చాలా సింపుల్ యువతిగా కన్పించడం పాఠకులను కాస్త నిరాశకు గురిచేస్తుంది.

‘స్వర్గలోక పౌరసత్వం’ కోల్పోయి... భూలోకంలోనే స్థిరపడిపోయేందుకై రంభ

ఫణీంద్రతో సంసారం చేయప్రయత్నించడం, వయాగ్రాలు వాడుతుండడం, చివరకు ఆ నిర్ణయాన్ని మార్చేసుకోవడం... పాఠకులను సస్పెన్స్‌లో ముంచి కాస్త శృంగారరసంలో ముంచితేల్చాయి.

కాగా ఒక తీరైన యాస, శైలి ఫరవాలేదనిపించే విధంగా సాగిపోయిన రచనకు అక్కడక్కడా వచ్చిన 'అంటూంట', 'పుసుక్కు న'లాంటి పదాలు ఎబ్బెట్టుగా గోచరిస్తాయి. అలాగే ఫణీంద్ర భార్యనుద్దేశించి 'పాతిక లక్షల వారసురాలు' అంటూ మాటిమాటికీ గుర్తుచేస్తూ విసుగు తెప్పించాడు.

'రంభ' స్వర్గానికి తిరోగమనమైనపుడే నవల సమాప్తం చేయకుండా రచయిత ఆ తర్వాత అనవసరపు, అయోమయపు కథతో పెంచేశారని తెల్సిపోతుంది.

స్వర్గలోక రంభ... సినిమా షూటింగుల్లో పాల్గొని, హీరోయిన్‌గా వెలుగుతుండగా, భూలోక సినిమారంభ ఫీలింగ్స్‌ను చిత్రీకరించివుంటే ఈ నవలకు నిండుదనం వచ్చి వుండేది.

–యం. రమేష్‌యాదవ్,
కరంజి - 504 312

## హాస్య ప్రయత్నం!

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

అందంగా ఉన్న అమ్మాయిని 'రంభలా' వుంది అనడం వెనుక మనమెవ్వరం చూసెరుగని ఇంద్రలోక రంభే వుందన్నది సత్యం! (కానీ ఆపేరు మన పిల్లలకు పెట్టడానికి మాత్రం సాహసం చేయం)

సరిగ్గా ఇదే పాయింట్‌ని తీసుకొని హాస్యరసభరితం చేసే ప్రయత్నంగా రచయిత కోలపల్లి ఈశ్వర్ సృష్టించిన 'హలోరంభా!' లో అభినేత్రి రంభ హైలైట్ అయి అసలు రంభను డిగ్రేడ్ చేసిందనే చెప్పాలి.

అసలు ఒకమ్మాయిని పట్టుకొని రంభలా వుందని ఎవరన్నా అన్నారంటే ఖచ్చితంగా ఇంద్రలోక నర్తకి రంభని దృష్టిలో పెట్టుకునే. కానీ ఈ నవల్లో ఫణీంద్ర, ప్రభాకర్‌లు, సుధీర్‌బాబు, సులోచనరావ్‌లు నలుగురూ రంభంటే సినీనటి రంభగానే అనుకోవడం, ఆ మాటల్ని పట్టుకొని ఇంద్రలోక రంభ అసలు రంభని నేనుండగా ఈ కొసరు రంభెవరని పంతంపట్టి ఏకాఏకి సినీనటినవుదామనుకోవడం, తర్వాతి సంఘటనలు నేలవిడిచిన సాముగా అనిపించినా హాస్యాన్ని సృష్టించడంలో మాత్రం కృతకృత్యం అయ్యాయి.

సంభాషణలపరంగా రంభ మానవలోకం వచ్చినప్పుడు ఇంగ్లీషు మాట్లాడితే ఫర్వాలేదనిపించినా స్వర్గలోకంలోని ఇంద్రుడు, శచీదేవి, ఊర్వశి, మేనక, తిలోత్తమలు, నారద మహర్షి, విఘ్నేశ్వరుడు వీరంతా ఇంగ్లీషు పదాలు పలకడం కృతకంగా వుంది. ఆ పాత్రలు గ్రాంధికంలో మాట్లాడినా హాస్యరస సృష్టికి లోటువచ్చేదికాదు.

రంభ తన స్వర్గలోక ప్రవేశ అర్హతని పోగొట్టుకోవడానికి చేసిన ప్రయత్నం చాలా చవకబారుగావుంది తప్ప స్వర్గలోకవాసుల ప్రవర్తనకు అనుగుణంగా లేదు. హాస్యంకోసం చేసిన ప్రయత్నం కనుక ఎంత కంగాళీ చేసినా ఫర్వాలేదని సరిపెట్టుకుందామన్నా కొంచెం లోతుగా ఆలోచిస్తే ఇంకా బాగా రాయొచ్చన్నది గ్రహించాల్సిన సత్యం! ఏది ఏమైనా రచయిత చేసిన ఈ హాస్యప్రయత్నం అపహాస్యం మాత్రంకాలేదు.

–కె.ఎన్నార్. నమ్మి,
పెనుగొండ - 534 320

## ఆహ్వానించదగినది

*(తృతీయ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఎండ కాస్తూనే వాన వస్తుంటే అది చూడడానికే కాక అనుభవించడానికి కూడా ఎంత ఆహ్లాదకరంగా ఉంటుందో అదేవిధంగా





హాస్యరసాన్ని కురిపిస్తూనే అందులోనే వాస్తవికతకు, మానవుల, దేవతల ప్రవర్తనలకు సరైన మేళవింపును రంగరించి ఒక మంచి హాస్యరస నవలను కోలపల్లి ఈశ్వర్‌గారు తయారుచేశారు. సోషియోఫాంటసీ సినిమాని మరిపించే రీతిలో ఇహ, పర లోకాలకి మధ్య వారధిలా ఉంది 'హలోరంభా'.

'బ్రహ్మకైనా పుట్టు రిమ్మతెగులు' అన్న సామెత ఆధారంగా సకలశాస్త్ర పారాయణుడు, సకలప్రాణి సృష్టికర్త, ఉత్కృష్టమైన పరలోకాధిపతియైన బ్రహ్మకిసైతం స్త్రీపరమైన బలహీనత ఉంటుంది. అటువంటిది తన స్వార్థంకోసం రంభ ఎంత సన్నిహితంగా మసిలినప్పటికీ హీరో ఆమెని ముట్టుకోడు. తనకోసం ఎంతో ఖర్చుచేసిన మనిషికి ఎన్నోఆశలు కల్పించి, తన స్వార్థానికి అతనిని పావుగా వాడుకుని తర్వాత తన పంతం చెల్లదని తెలిసి నిర్దాక్షిణ్యంగా అతన్ని వదిలి వెళ్ళిన రంభే మానవుల నీచత్వాన్నీ, సంకుచితబుద్ధిని విమర్శించడం దయ్యాలు వేదాలు వల్లించినట్లుంది.

అభినేత్రి రంభని ఒక దశలో బెదిరించయినా సినీఫీల్డునుండి తప్పించేయాలని ఆలోచించింది పరలోక రంభ. నటనారంగంలో ఉన్న ఇబ్బందులు తెలిశాకా సినీరంభని స్విమ్మింగ్‌పూల్‌లో చూసి అసహ్యించుకుని కూడా తను ఆ రంగంలోనే కొనసాగాలనుకోవడం దేవనర్తకీమణి ద్వంద్వవైఖరిని ప్రస్ఫుటం చేస్తుంది. రంభప్రయత్నం ఫలించి సినీహీరోయిన్‌గా స్థిరపడి ఉంటే ఫణీంద్రను పెళ్ళి చేసుకునేదా? ఫణీంద్రతో ప్రేమవ్యవహారం, సంపర్కం పెట్టుకోవాలనుకోవడం, తను భూలోకానికి వచ్చేయాలనుకోవడం అన్నీ ఆమె స్వార్థం, గర్వాలను తెలుపుతున్నాయి. యుగయుగాలుగా జీవిస్తూ, అనారోగ్యమెరుగని, ఆకలిదప్పులు తెలియని అమృతాన్ని సేవిస్తున్న దేవతలే అలా నీచంగా, స్వార్థంగా ఆలోచిస్తుంటే ఊపిరి పోసుకున్నది మొదలు ఆ ఊపిరి ఎప్పుడు ఆగుతుందో తెలియని అయోమయస్థితిలో జీవితాన్ని గడుపుతున్న మానవుడు వారికంటే ఉన్నతంగా ఎలా ఆలోచించగలడు? అక్కడక్కడా సిల్క్‌స్మిత, ఎన్టీఆర్‌ల పేర్లు ఉపయోగించడం సందర్భసహితంగా ఉంది. వాస్తవికతతో ఆలోచించి జీవితాన్ని మలచుకునేవారికి వారిజీవితం పుష్పక విమానంలా ఉంటుందని ప్రభాకర్ పాత్రద్వారా తెలిపారు. కొన్నికొన్ని తప్పులు తప్పిస్తే నవల హాస్యరసభరితంగానే సాగిందని చెప్పవచ్చు.

ఏదేమైనా చతుర నవలా ప్రవాహంలోకి కొత్తదైన ఒక సోషియోఫాంటసీ వచ్చి కలిసింది. ఇది అభినందనీయమూ, ఆహ్వానించదగినదీనూ!

–యం.చినవెంకటరావు,
మహాదేవపురం - 507 203

## రంభాయణం

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

సెప్టెంబర్ నెల 'చతుర' నవల హలో రంభా గురించి రాయాలనుకుంటే నవ్వొస్తుంది తప్ప పెద్దగా అందులో కథ ఏమీ లేదు. కాకపోతే ఇందులో ఆయన దేవలోకం గురించి మలచినపాత్రలూ, ఆయన శిల్పం హాస్యభరితంగా వున్నాయి. మనిషికి మనిషి ఎదురైై ఒకమాటంటే, వాడు మరో మాటకు అవకాశం యివ్వకుండా మనల్ని ఉతికి ఆరేస్తాడు. ఈ రచయిత ఉపయోగించుకున్న దేవతలు పాపం ఈయన ఎన్నిరకాలుగా వాళ్ళను మలిచినా ఏమీ అనరు. ఆఖరున 'అబ్బే ఏమీలేదు. ఇదంతా నా ఊహే' అన్నా మాట్లాడలేరు. ఆ దేవలోకంలో ఎప్పుడు ఏం జరిగిందో, ఏముందో మనకు తెలీదుగానీ ఈ మానవుడు ఆ దేవుణ్ణి ఉపయోగించుకుంటున్నతీరు

మాత్రం హాస్యస్ఫోరకంగావుంది.

అలాగే రంభపాత్ర. భూలోకంలో ఒక రంభ పేరును ఆధారం చేసుకుని ఇంత 'రంభాయణం' సృష్టించడం రచయిత ప్రతిభే. ఊహల్లో చాతుర్యం చూపించినందుకు ఆయన్నభినందించాలి.

ఇందులో రంభ చుట్టూ తిరిగిన పాత్రలూ, అవి నాగరిక ప్రపంచానికి ఉపయోగించుకున్న తీరూ బావుంది. రంభ అనుకున్నట్లే అల్పమానవుడు 'ఆడపిల్ల' చూపు పడగానే పరవశించిపోతాడు. ఫణీంద్రా, ప్రభాకర్‌ల ఉబలాటం పాఠకులకు బాగా నవ్వు తెప్పించింది.

**–అడబాల రాజ్యలక్ష్మి,**
హైదరాబాద్ - 500 047

## నాటకీయత

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

దేవతల ఆకారాలూ, హరి వేషధారణ, సంభాషణలూ వీటికి సంబంధించిన కథలన్నీ మనకెంతో ఆశ్చర్యాన్నీ, హాస్యాన్నీ కలిగిస్తుంటాయి. ఈపద్ధతిలో దేవతల్ని భూమ్మీదకి దింపి, మానవులమధ్య జీవించడం ద్వారా అన్నీ కొత్తరకమైన సంఘటనల్నీ, సన్నివేశాల్నీ సృష్టిస్తే ఇక ఆ రచన సంపూర్ణమైన హాస్యరసాన్నందిస్తుంది. ఈ కోవకి చెందిన రచనే కోలపల్లి ఈశ్వర్ 'హలోరంభా'

నవలలో చక్కని నాటకీయత ఉంది. సమకాలీన పరిస్థితులకనుగుణంగా దేవతాపాత్రల్ని స్పందింపచేయడం గోచరిస్తుంది. మూలవస్తువులో పెద్దగా పటుత్వం లేకపోయినా, నడిపించిన తీరు, చనిపోయిన సిల్క్‌స్మితలాంటి వాళ్ళకి స్వర్గద్వారాల్ని తెరవడం, ఆ పాత్రల్ని సమయస్ఫూర్తిగా ఉపయోగించుకోవడం పాఠకులకు ఆశ్చర్యాన్ని గొలుపుతుంది.

మానవుల్ని చపలచిత్తులుగా భావించిన రంభ, ఒక్కసారిగా సినిమాఛాన్స్ మిస్సయ్యేసరికి అభినేత్రి రంభపై తనకున్న పగను తీర్చుకోకుండా, అకస్మాత్తుగా మళ్ళీ స్వర్గానికే వెళ్ళిపోవడం ఔచిత్యంగాలేదు. అలాగే మొదట ప్రభాకర్, ఫణీంద్రలతోపాటుగా రంభ సులోచనరావ్, సుధీర్‌లను కూడా కలిసింది. కానీ వారి పాత్రలు మళ్ళీ ఎక్కడా నవల్లో తొంగిచూడలేదు. మానవుల అలవాట్లు, హాబీలు దేవతలకి అంటగట్టడం అనౌచిత్యమే అయినా అది హాస్యరసస్ఫోరకంగా ఉంది కాబట్టి ఫర్వాలేదు.

ఈ నవల మొత్తం కథాబలం లేకపోయినా కథనశైలిపైనే నడిచినప్పటికీ ముగింపులో ఒక అద్భుత సత్యాన్ని ఉపదేశించింది. 'తావలచినదియదియెరంభ తధ్యము సుమతీ' అని సుమతీకర్త అన్నట్లుగా మానవులంతా పదేపదే తమ దురదృష్టాన్ని తిట్టుకోకుండా, భార్య అందంగా లేకపోయినా రంభలా ఊహించుకుని తృప్తిపడుతూ భార్యను కూడా సంతోషపెడతారు. ఈ భావనే లేకపోతే భూలోకంలో ఎవరూ ఎవరితోనూ కాపురాలు చెయ్యలేరు. ఈ సత్యాన్ని సున్నితంగా స్పృశించింది ఈ నవల.

**–అద్దంకి శ్రీనివాస్,**
విశాఖపట్నం - 530 043

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011: Tadepalligudem: 28881: Warangal: 59933.

